# తెలుగు వాగ్గేయకారులు

## అన్నమయ్య విలక్షణ వ్యక్తిత్వం


రామదాసు


క్షేత్రయ్య


అన్నమయ్య


రామదాసు


సారంగపాణి




ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001.

# తెలుగు వాగ్గేయకారులు:
# అన్నమయ్య విలక్షణ వ్యక్తిత్వం




ప్రధాన సంపాదకులు
జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
**ఆచార్య సి. నారాయణ రెడ్డి**
అధ్యక్షులు, ఆంధ్ర సారస్వత పరిషత్తు

సంపాదకులు
**ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**
ప్రధాన కార్యదర్శి, ఆంధ్ర సారస్వత పరిషత్తు

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001.

Telugu Vaggeyakarulu:
Annamayya Vilakshana Vyaktitwam

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 2006

ప్రతులు : 1000

మూల్యం : రూ. 70/-

ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001.
ఫోన్: +91-40-24753724

ముద్రణ :
విప్ల కంప్యూటర్ సర్వీసెస్
(డిజైనర్స్ & మల్టీకలర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్)
నల్లకుంట, హైదరాబాద్ - 500 044.
ఫోన్: +91-40-27676910, 65348445

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
**ఆచార్య సి. నారాయణ రెడ్డి**
అధ్యక్షులు
ఆంధ్ర సారస్వత పరిషత్తు

# అవతారిక

దాక్షిణాత్య భాషల్లో ప్రప్రథమ వాగ్గేయ కారుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. కన్నడ వాగ్గేయకారుడైన పురందరదాసు కూడా అన్నమయ్య తరువాతివాడే. అన్నమయ్య తెలుగులో పదకవితా రచనకు శ్రీకారం చుట్టడం తెలుగుజాతి అదృష్టం.

వాగ్గేయకారుడంటే ఎవరు? ఇందుకు సమాధానం సంస్కృత లాక్షణికుడు శార్ఙ్గదేవుడిచ్చిన నిర్వచనం "వాచం గేయంచ కురుతే యః స వాగ్గేయకారకః". అంటే వాగ్గేయకారుని రచన ధాతుమాతువుల సంయోగం కలదన్నమాట. ఇంతకు ధాతువు అంటే సంగీతం, మాతువు అంటే సాహిత్యం. ఒక్క వాక్యంలో కుదించి చెప్పాలంటే ఎవరు స్వయంగా గీత రచన చేసి స్వరాలు కూర్చి గానం చేస్తారో వారు వాగ్గేయకారులు. అన్నమయ్య 32,000ల కీర్తనలను రచించాడని, లభించినవి 14,000లని చారిత్రకుల అంచనా. వీటిలో కొన్నిటిని స్వరపరిచిన వారిలో ప్రథమ గణ్యులు రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారు. అన్నమయ్య పదాల్లో భావ పుష్టి, రాగ దృష్టి సమాంతరంగా సాగిపోతాయి. ఐతే, కొన్నిటిలో మాతు ప్రాధాన్యం స్ఫుటంగా గోచరిస్తుంది. మచ్చుకు-

"తనువే గుడియట తలయే శిఖరమట
కనుగొన చూపులే ఘనదీపములట"

కవిత్వాన్ని పుక్కిట పట్టుకున్న రసవత్ పంక్తులివి.

అన్నమయ్య కృతుల్లో ఒకవైపు ఆధ్యాత్మిక దృష్టి మరొకవైపు సామాజిక దృష్టి హృదయంగమ ఫణితిలో అగుపిస్తాయి. 'పండితాః సమదర్శినః' అన్న భగవద్గీతోక్తికి "బ్రహ్మ మొక్కటే" అనే అన్నమయ్య పదం సురుచిరప్రతిబింబం. ఆ కృతిలో అన్నమయ్య అంటాడు. -

"మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమి ఒకటే
చండాలుడుండేటి సరి భూమి ఒకటే."

ఇదీ సమదర్శనమంటే.

అత్యంత పరిణత పద్యకవుల రచనలతో సరితూగే పదాలతో పాటు నాటి జానపద గీతాల బాణీల్లో అన్నమయ్య ఆణిముత్యాల్లాంటి పాటలు రచించాడు. "అల్లోనేరెళ్లో" పాటలు, "జాజిరి" పాటలు, "లాలి" పాటలు, "ఉయ్యాల" పాటలు, "సువ్వి" పదాలు - ఇలా మరెన్నో.

అన్నమయ్య సంకీర్తన నిధులు ఇంకా కొన్ని అలబ్ధంగానే ఉన్నాయి. వాటిలో డా.శోభారాజు గారు కొన్నిటిని సేకరించి "అన్నమయ్య గుప్త సంకీర్తన ధనం" పేర ఒక గ్రంథాన్ని ప్రచురించి 2002 సంవత్సరంలో నాచేత ఆవిష్కరింపజేశారు.

అన్నమయ్య తరువాతి తెలుగు వాగ్గేయకారులే రామదాసు, క్షేత్రయ్య, త్యాగయ్య, సారంగపాణి మొదలైనవారు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహకారంతో ఆంధ్ర సారస్వత పరిషత్తు "తెలుగు వాగ్గేయ కారులు: అన్నమయ్య విలక్షణ వ్యక్తిత్వం" అనే శీర్షికతో సదస్సును నిర్వహించింది. ఆ సదస్సులో పాల్గొన్న విద్వన్మణుల ప్రసంగ వ్యాసాలను పరిషత్తు ఈ సంపుటి రూపంలో ప్రచురిస్తున్నది.

సదస్సు నిర్వహణలో ప్రశంసనీయ పాత్ర వహించిన అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టరు విద్వత్కవీంద్రుడు డా.మేడసాని మోహన్ అభినందనీయుడు. అన్నమాచార్య కృతులతో పాటు రామదాసు, క్షేత్రయ్య, త్యాగరాజు, సారంగపాణి లాంటి ప్రముఖ వాగ్గేయకారుల తులనాత్మక పరిశీలనం ఈ సంపుటిలో పరిగణింపదగిన అంశం.

ఈ సంపుటి సమస్త సాహితీవ్రతులకు, ప్రత్యేకించి పదకవితా ప్రియులకు ఉపయుక్తంగా ఉంటుందని ఆశిస్తున్నాను.

హైదరాబాదు,
6.10.2006

డా॥ సి. నారాయణ రెడ్డి

# ముందుమాట

ఆరు దశాబ్దాలకు పైగా ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలుగు భాషా సాహిత్య సంస్కృతుల వికాసాభ్యుదయాల కోసం విలక్షణ కార్యక్రమాలను నిర్వహిస్తోంది. ప్రత్యేకించి పరిషత్తు ఏర్పాటు చేసే సదస్సులను సాహితీవేత్తలు, కళారంగప్రముఖులు హర్షామోదాలతో స్వాగతిస్తున్నారు. పరిషదధ్యక్షులు, జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డిగారు ఈ సదస్సులకు రూపకల్పన చేయడంతోపాటు నిర్వహణకు పథనిర్దేశంకూడా చేస్తున్నారు. అందుకే ప్రతి సదస్సూ వైశిష్ట్యాన్ని సంతరించుకుంటోంది.

ఈ పరంపరలో భాగంగా 2006 ఏప్రిల్ 7 నుండి 9 వరకు "తెలుగు వాగ్గేయకారులు: అన్నమయ్య విలక్షణ వ్యక్తిత్వం" అనే అంశంపైన జాతీయ సాహితీసదస్సు సారస్వత పరిషత్తు ప్రాంగణంలో వున్న డా దేవులపల్లి రామానుజరావు కళా మందిరంలో జరిగింది. తిరుమల తిరుపతి దేవస్థానం, అన్నమాచార్య ప్రాజెక్టు (తిరుపతి), ఆంధ్ర సారస్వత పరిషత్తు సంయుక్త ఆధ్వర్యంలో ఈ సదస్సును నిర్వహించాం. హరికీర్తనాచార్య సంకీర్తనాచార్య, పదకవితా పితామహ బిరుదాంకితుడైన అన్నమయ్య 'సంకీర్తన లక్షణమ్' అనే లక్షణ గ్రంథాన్ని రచించి, దానికి లక్ష్యప్రాయంగా విరాజిల్లే ముప్పై రెండు వేల సంకీర్తనలను భక్తకోటికి వరాలుగా ప్రసాదించాడు. పదకవితా ప్రక్రియకు సమున్నత స్థానం చేకూర్చాడు ఈ స్ఫూర్తితో తదనంతర వాగ్గేయకారులు తమ రచనల ద్వారా తెలుగు సాహిత్యాన్ని మరింత సుసంపన్నం చేశారు.

మూడు రోజుల పాటు జరిగిన ఈ జాతీయ సదస్సులో ముప్పై మంది పండితులు పాల్గొని అన్నమయ్య సంకీర్తనలు, రామదాసు కీర్తనలు, త్యాగయ్య కృతులు, క్షేత్రయ్య పదాలు, సారంగపాణి పదాలపై విశ్లేషణాత్మకంగా ప్రసంగించారు.

వీరిలో తమ అమూల్య ప్రసంగ పాఠాలను మాకు అందించిన పద్దెనమిది మంది వక్తల వ్యాసాలను పొందు పరచి గ్రంథ రూపంలో ప్రచురిస్తున్నాం.

సదస్సు సంయుక్త ఆధ్వర్యానికి సమ్మతించి, సంపూర్ణ సహకారం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికీ, అన్నమాచార్య ప్రాజెక్టు సంచాలకులు, ప్రముఖావధాని డా. మేడసాని మోహన్‌గారికీ మా ప్రత్యేక ధన్యవాదాలు. సదస్సులో పాల్గొన్న ప్రముఖలకూ, పండితులకూ, గాయక బృందాలకూ మా కృతజ్ఞతలు. ఈ సంపుటిని తీర్చిదిద్దడంలో సహకరించిన డా. డి. చంద్రశేఖర రెడ్డి గారికీ, గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ అధినేత శ్రీ ఎం. విజయసేనారెడ్డిగారికీ కృతజ్ఞలు తెలియజేస్తున్నాం.

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
ప్రధాన కార్యదర్శి
ఆంధ్ర సారస్వత పరిషత్తు

స్థలం: హైదరాబాదు
తేది : 10-10-2006

# కీలకోపన్యాసం

## పదకవితా పితామహుడు - అన్నమయ్య

**కవి కాలం:** అన్నమయ్య కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్ళపాక గ్రామంలో క్రీ.శ. 1408లో లక్కమాంబ, నారాయణసూరి దంపతులకు జన్మించాడు. క్రీ.శ. 1503లో పరమపదించినట్లు తెలుస్తూంది. బాల్యం నుండీ శ్రీ వేంకటేశ్వర స్వామి పై అత్యంత భక్తి విశేషం కలిగి ఉండెడివాడు. తన పదునారవయేటనే శ్రీ వేంకటేశ్వర స్వామి సాక్షాత్కారాన్ని పొంది అప్పటి నుండీ దినానికొక్క సంకీర్తన తక్కువ కాకుండా ముప్పది రెండు వేల సంకీర్తనల్ని రచించాడు. తెలుగు వాఙ్మయంలో తొలి తెలుగు పదకారుడై "పదకవితా పితామహుడు" అని ప్రసిద్ధుడైనాడు.

**సాంఘిక పరిస్థితులు:** పన్నెండు, పదమూడు శతాబ్దాల్లో వీరశైవ కవులు విజృంభించి ఆ వాఙ్మయానికి విశేష ప్రచారం, ప్రాచుర్యం కల్పించారు. తిక్కన హరిహర నాథాద్వైత స్థాపనంతో మతవైషమ్యాలు కొంతతగ్గాయి. హరిహర నాథాద్వైత సిద్ధాంతానికి సంబంధించిన వేదాంత విషయాలు సామాన్య జనుల్లోకి చొచ్చుకు పోలేదు. కాబట్టి జానపదుల్లో మాత్రం మత వైషమ్యాలు అలాగే ఉన్నాయి. మత దృష్టి కంటె, దైవ దృష్టితో అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర స్వామిపై భక్తి స్ఫోరకంగా సంకీర్తనలు రచించడం ప్రారంభించాడు. ఈయన పదాల్లో ఉండే గొబ్బి పాటలు, జోలపాటలు, జాజర పాటలు ఈ విషయాన్ని ధ్రువపరుస్తాయి. వేదాంత ధోరణి లోనే చెప్పినా జానపదులకు సులభగ్రాహ్యంగా ఉండదు. అందువల్ల జానపదుల అనుభవంలో ఉన్న శృంగారాన్ని ఆలంబనం చేసికొని మత, భక్తి విషయాలు ప్రతిపాదిస్తూ సంకీర్తన రచన గావించాడు. వ్యావహారిక భాషా పదాల్ని విరివిగావాడి ప్రప్రథమంగా అటువంటి భాషకు బహుళ ప్రయోగార్హత కల్పించాడు. ఆబాల గోపాలాన్ని అలరింపజేసే సంగీతంతో తన మధుర సంగీతాన్ని జోడించాడు. ఈ

సంకీర్తనలు 1. అధ్యాత్మ సంకీర్తనలు 2. శృంగార సంకీర్తనలు అని రెండు విధాలుగా వర్గీకరింపబడ్డాయి. ఇవన్నీ రాగిరేకుల్లో లిఖింపబడి తిరుమల శ్రీవారి ఆలయ ప్రాంగణ మందలి సంకీర్తన భండారంలో నిక్షిప్తం చేయబడ్డాయి.

**రచనలు:** అన్నమయ్య మనుమడయిన తాళ్ళపాక చిన్నన్న "అన్నమాచార్య చరిత్రము"ను వ్రాశాడు. అందన్నమయ్య కృతుల్ని గూర్చి ఇట్లు పేర్కొన్నాడు.

యోగ మార్గంబున నొకకొన్ని, బుధులు
వైరాగ్య రచనలో వాసింపఁ గొన్ని
రాగిల్ల శృంగార రసరీతిఁ గొన్ని
సారస నేత్రుపై సంకీర్తనములు.
సరసత్వమునఁ దాళ సముఖముల్ గాగ
పరమ తంత్రములు ముప్పది రెండు వేలు
ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున
నవముగా రామాయణము, దివ్యభాష
నా వేంకటాద్రి మాహాత్మ్య మంతయును
గావించి, రుచుల శృంగార మంజరియు
శతకముల్ పదిరెండు సకల భాషలను
ప్రతిలేని నా నా ప్రబంధముల్ చేసి

పై ద్విపదను బట్టి అన్నమయ్య ముప్పది రెండు వేల సంకీర్తనలు, ద్విపదలో రామాయణము, సంస్కృతమున వేంకటాచల మాహాత్మ్యము, శృంగార మంజరి, పండ్రెండు శతకాలు రచించినట్టు తెలుస్తూంది. ఇవిగాక సంస్కృతంలో సంకీర్తన లక్షణం వ్రాసినట్లు విమర్శకులు పేర్కొంటున్నారు. ఇందులో సంకీర్తన భండారం నుండి మనకు లభించిన కృతులు ఈ క్రిందివి మాత్రమే.

శృంగార మంజరి - (ద్విపద) - 5 రేకులు
అధ్యాత్మ సంకీర్తనలు - 363 రేకులు; 2178 సంకీర్తనలు
శృంగార సంకీర్తనలు - 1921 రేకులు; 11,526 సంకీర్తనలు
వేంకటేశ్వర శతకము - 108 పద్యాలు

**కవితాదృష్టి:** అన్నమయ్య హరిభక్త పరాయణుడు. తన పదునారవయేటనే శ్రీ వేంకటేశ్వర స్వామి సాక్షాత్కారాన్ని పొంది జీవితాంతం స్వామి సంకీర్తనము నందే గడిపినాడు. తాననుభవించిన మధుర భక్తి భావనా విలసితమైన అనుభూతిని భావి

ఆంధ్రులకు పంచిపెట్టుటే అన్నమయ్య కవితా ధ్యేయం. ఈయన సంకీర్తనా వాఙ్మయమందంతటా క్రింద పేర్కొన్న నవవిధభక్తి విశేషాలు తారసిల్లు తుంటాయి.

"తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ దాసత్వమున్, వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి, స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబుదైత్యోత్తమా"

జానపదులకు సైతం మధురభక్తి సంభరితమైన ఆనందాన్ని కల్గించడం కోసం అన్నమయ్య శృంగారం స్వీకరించినట్లు తెలుస్తున్నది. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో పైకి శృంగారం కన్పించినా, ఆలోచనా శీలురైన రసభావుకులకు అనంత అధ్యాత్మభావనా సౌందర్యం గోచరిస్తుంది. ఉదా॥

తరుణి నీయలుక కెంతట దింతినీ వేళ
కరుణించ గదర వేంకటశైల నాథా " — "
ఒకమారు సంసారమొల్లఁ బొమ్మని తలచు
ఒకమారు విధి సేఁత లూహించి పొగడు
ఒకమారు తనుజూచి వూరకే తలవూఁచు
ఒకమారు హర్షమున నొందిమేమఱుచు " — "
నిన్ను జూచి వొకమారు తలపోసినగును
కన్నుదెరచి నినుఁజూచి కడు సిగ్గువడి నిలిచి
యిన్నియునుఁ దలపోసి యింతలో మఱచు " — "
వదలైన మొలనూలు గదియించు నొకమారు
చెదరని కురులెల్లఁజెరుగు నొకమారు
అదనెరిగి తిరువేంకటాధీశ! పొందితిని
చదురుఁ డవు నినుఁ బాయఁ జాలదొకమారు " — "

ఈ సంకీర్తనంలో ఒక నాయిక నాయకుడైన స్వామిని గూర్చి పరితపిస్తోంది. ఆమె పరితాపాన్ని తన చేష్టా విశేషాలతో వ్యక్తం చేస్తోంది. నిరంతర పరమేశ్వర ధ్యానంలో పరిణతి చెందిన అవధూత కూడా పరమాత్మ సాయుజ్యంకై పరితపించేటప్పుడు అట్టివాని చేష్టావిశేషాలు కూడా ఇట్లే ఉంటాయి. ధూర్జటికవి ఒకచోట అవధూత లక్షణాల్ని ఇలా పేర్కొంటాడు.

"అర గంటంగనుగొంట, మందగతిఁ బూర్ణా హంకృతిన్, ప్రార్థనా

కరభుక్తి స్థితి, ముక్తలోకభయ శంకావృత్తి నున్మత్తన
వ్యరతిన్, సత్త్వసమగ్రతన్, మృదిత పద్మాభ్యున్నతిన్, గంధమం
ధర దంతావళ కోటి యొప్పు, నవధూత ప్రక్రియన్ తత్పురిన్"

సంసార మొల్లఁ బొమ్మనుట, విధిసేత లూహించుట, తలపోసి నగుట, ఇవన్నియు కన్నులరమోడ్చి ధ్యానించు, దృష్టి నంతర్ముఖము గావించు మొదలగు అవధూత లక్షణములతో సమన్వయింప బడుచున్నవి. అన్నమయ్య తన సంకీర్తనా వాఙ్మయము నందంతటను ఇట్టి బహు భావ స్ఫోరకరచనా పాటవాన్ని చూపి ఉన్నాడు.

**భాషాదృష్టి:-** తాననుభవించిన భావనానందాన్ని వ్యక్తీకరించడానికి అన్నమయ్య సంగీత సాహిత్యాల్ని సాధనంగా చేసికొన్నాడు. అన్నమయ్య బహుశాస్త్రనిష్ణాతుడు. సంస్కృతాంధ్రాలలో ప్రచండమైన అభినివేశం ఉండినట్లు తెలుస్తూంది. సామాన్యులకు సైతం సుగ్రాహ్యంగా ఉండటానికై అలతియలతి వ్యావహారిక పదాలకు గూడా తన వాఙ్మయంలో వలసినంత చోటునిచ్చి అర్థ సౌలభ్యంతో పాటు కావ్య భావనా సౌరభం కూడా గల్గించాడు. మాత్రా చంధస్సును బాగుగా జీర్ణించుకొని యతి ప్రాసలందు చాలా నిక్కచ్చిగ వ్యవహరించిన కవి.

పిడికిటి తలఁబ్రాల పెండ్లి కూఁతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లి కూఁతురు " —— "
పేరుకల జవరాలె పెండ్లి కూఁతురు పెద్ద
పేరుల ముత్యాల మెడ పెండ్లి కూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లి కూఁతురు విభుఁ
బేరుకుచ్చ సిగ్గువడీఁ బెండ్లి కూఁతురు " —— "
బిరుదు పెండెము వెట్టె పెండ్లి కూఁతురు, నెర
బిరుదు మగని కంటె పెండ్లి కూఁతురు
పిరిదూరినప్పుడె పెండ్లి కూఁతురు పతిఁ
బెరరేఁచీ నిదివో పెండ్లి కూఁతురు " —— "
పెట్టెనె పెద్ద తురుము పెండ్లి కూఁతురు, నేడె
పెట్టెడు చీరలు గట్టెఁ బెండ్లి కూఁతురు
గట్టిగ వేంకటపతి కౌఁగిటను వడి
పెట్టిన నిధానమైన పెండ్లి కూఁతురు " —— "

పై సంకీర్తనం వ్యావహారిక భాషాప్రయోగ విలసితమై ఉంది. ఇటువంటి సంకీర్తనలు అన్నమయ్య భాషలో కోకొల్లలు. ఇతని రచన తిక్కన రచనవలె దేశపద బహుళమని చెప్పదగును. క్రీ.శ. పదునైదవ శతాబ్దం నాటి వ్యావహారిక భాషా స్వరూప స్వభావాలు ఈతని వాఙ్మయం వల్ల తెలుస్తున్నాయి. బాయిట (354-1), మాట (62-1), అయిరాణి (189-2), వాండ్లు (125-2), రండు (రెండు) (378-7) యాల (ఏల) మొదలగు యథేచ్ఛా ప్రయోగాలు నాటి వ్యవహారంలో ఉండి ఉండవచ్చు. వది నెంటా (వదిన+అంటా), మట్టేకు (మట్టి+ఆకు), వ్రాసెంపినది (వ్రాసి+అంపినది) మొదలగు రూపాలు ప్రత్యేకతను సంతరించుకొన్నాయి.

ఎంత వ్యావహారిక భాషాఖనియైనా ప్రాబంధిక ధోరణిని గుర్తుకు తెచ్చు పదాలు, సమాస ఘటన, వర్ణనలు అన్నమయ్య సంకీర్తనల్లో లేకపోలేదు.

"చల్లనై కాయఁగదో చందమామా నీ
వెల్లఁగాఁ దిరు వేంకటేశు నెదుర
మొల్లమిగ నమృతంపు వెల్ల గొల్పుచు, లోక
మెల్ల నినుఁ గొనియాడఁ గాను " —— "
తన దివ్యమందిరోపాంత ఘన మార్గమున
ఏకాంత సుఖ గోష్ఠి సింపొంద మానవా
నీ కంబులెడఁ గలసి నిలిచి సేవింప కా
తాకదంబముల హస్తముల కంకణఝణ
త్కారములు నిగుడఁ జామరము లిడఁగ-
మంగళాత్మకములగు మహిత వేదాంత వే
దాంగ విద్యలకు ప్రియ మంది చేకొనుచు......(2 సం.పు॥ 228 సం.కీ॥)

లాంటి సంకీర్తనల్లో సామాసిక ధారతో గూడిన శయ్యా విశేషం గోచరిస్తుంది. అన్నమయ్య సంకీర్తనలలో ప్రత్యేకంగా శృంగార సంకీర్తనలను అధ్యయనం చేస్తే తరువాత 16వ శతాబ్దంలో ఇతోధికంగా విస్తరించిన ప్రబంధసాహిత్యానికి పునాదులు వేసిన కవితా మూర్తి అన్నమాచార్యులవారే - అన్న అంశం స్పష్టమౌతుంది. ప్రబంధ లక్షణాలుగా మనం ప్రధానంగా పేర్కొంటూ ఉన్న అష్టాదశవర్ణనలు, నాయిక యొక్క అంగాంగవర్ణన - ల వంటి అంశాలు అన్నమయ్య సంకీర్తనలలో విస్తారంగా ఉన్నాయి. ప్రబంధకవులను ఉత్తేజపరచిన సాహిత్యం అన్నమయ్య పదసాహిత్యం. ఈ సంకీర్తనలలోని భావజాలాన్ని, సౌందర్య దృక్పథాన్ని ప్రబంధకవులు బాగా వాడుకున్నారు.

"మదిని బండారము మగువ మేను
పొదిగొన్న వలపులఁ బొసఁగె గాన " — "

మరుని యాయుధశాల మరుని కొప్పు
తొరలించి విరులెల్లా దురిమెఁ గాన
యిరవై కీరములాయ నీపె గళము
సరసపు మాట లెల్లా జరపెఁ గాన " — "

కాముని సాము గరిడి కాంత వురము
ఆమని చను సంగడాలమరెఁ గాన
ప్రేమపుఁ గేళాకూళి గంభీర నాభి
తేమ చెమటల చేత దిగుపారెఁ గాన " — "

కాంతుని వేట పొలము కన్నెపిఱుదు
బంతి మొలనూళ్ళ పోఁగు వారెఁ గాన
అంతటి వాని తల్లి యీ అలమేల్మంగ
యింతలో శ్రీ వేంకటేశు నెనసెఁ గాన " — "

- ఇటువంటి కీర్తనలలోని అన్నమయ్య ఆలంకారిక సౌందర్య దృక్పథం ప్రబంధ కవులకు మార్గ దర్శకం - అని పేర్కొనవచ్చు.

ఈ క్రింది సంకీర్తనలలో నాయిక అంగాంగ వర్ణనం పై అంశానికి ఇంకా బలం చేకూరుస్తుంది.

"నెలత చక్కదనమే నిండు బండారము నీకు
గలిగె కనకలక్ష్మి కాంతుడి వైతివి " — "

పడతి నెమ్మోమునకు బంగారు కళలు దేరీ
వెడలే సెలవి నవ్వే వెండి గనులు
అడియాలమగు మోవినదె పగడపుదీగె
నిడువాలుదనమే నీలముల రాశి " — "

తరుణి పాదపు గోళ్ళు తళుకుల వజ్రములు
పరఁగు జేతిగోళ్ళె పద్మరాగాలు
అరిదె కన్నుల తేట లాణి ముత్తెపుసరులు
సరిఁ బచ్చల కొండలు చనుమొనలు " — "

చెలితేనె మాటలు జిగిఁ బుష్యరాగాలు
వలపు తెర సిగ్గులు వైడూర్యాలు
తొలఁకు ననురాగాలే దొడ్డగోమేధికాలు
కలసితీకొను శ్రీ వేంకటేశు కౌఁగిటను " — "

- ఇటువంటి కీర్తనలన్నీ అల్లసాని పెద్దనాదులను బాగా ప్రభావితం చేసి ఉంటాయి - అని చెప్పడానికి తగిన సామగ్రి ప్రబంధ సాహిత్యంలో ఉంది.

భారతీయ విజ్ఞాన సర్వస్వానికి మూలకందాలైన వేద, ఆగమ, శాస్త్ర, ఉపనిషత్, ఇతిహాస - వంటి వాఙ్మయ ప్రక్రియల సారాంశమంతా అన్నమయ్య కీర్తనలలో ఉంది. ఈ అనంత వాఙ్మయ సారాంశాన్ని శ్రీ వేంకటేశ్వర స్వామి తత్త్వంతో, మహత్త్వంతో సమన్వయించి సంకీర్తనా రచన సాగించిన పదకవితా పితామహుడు అన్నమయ్య.

"చండాలు డుండేటి సరిభూమి ఒకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి ఒకటే"

"ఏ కులజుడైన నేమి, ఎవ్వడైననేమి
ఆ కడనాతడె హరి నెరిగినవాడు"

"విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల దదియే జాతి" -

వంటి కీర్తనలలో ఆనాడే కులతత్త్వాన్ని ఘాటుగా నిరసించినాడు. ఇటువంటి సందేశాత్మక కీర్తనలను కూడా అన్నమయ్య పుష్కలంగా రచించినాడు.

**- డా. మేడసాని మోహన్**

# ఇందులో . . .

# అన్నమయ్య సంకీర్తనలు - విశ్లేషణ

ఆచార్య కడప రమణయ్య

**నా**రాయణుడే శ్రీ వేంకటేశ్వరుడు. నరుడే అన్నమాచార్యుడు. అన్నమయ్యకు వేదపురాణేతిహాసపరిజ్ఞానం, సంగీత సాహిత్యాల్లో అభినివేశం, అనేక భాషల అధ్యయనం, జానపదుల బాణీలు - అన్ని అవగతమే. అన్నమయ్య ప్రజాకవి. ఆంధ్ర వాగ్గేయకారుల్లో ఆద్యుడు, అగ్రగణ్యుడు.

సకలవేదములు - సంకీర్తనలు చేసి
ప్రకటించి నినుబాడి - పావనుడైన,
అకలంకుడు, తాల్లపా - కన్నమాచార్యులు - (6-24)

అని అన్నమయ్య సంతతివారు శ్రీ వేంకటేశ్వరస్వామిని ఉద్దేశించి పాడిన పాట. దీన్న బట్టి అన్నమయ్య పదాల ప్రభావం తెలుస్తుంది.

తాళ్ళపాక పదకవుల సాహిత్యంలో ప్రధానంగా గుర్తించదగ్గ అంశాలు కొన్ని వున్నాయి.

1. శృంగార ఆధ్యాత్మిక కీర్తనలనే విభాగం ప్రత్యేకంగా చేయడం
2. సంకీర్తనల్ని రాగిరేకుల మీద చెక్కడం
3. పల్లవి మూడుచరణాలుకల్గి వుండటం
4. వియోగం వర్ణించినా చివరకు స్వామితో సంయోగం చెప్పడం
5. శ్రీ వేంకటేశ్వరుని ఉత్సవాల్ని తెల్పే అనేక కీర్తనల్ని రాయడం
6. అన్నమయ్య పద్ధతిలో పెద, చినతిరుమలయ్య రచనలు చేయడం
7. జానపదుల బాణీలు వాడటం
8. శైవసాహిత్యానికి దీటుగా వైష్ణవ సాహిత్యాన్ని సృష్టించడం

9. తెలుగు తనానికి పాటుపడటం
10. వేద పురాణ ఇతిహాస శాస్త్ర విషయాల్ని చమత్కారంగా చెప్పడం

అన్నమయ్య సంకీర్తనల్ని గురించి, చినతిరుమలయ్య -

"వేదంబులు పౌరాణిక, వాదంబులు వరకవిత్వవాణి వీణా
నాదంబులు, కృతసుజనా, హ్లాదంబులు తాళ్ళపాక అన్నమయ పదముల్"
అని తెలిపాడు. ఇంకా,

"శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమవీథులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళులపాకయన్నయవచోనూత్నక్రియల్ చెన్నగున్"- అనీ వివరించాడు.

అన్నమయ్య కీర్తనల్ని ప్రధానంగా - (1) శృంగార సంకీర్తనలు (2) ఆధ్యాత్మిక సంకీర్తనలు - అని వర్గీకరించవచ్చు. వీటిని నిశితంగా పరిశీలించి యింకా కొన్ని భాగాలుగా వింగడించవచ్చు. అన్నమయ్య కీర్తనల్ని చినతిరుమలయ్య ప్రకటించిన విధంగా -

1. శ్రుతి సంబంధం 2. శాస్త్ర సంబంధం, 3. పురాణ సంబంధం, 4. జ్ఞాన సంబంధం, 5. ఆగమ సంబంధం, 6. మంత్ర సంబంధం, 7. నీతి సంబంధం, 8. శృంగార సంబంధం, 9. సంగీత సంబంధం, 10. భక్తి సంబంధం - అని చెప్పవచ్చు. ఇందులో జానపద బాణీ సంబంధాలు అనేకం వున్న విషయం గమనించదగ్గది.

## 1. శృంగార సంకీర్తనలు

ఇందులో 1. నాయక సంబంధి, 2. నాయిక సంబంధి, నాయక సంబంధంలో ప్రత్యేకంగా దక్షిణ నాయక సంబంధ కీర్తనలే అధికం. ఒక నాయికసంబంధిలో విభిన్న నాయికలు - అంటే - స్వీయ, ప్రౌఢ, ముగ్ధ, మధ్య, మధ్యాధీర, మధ్యఅధీర, మధ్యధీరాధీర, అన్యోఢ, ప్రౌఢాధీర, ప్రౌఢఅధీర, ప్రౌఢ-ధీరా-ధీర, స్వాధీనపతిక, వాసక సజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, అభిసారిక - అని అనేక విధాల నాయికలకు సంబంధించిన కీర్తనలున్నాయి.

2. శృంగార భేదాలు:- 1. సంయోగ శృంగారం, 2. విరహం, 3. పురుష విరహం, 4. సంవాదాత్మకాలు, 5. రాయబారం, 6. దూతీప్రబోధం అని వింగడించవచ్చు.

## 2. ఆధ్యాత్మ సంకీర్తనలు

1. సంకీర్తన మాహాత్మ్యం
2. స్వామి రక్షకత్వం
3. విష్ణు మంత్రమహిమ
4. దివ్యాయుధాలు-దివ్య చక్రం
5. స్వామి పాదమాహాత్మ్యం
6. స్వామి అభయ హస్తం-వాహనం-ఆభరణాలు
7. స్వామి బిరుదులు
8. భక్తి సంబంధమైనవి.

   ఇందులో నవవిధ భక్తి మార్గాలే గాకుండా, - అన్నమయ్య మరికొన్ని (11) భక్తిమార్గాల్ని (పద్ధతుల్ని) లక్ష్యలక్షణ సమన్వయం చేశాడు. అవి (1) ఉన్మాదభక్తి, (2). పతివ్రతాభక్తి, (3). విజ్ఞానభక్తి, (4). ఆనందభక్తి, (5). రాక్షసభక్తి, (6). తురీయభక్తి, (7). తామసభక్తి, (8). వైరాగ్యభక్తి, (9). రాజసభక్తి, (10). నిర్మలభక్తి, (11). నిజభక్తి.

9. శరణాగతి సంబంధి
10. వేల్పుల వర్ణనలు

   1. నరసింహుడు, 2. లక్ష్మీదేవి, 3. శ్రీరాముడు, 4. హనుమంతుడు, 5. శ్రీకృష్ణుడు, 6. దశావతారాలు.

## 3. జానపద గేయ సంబంధి

ఇందులో 1. స్త్రీల పాటలు, 2. తత్త్వ సంబంధి, 3. కథా గేయాలు.

అన్నమయ్య సంకీర్తనలు విభాగానికి అనుగుణంగా కొన్ని కీర్తనల్ని యిక్కడ పరిశీలించడమైంది.

### 1. నాయిక సంబంధమైన కీర్తన:-

ఇందులో నాయిక స్వరూపాన్ని వర్ణిస్తూ, నాయిక అవయవాలకు, జ్యోతిష్యంలోని ద్వాదశరాశులకు, సాదృశ్యాన్ని అన్నమయ్య చెప్పిన సంకీర్తనను చూడండి.

"ఇన్ని రాశుల యునికి యింతి చెలువపురాశి

కన్నె నీరాశి కూటమి కలిగిన రాశి ॥ పల్లవి ॥

కలికి బొమవిండ్లుగల కాంతకును ధనురాశి
వెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగహరి మధ్యకును సింహరాశి ॥ ఇన్ని ॥

కన్నెపాయపు సతికి కన్నెరాశి
వన్నెమై పైడి దులతూగు వనితకు దులారాశి
తిన్నని వాడిగోళ్ళ సతికి వృశ్చికరాశి ॥ ఇన్ని ॥

ఆముకొను మెరపుల నొరయునతివకు వృషభరాశి
గామిడిగుటమాటల సతి కర్కాటక రాశి
కోమలపు చిగురుమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతి గలిసె ప్రియ మిథున రాశి ॥ ఇన్ని ॥ (12-143)

### దక్షిణ నాయకుని వర్ణన :

ఎంత లేదు నీయాసోదమేమి చెప్పేది
చెంతనుండి నా మీద జేయి చాచేవు ॥ పల్లవి ॥

వొక్కతెతో మాటాడుతా నొక్కతెతో నవ్వేవు
అక్కరనొకతె వీడిమడిగేవు
వుక్కుమీరి ఒక్కతెను వొడివట్టి తీసేవు
మక్కువనప్పటిని నామర్మములంటేవు ॥ ఎంత ॥

యెవ్వతెనో చేరబిల్చి యెవ్వతెనో కూడేవు
దవ్వుల నదెవ్వతెనో తలపోసేవు
రవ్వగా శ్రీవేంకటేశ రతినన్ను జెలగించి
చివ్వనవప్పటినన్నే చేరి కూడేవు ॥ ఎంత ॥ (25-170)

### కృష్ణుని దక్షిణ నాయకత్వం:-

కృష్ణుడు వివిధ నాయికలతో కూడిన వైనాన్ని అన్నమయ్య కింది కీర్తనలలో వర్ణించాడు.

ఒక్కొక్కసతి నడుమ నొక్కొక్క రూపునైకొని
యెక్కువైతి కృష్ణా నిన్నెట్ల నమ్మేదిరా ॥ పల్లవి ॥

మాటలాడే వొకతెతో మళ్ళి చూచేవొకతెను
వోటలేక నవ్వు నవ్వే వొకతెతోను
కన్ను గీటే వొకతెకు గొగిలించే వొకతెను
వెన్నదిన్న మోవిచ్చేవు వేరొకతెకు
యెమ్మెల శ్రీవెంకటేశ ఇందరి మమ్ముగూడితి
విమ్ములనే నమ్మితి గాకెటుల నమ్మేదిరా ॥ ఒక్కొ ॥ (28-141)

**సంయోగ శృంగారం:-**

ఏమొకో చిగురుటాధరమున యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగద ॥ పల్లవి ॥

కలికి చకోరాక్షికి కడ కన్నులు కెంపై తోచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున బాణేశ్వరుపై నాటినయాకొనచూపులు
నిలువున బెరుకగనంటిన నెత్తురు గాదుగదా! ॥ ఏమొకో ॥

పడతికి చనుగవ మెరుగులు పైపై పయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో బ్రియుడొత్తిన నఖశశిరేఖల
వెడలగ వేసవి కాలపు వెన్నెల కాదుగదా ॥ ఏమొకో ॥

ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపుజల్లుల చేర్పుల
వొద్దికలాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల అందము కాదుగదా! ॥ ఏమొకో ॥

"ఎర్రటి పెదవిని నల్లసిరాతో రాసిన జాబుగా ఉత్ప్రేక్షించడం అందరూ ఎరుగుదురు. నాయిక తనివితీరా కస్తూరి తిలకాంకితమైన ప్రియుని మోము పలుమార్లు ముద్దిడుకొనడం వల్ల పెదవి మీద నల్లనల్లని గుర్తులేర్పడినవని కారణం గూడ తెలుస్తుంది. ఆ పెదవిని జాబుగా ఉత్ప్రేక్షించడానికి తగినన్ని కస్తూరి ముద్రలున్నాయంటే ఆమె ఎన్నిసార్లు ముద్దు పెట్టుకొనివుండాలో, దానికి తగిన నాయకుని సౌందర్యం ఎంతో కొందరే గుర్తించగలరు. అదే విధంగా ప్రియునిపై నాటిన చూపు నిలువున పెరకడం, దాని వల్ల కన్ను ఎర్రగా మారడం, దాని వల్ల అది నెత్తురుమరకగా ఊహించడం పైకి తెలుస్తుంది. అందులోని ఏకాగ్రత విధిలేక

బలాత్కారంతో చూపూడదీయవలసిన దుర్గతి సహృదయైకవేద్యం. పయ్యెదలోని చనుగవ మిసిమి బయట పరువులు పెట్టడం అతిశయోక్తి. కాని చూపిన హేతువు శృంగార రసనిష్ణాతునికిగానీ తెలియదు. చనుగవపైన నఖశశిరేఖలు మొలిచినవి. ఆ కాంతి వాటి వెన్నెలట. చెమటబొట్లు ముత్యాల జాలుగా వర్ణింపబడటం కవిలోక సహజమే. కానీ ఆ చెమట బొట్లు అధరాస్వాదసమయసంజనితమైన సాత్వికస్వేద రూపంగా వర్ణించడం అనుభవజ్ఞులైన కొంతమందే గుర్తిస్తారు.

"కామినామధురాస్వాదః సురతాదతిరిచ్యతే' అని కామశాస్త్రం.

ఇంతలోతైన భావాన్ని సహజాలంకార సమన్వితంగా తేటతెలుగు 'పదాలతో వర్ణించే నేర్పు అన్నమయ్యకు తప్ప మరొక్కరికి లేదు" అని గౌరిపెద్దివారన్నారు.

సంభోగపు గుర్తులు నాయికా నాయకులపై ప్రతిబింబించడం: ఇది ఒక విచిత్రమైన వర్ణన.

మగరూపునాడురూపు మారుచుకొనిరిద్దరు
సొగిసెద్దము చూపరే చూచుకొనేరిద్దరు దామే ॥ పల్లవి ॥

కలికి కస్తూరి బొట్టు కాంతుని నొసలంటె
నిలువు నామముపైపై నెలతకంటె
అలివేణి కొప్పుజారి అతని కొప్పుపై వాలె
అలరె నీతన్విసిక అతని పాపటపైని ॥ మగ ॥

కుంకుమగుబ్బల పూత గురుతు విభునికంటె
అంకెబతిరొమ్ము బొచ్చులాకె కంటెను
కంకణాల జాజుల చేయి ఘనుని సందిటజిక్కె
అంకపు సాముల చేయి ఆకె సంది జిక్కెను ॥ మగ ॥

మట్టె పాదములవె మగిడెనాతని మీద
నిట్టపెద్ద పాదాల నిలిచె నందు
ఇట్టి శ్రీ వేంకటేశుడింతి గూడి పానుపు పై
పట్ట పగలందరిని భ్రమయించిరిదివో ॥ మగ ॥ (26-309)

**పురుషవిరహం:**

ఏమిసేయు నమ్మలాల యెందుకొను నాయకుడు
బూమిలో జెప్ప గొత్త యీ పురుష విరహము ॥ పల్లవి ॥

తొయ్యలిరాకకు పతి తొంగి చూడవోతేను
దయ్యము వలె జంద్రుడు తలచూపెను
చయ్యననందుకతడు జడిసి తలవంచితే
నుయ్యివలెనే నూలుకొనె మనసు ॥ ఏమి ॥

మగువ యెలుగువిన మతినాలకించితేను
పగవాని రీతినే పల్కె కోవిల
మొగులు వలెనే కప్పె ముంచుక విరహము ॥ ఏమి ॥ (24-157)

విరహంలో వున్న నాయకుడికి చంద్రుడు దయ్యంలాగా తలచూపగా జడిసి తలవంచుకున్నాడు. పగవాడి రీతిగా పల్కిన కోయిల పలుకుల్ని వినలేక చెవులు మూసుకున్నాడు.

## ఆధ్యాత్మిక సంకీర్తనలు:-

సంకీర్తనాన్ని తలచడంవల్ల సర్వసుఖాలు కలుగుతాయని అన్నమయ్య సంకీర్తన మాహాత్మ్యాన్ని కింది కీర్తనలో వివరించాడు.

చాలదాబ్రహ్మమిది సంకీర్తనం మీకు -
జాలెల్లనడగించు సంకీర్తనం ॥ పల్లవి ॥

సంతోషకరమైన సంకీర్తనం - సంతాపమణగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం - సంతతందలంచుడీ సంకీర్తనం ॥చాల॥
సామజము గాచినది సంకీర్తనం - సామాన్యమా విష్ణు సంకీర్తనం ॥చాల॥
జముబారి విడిపించు సంకీర్తనం - సమబుద్ధి వొడమించు సంకీర్తనం
జమళి సౌఖ్యములిచ్చు సంకీర్తనం - శమదమాదులజేయు సంకీర్తనం
॥చాల ॥ (1-347)

## భగవంతుడికి, భక్తుడికి వున్న సంబంధం:

భక్తుణ్ణి భగవంతుడు తల్లిలాగా, తండ్రిలాగా, బంధువులాగా రక్షిస్తాడని, అన్నమయ్య ఈ కీర్తనలో తెలిపాడు.

తల్లియై పోషించు తండ్రియై రక్షించు
వుల్లపుబంధువుడై వొడలరయు
మెల్లనెదాతై ఇచ్చు మెలుతయై యాదరించు
యెల్ల విధబంధువుడు యీతడె పో విష్ణుడు ॥ ఈత ॥

యేలికయై మన్నించు నిష్టుడై బుద్ధి చెప్పు
చాలుమానిసియై యంచల దిరుగు (2-417)

**దేవుణ్ణి పూజించని వాళ్ళని గూర్చి అన్నమయ్య చెప్పిన విధం:**

నిన్ను చూడని కన్నులు నీచు వల కన్నలు
చిన్నినీ కథలు వినని చెవులు రాట్నపు చెవులు
వున్నతి నీకడకు రాకున్న కాళ్ళు మరగాళ్ళు
సన్నుతి సేయని జిహ్వ సరినుపజిహ్వ
చేరి నిన్ను పూజింపని చేయి దంతెనపు చేయి
తారినీకు మొక్కనట్టి తలయేపెడతల
సారెనీముద్రలేని భుజములు బుద్బుజములు
తేరినీదాస్యములేని దేహము సందేహము (2-450)

భగవంతుని దర్శించని కన్నులు నీచువలరంధ్రాలనీ, స్వామి మహిమలు వినని చెవులు రాట్నపు చెవులని, స్వామి వద్దకు జేరని కాళ్లు మరగాళ్ళనీ, స్వామిని పూజించని చేయి దంతెనపు చేయనీ, అన్నమయ్య సూచించి భగవంతుని పూజించవలసిందిగా సూచించాడు.

**అత్తాకోడళ్ల సంవాదం:-**

రావేకోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యపొందులనీతో జాలును ॥ పల్లవి ॥

రంకెలు వేయుచు రాజులెదుటనీవు
కొంకు కొసరులేని కోడల
పంకజముఖినీవు పలుదొడ్డవారిండ్ల
అంకెలదిరిగేవు అత్తయ్య
ఈడాడ నలుగురునేగురుమొగలతో
కూడి సిగ్గులేని కోడల
వాడకు బదుగురి వలపించుకొని నీవు
ఆడాడదిరిగేవు అత్తయ్యా
బొడ్డున బుట్టిన పూపనికే నిన్ను
గొడ్డేరు తెస్తినే కోడల
గుడ్డము పయినున్న కోనేటి రాయని
నడ్డగించు కొంటివత్తయ్యా ॥ రావే ॥ (2-313)

"రావే కోడల" అని లక్ష్మీదేవి అంటే, "పోవే పోవే అత్తయ్య" అని సరస్వతి పలికింది. అత్త ఒక్కసారి రావే అంటే, కోడలు రెండుసార్లు 'పోవే పోవే' అంది. జానపద బాణీలో వున్న చమత్కారాన్ని అన్నమయ్య పై కీర్తనలో తెలిపిన విధం అనిర్వచనీయం. అత్తాకోడళ్ళు ఒకర్ని మరొకరు నిందించుకోవడంలో హాస్యం స్ఫురిస్తుంది. 'గుడ్డము' అంటే కొండ.

## జానపదగేయరీతులు:

**1. ఏలపాట:-** అన్నమయ్య తానే నాయిక అయి భగవంతునితో విరహాన్ని అనుభవిస్తున్నట్లు ఏలపాట రాశాడు.

(మహిత నాయిక సంబుద్ధి కల్గి వుండటం, శృంగారపూరితం, లోకానురాగం, ధార్మిక ఔదార్యం ప్రదర్శింపబడటం, ఇష్టమొచ్చినరీతిలో పాటుకోవడానికి అనువుగా వుండటం, గొల్లవారి హేలారసికత్వానికి గుర్తులు - యస్వీజోగారావు ఏలపాటలు).

1. మేడలెక్కి నిన్ను జూచి కూడేననేయాసతోడ
వాడు దేరివుస్సురందురా - వెంకటేశ
యాడనుంటి విందాకనురా . . . .

2. నిండబూచిన మానిపై గండుకోయిలగూయగా
నిండిన నీ యెలుగంటాను - వెంకటేశ
అండకు నిను రమ్మంటిరా . . . .

3. ఆనినతుమ్మెదలు నీమేని కాంతి బోలునని
పూని చేతబట్టబోగాను - వెంకటేశ
సూనాస్త్రుని వేగులాయరా . . . .

4. జోడుగూడి నీవు నేను నాడుకొన్న మాటలెల్లా
గోడలేని చిత్తరువులై - వెంకటేశ
యాడ నా మతి బాయవురా . . . .

5. చిలుకలు మనలోన కలిసినయట్టివేళ
పలుకు రతి రహస్యాలు - వెంకటేశ
తలచినే తలవూతురు . . . .

**పొడుపు కథ పాట**

అంత సిగ్గు పడకువే యతివ నీకు
పంతమున తెలియక పాయమెల్ల గడువు
నొందినొక్క సింహమట - కొండలు మోచినదియట
ఇందుముఖుల నడుమ యిరవట
కందువ యీ పొడుపు కతయిది నీవు నాకు
అందముగ నానతీవె. ఆరునెల్ల గడువు ॥

స్త్రీ నడుమును పొడుపు కథ రూపంలో వర్ణించడం అన్నమయ్య లోకజ్ఞతకు నిదర్శనం.

లాలిపాట:- ఏడుస్తున్న బిడ్డల్ని లాలిస్తూ తల్లులు పాడేపాట లాలిపాట. ఎత్తుగడలోను, చరణాంతంలోనూ 'లాలి' అనే మాట ఆవృతమౌతుంది. లాలిపాటల్లో బిడ్డను భగవత్స్వరూపుడిగా జానపదులు భావిస్తారు. కింది కీర్తనలో లాలి పాడుతున్న ప్రౌఢాంగనల సౌందర్యం, విలాసచేష్టలు వర్ణితాలు.

"లాలనుచునూపేరు లలనలిరుగడల
బాలగండవరగోపాల నినుచాల ॥ లాలీ ॥

1. ఉదుటగుబ్బలసరములుయ్యాలలూగ -
పదరికంకణరవము బహుగతుల మ్రోగ
వొదిగి చెంపల కొప్పులొక్కింత వీగ -
ముదురు చెమటలు నళికములు తొప్పదోగ ॥ లాలీ ॥

2. మలయమారుతగతులు మాటికి చెలగగ -
పలుకు కపురపుతావిపైపైమెలంగ
బలుగానలహరియింపులరాల్గరగంగ -
బలసి వినువారిజెవిబడలిక దొలంగ ॥ లాలీ ॥

3. లలనాజనాపాంగలలితసుమచాప -
జలజలోచన దేవసద్గుణ కలాప
తలపులోపలమెలగుతత్వప్రదీప -
భళిరగండవరేశ పరమాత్మరూప ॥ లాలీ ॥

**ఆధ్యాత్మికత:-** భగవగద్భక్తి ఎడతెగనిదై వుండాలంటాడు అన్నమయ్య చూడండి.

పరమ సుజ్ఞానులకు ప్రపన్నులకు
మరుగురునిమీదట - మనసుండవలదా ॥ పల్లవి ॥

1. ఆకలిగొన్నవానికి నన్నముపై నుండినట్లు -
యేకట వుండవలదా యీశ్వరునిపై
కాకలవిటులచూపుకాంతలపై నుండినట్లు -
తేకువ నుండవలదా దేవుని మీదటను ॥ పరమ ॥

2. పసిబిడ్డలకు నాస పాలచంటిపై నున్నట్లు -
కొసరిభక్తివలదా శ్రీ వల్లభుమీదటను ॥ పరమ ॥

వెసతెరువరితమి విడిదలపై నున్నట్లు -
వసియించవలదాశ్రీవల్లభుమీదటను ॥ పరమ ॥

3. నెప్పున ధనవంతుడు నిధిగాచియుండినట్లు -
తప్పక శ్రీ వేంకటేశు దగులవద్దా
అప్పసమైన భ్రమ ఆలజాలాలకున్నట్లు -
యిప్పుడే వుండవలదాయీతని మీదటను ॥ పరమ ॥

(ఆలజాలు - నీటి మీద గిర గిర తిరిగే నల్లని పురుగులు - తటతటన నీటి మీదట వ్రాలజాలంబు అంటునట్లు చరించవా యీదియీది" అ.సం. 11-3-89)

దశావతారాలతో ముడిపెట్టి సంసారం సాధుజీవితాన్ని అన్నమయ్య వర్ణించాడు.

సంసారమే మేలు సకలజనులకును -
కంసాంతకుని భక్తి గలిగితే మేలు ॥ పల్లవి ॥

1. వినయపు మాటల విద్యసాధించితే మేలు -
తనిసిఅట్టలలోన దాగకుంటే మేలు
మునుపనెభూమిదన్ను (ను) మోచిదించకుంటే మేలు -
వెనుకొన్నకోపమువిడిచితే మేలు ॥ సంసార ॥

2. కోరివొకరినడిగికొంచపడకుంటే మేలు -
సారెసారె జీవులను చంపకుంటే మేలు

భారపుటిడుములను పడకుండితే మేలు -
కారించితిట్లకొడిగట్టకుంటే మేలు ॥ సంసార ॥

3. పరకాంతలభంగపరచకుంటే మేలు -
దొరకని కెళవులు దొక్కకుంటే మేలు
అరుదైన శ్రీ వేంకటాద్రివిభునిగొల్చి -
యిరవై నిశ్చింతుడైతేనిన్నిటానుమేలు ॥ సంసార ॥

వినయంతో విద్యసాధించాలనీ, కోపం విడనాడాలనీ, జీవహింస చేయరాదనీ, సంసారయాత్ర సాగించాలనీ, పరకాంతల గౌరవించాలనీ అప్పులు చేయరాదనీ, శ్రీ వేంకటేశ్వరుని సదా స్మరించాలనీ అన్నమయ్య హితవు పలికాడు.

పైవిధంగా అన్నమాచార్యుని సంకీర్తనల్ని వర్గీకరించి స్థూలంగా వివరించడమైంది.

# అన్నమయ్య పదాలు - జానపదాంశాలు

ఆచార్య కె. రుక్నుద్దీన్

**జా**నపద సాహిత్యం ఏ దేశ సాహిత్యానికైనా మూలం; అదికాదంటే, నేను తల్లిలేకుండా పుట్టినా నన్నట్లే. అట్లాంటి జానపద సాహిత్యానికి ప్రాణం, ప్రథమం గేయం; జానపద సాహిత్యమంటే కేవలం జానపద గేయ సాహిత్యమే అన్న రోజులూ వున్నాయి; పరిశోధనా పరిధి విస్తరించిన కొలది జానపద సాహిత్యశాఖలు విశాలమై వెలసినవి; ఎంత విస్తరించినా గేయానికున్న స్థానం గేయానిదే.

జానపద సాహిత్యంలోని మిగిలిన రూపాలలాగే గేయం కూడా సంస్కృతికి అద్దంపట్టి చూపుతుంది. తెలుగువారి అచ్చమైన సంస్కృతిని తెలుసుకోవాలంటే జానపద విజ్ఞానమే శరణ్యం. జాతి మహత్తర సాధనకు మారుపేరే సంస్కృతి. ఒకజాతి సంపూర్ణ జీవితచరిత్రయే సంస్కృతి.

"నాకు నల్లచీర నెమిలి వన్నెరవికె
వడినిండ బియ్యము పళ్లూ కొబ్బెరిగిన్నె
పసుపు కుంకుమ యిచ్చి పంపె మాయన్న..."

అనే పాటలో వున్నవి మూడే పాదాలు.

కానీ, తెలుగు వారి జీవన విధానానికి చెందిన యెన్నో విషయాలు పాటలో వివరింపబడినవి. అన్నా చెల్లెళ్ల అనుబంధం, పుట్టింటి ఆచారాలు, అలంకరణ విశేషాలు, మన సంస్కృతిలో కొన్ని వస్తువులకుండే పవిత్రత, మొదలైన విషయాలెన్నో వినబడతాయి. అట్లే యింకెన్నో గేయాలు జాతి జీవన విధానాలను వివరిస్తాయి. అందుకే జానపదగేయాలు జాతి సంస్కృతి వివరణాత్మకాలుగా ప్రసిద్ధినొందినవనడం.

జానపదగేయాలు రకరకాలు. వానిలో చాల వరకు భక్తి ప్రబోధక విభాగానికి చెందినవే సంకీర్తనలు, పదకవితలు. కృష్ణమాచార్యులు, పెద తిరుమలాచార్యులు,

చినతిరుమలాచార్యుడు, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి, త్యాగరాజు, అన్నమయ్య మొదలైనవారు తెలుగులో ప్రముఖ వాగ్గేయకారులు.

తెలుగు వాగ్గేయకారులలో అన్నమయ్య మూలవిరాట్టయితే, మిగతా వాగ్గేయకారులు ఉత్సవ విగ్రహాలలాంటి వారు. అంటే అన్నమయ్య తెలుగులో ప్రముఖ వాగ్గేయకారుడు, గ్రహాలను నక్షత్రాలను తన చుట్టూ తిప్పుకొనే సూర్యునిలాంటివాడు.

ప్రపంచ భాషలన్నిటిలోనూ కవిత్వం పదకవిత, పద్యకవిత, అని రెండు విధాలు. పాడుకోవడాని కుపకరించేది పదకవిత, పండితులకే పరిమితమయింది పద్యకవిత.

కవిత్వంలోని మార్గదేశిపద్ధతులు మనకున్నాయి. ఆయా ప్రాంతాల్లో పామరజనుల చేత వాడబడి, పాడబడుతూ పరివ్యాప్తమయింది దేశి. సర్వలక్షణ బద్ధమై పండితైకపరమయింది మార్గ. దేశికి వుండే లక్షణాలు దేశికున్నాయి.

ఈ దేశిమార్గపద్ధతులను మిళితంగావించి సాగిన రచనలూ మనకున్నాయి.

అన్నమాచార్యులు పుట్టింది కడపజిల్లా తాళ్లపాక గ్రామంలో. పుట్టింది నందవరీక బ్రాహ్మణ ఋగ్వేదకుటుంబమైనా, పెరిగిన పరిసరాలు నూటికి నూరుపాళ్లు జానపదాలు. ఆట పాట, జీవనవిధానం, గ్రామీణజీవనసరళి, పరికరాలు పరిసరాలు, వృత్తిజీవనాలు, ఒకటేమిటి, సహజ ప్రకృతి జీవనసరళి ఆనాడే ఆతడిని నింపివేసింది. పులకితుని గావించింది. దానికి తోడు దేశాటనం, రకరకాల ప్రాంతాలతో పరిభ్రమించడం, భిన్న ప్రాంత ప్రజలతో కలిసి తిరగడం అన్నమయ్యను అచ్చం జానపద సంస్కారిగా తీర్చిదిద్దింది.

అన్నమయ్య పదాలకున్న ప్రజాదరణే, ఆయన సాహిత్యంలోని జానపదాంశాల నిష్పత్తిని, జానపదాంశాల పాళ్లను వ్యక్తం చేస్తుంది. అన్నమయ్య సాహిత్యం సర్వం జానపదాంశమయం అంటే అతిశయోక్తి కాదు, ప్రపంచంలో యే సాహిత్య ప్రక్రియైనా ప్రజాదరణ పొందిందంటే తప్పక అందులో జానపదాంశాల పాళ్లే యెక్కువగా వుంటాయని చెప్పాల్సిందే. ప్రపంచంలో యే దేశంలోనైనా పామరజనం గ్రామీణజనమే యెక్కువ. వారి యాదరణకు నోచుకున్నదంటే గ్రామీణాంశాలు అందులో అధికంగా వున్నాయని భావం.

సాహిత్య ప్రక్రియల్లో సామెతలు, పొడుపుకథలు, మాండలిక భాషలోనియాసలు మొదలైనవి జానపద సాహిత్యప్రక్రియలైతే, వస్తు సంస్కృతికి సంబంధించిన

వస్త్రధారణ, ఆభరణాలు, వృత్తి పరికరాలు, గృహోపకరణాలు, అలంకరణ, ఆహార్యం, ఆహారం, వృత్తులు, పుట్టుక, పెళ్లి, నమ్మకాలు, కట్టుబొట్లు, జీవనవిధానాలు, క్రీడలు, శకునాలు, బలి, ఉత్సవాలు, వైద్యం, మంత్రతంత్రాలు, జ్యోతిషము, భవిష్యత్తు, జానపదనాట్యం, సంగీతం మొదలైనవన్నీ జానపదాంశాలే. అన్నమయ్య సాహిత్యం నిండా ఈ సాహిత్యాంశాలు వ్యాపించి వున్నాయి. ప్రత్యేకించి అన్నమయ్య పదాలన్నిటిలో జానపద సంగీతమే ప్రాణం పోసిందనడం వాస్తవం.

స్థాలీపులాక న్యాయంగా సమయ సందర్భానుకూలంగా అన్నమయ్య సాహిత్యంలోని కొన్ని జానపదాంశాలను పరిశీలించడమే యీ వ్యాసం ప్రధానాశయం.

అన్నమయ్యకు పూర్వం పాటలున్నాయనే సమాచారమే గాని, ఈ పాటలివి యనిచెప్పే సాక్ష్యాలేవీ కానరావు. నాచన సోముని జాజరపాట మాత్రం వినబడుతుంది. అన్నమయ్య (1424-1503) ముప్పది రెండువేల కీర్తనలే ఆనాటి అంతకుపూర్వంనాటి గేయగతులను తెలిసికొనుటకు ఆధారాలు. తన కాలం నాడు జానపదాల్లో వాడుకలో నున్న గేయరీతుల నెన్నిటినో అన్నమయ్య వాడుకున్నాడు. నన్నెచోడుని 'ఉయ్యాలా...' అనే పదాన్ని వూతగా గొని,

అలర చంచలమైన ఆత్మలందుండని
అలవాటు వేసె నీ వుయ్యాలా..... అనీ

ఎన్ని బాధల బెట్టి యేచెదవు నీవింక
ఎంత కాలము దాక కర్మమా . . . . అనీ

సాగే పాటల్లో । కిట తకిట । అనే ఐదేసి మాత్రల ఆవృత్తి కనబడుతుంది. పాల్కురికి సోముని తుమ్మెద వెన్నెల పదాలు కూడా కిటతకిట అనే ఐదు మాత్రల ఆవృత్తితోనే నడుస్తాయి.

ఏ వూరు ఏ పల్లె తుమ్మెదా
ఎక్కడికి ఎల్తావు తుమ్మెదా...

అనే పాటలో దుందుడుకు కోడలు స్ఫురిస్తే

ఓయి భామల్లార తుమ్మెదా
పండిన వరిచేలు తుమ్మెదా!

అనే పాటలో పల్లె పరిసరాలు, కోతలు స్ఫురిస్తాయి.

సువ్వీ సువ్వీ సువ్వని
సుదతులు దంచెద రోలాలా (చతురస్రగతి)

సువ్వి సువ్వి సువ్వాలమ్మా
నవ్వుచు దేవకి నందనుగనియె

భారమైన వేపమాను
పాలువోసి పెంచినాను
తీరని చేదే గాక
తియ్యనుండినావూ (త్రిశ్రగతి)

ఏ కాంతలొ నిన్నెనసి తలచిరని
లేకలు వచ్చెను లేవయ్యా
శ్రీకాంతుడవగు శ్రీవేంకట నా
ళీక దళాక్షుడ లేవయ్యా! . . . . అనే పాట

పాలయలుక నిద్దరలు భోగించదొరకొంటి
అలరవడి మేల్కొనవె అఖిలేశ్వర . . . అనే పాట

ఎందాక నిద్ర నీ కిదె తెల్లవారెగదె
ఇందిరా రమణ నీ విటు మేలు కొనవే . . . అనే పదం

ఖండగతిలో నాలుగు కిటతకిట పాదాలతో ప్రభాత సంకీర్తనగా పాడబడింది.

ఖండగతిలో నడిచే దేశివరుసలు అన్నమయ్య రచనలలో కోకొల్లలు.

కాయము మోచితి గడనగడించితి
చేయార పుణ్యము చేసితినా - అనే చెంచిత పాట...

ఆత్మ పంజరములో నయమున నుండి
నా చేతనే పెరిగిన చిలుకా . . . అనే చిలుక పాట

కొండ గొడుగుపట్టె కొన్నాళ్లు - తా
కొండ ముచ్చులనేలె కొన్నాళ్లు . . . . అనే పదం

కోలాటంపాటల వరుసల లోనివే.

సంభాషణాత్మకంగా సాగే ఈ కోలాటం పాట జనపథాల్లో బహుళ ప్రచారం పొందింది -

గొల్లవారి వాడలాకు కృష్ణమూరితీ! నీవు
ఏమి పనికి వచ్చినావు కృష్ణమూరితీ -
పాలు పెరుగు పోసిపోవె గొల్లభామా! నీకు
పైకమిచ్చెదాను రావె గొల్లభామా!
పైకమిస్తనాని నీవు కృష్ణమూర్తీ! నా
పైట చెంగు బట్టెదావు కృష్ణమూరితీ !
పట్టితే యేమాయెనో వో గొల్లభామా! నీ
పైన మనసు నాది గలదె గొల్లభామా!
కొత్తాకోడాలినయ్యా కృష్ణమూరితీ! మా
యత్త నన్ను గొట్టునయ్యా కృష్ణమూరితీ
కొత్తా కోడాలివైతే గొల్లభామా! మీ
యత్త కొడుకు నేను గదనె గొల్లభామా! . . . .

అనే వరుసలో సాగేవే అన్నమయ్యా పదాలు చాలా వరకు. చాంగుభళా, గొబ్బిళ్లో, సంసారము, వృథావృథా, గెలుపులు, సంకీర్తనం, వైష్ణవం, మంగళం, మొదలైన పదాంతాలతో సాగే అన్నమయ్యా పదాలన్నీ చతురస్రగతి కోలాట పాటలే.

పులకల మేనితో బొరలెను
కడుం జలిగొని చల్లకు జాజర . . . - అనే పాట

సంకుమదంబుల జాజర . . . అనే పదాలు
రవ రవ చెమటం గరిగి . . . అనే మాటలు
పుప్పొడి జారగ... అనే ప్రయోగం తోడు -

కస్తూరి, గంధపొడి, పుప్పొడి చల్లుకొని ఆడే ఆట 'జాజర' అని తెలుస్తున్నది. కాముని పున్నమ సందర్భంగా తెలంగాణాలో కుంకుమ బుక్కగులాలు, రంగులు చల్లుకోవడం ఈనాటికీ పరిపాటే.

అల్లోనేరెడల్లో । అల్లో నేరెడల్లో
అల్లల్ల నేరెడి
అల్లో నేరడల్లో - అనే బాణి తెలంగాణా ప్రాంతంలో బాగా ప్రచారంలో వుంది. ఇదే గతిలో సాగిన అన్నమయ్యా పదం

నెయ్యములల్లో నేరెళ్లో
వొయ్యన వూరెడి వుప్పిళ్లో . . . . . చతురస్రగతిలో నడిచింది.

తెలుగు తల్లులు తమ చిరంజీవులకు గోరుముద్దలు తినిపిస్తూ చందమామను ఆహ్వానించే గేయం అన్నమయ్యదే అంటే ఆశ్చర్యపోనవసరం లేదు.

చందమామరావో జాబిల్లిరావో । మంచి
కుందనంపు పైడికోర వెన్న బాలు తేవో ।

అనే పదం అన్నమయ్య అమృతహృదయ నిష్యందనమే!

తంద నాన అహి తంద నాన పురె
తంద నాన భళా తంద నాన . . . అనే వేదాంతపరగీతం

చక్కని తల్లికి చాంగుభళా । తన
చక్కెర మోవికి చాంగుభళా । . . . అనే చతురస్రగతి గీతం

భాగాలలో జానపదగేయ గతులో, జానపదాంశ ప్రస్తుతులో, మాండలిక పద ప్రయోగాలో కనబడతాయి.

అన్నమయ్య పదాల్లో భక్తి, ఆధ్యాత్మికత తర్వాత చర్చకు వచ్చేది శృంగారం. శృంగారమనగానే వులికి పడాల్సిన అవసరం లేదు. అది దైవపరమైన శృంగారమే. అధిదేవుని నాయకునిగా జేసి వర్ణించిన శృంగారమే.

అష్టవిధనాయికలలో స్వాధీనపతికను యీ పదంలో గమనించవచ్చు.

చాలదా యీ చనవులు
మేలపుచేతల నిన్ను మెచ్చించగలిగె
ఎంతటిదిరా నిన్ను నిందాకా రానీక
పంతమాడి వలపించి బాసగొన్నది
ఇంతి నోచినట్టినోము ఎటువంటిదో
నీ చెంతజేరి నీ మంచి చెక్కు నొక్క గలిగె . . .

ఎవ్వతెరా నిన్ను నెలయించి తన నిండు
జవ్వనము విలువిచ్చి జట్టి గొన్నది
అవ్వలదాని భాగ్యమది యెట్టిదో నీవు
పవ్వళించు పరుపుపై పవ్వళించగలిగె
ఎట్టిదిరా సతి నిన్ను యింటిలోన వెళ్లనీక
పట్టుకొని కాగిటిలో బాయనీనిది
అట్టి నిన్ను తిరువేంకటాధీశుడా నీవు

దట్టించు కౌగిటిలో తగులగ గలిగె.
ధవుడు వచ్చెడు వేళ
తనువును గృహము
సవరించు వాసక సజ్జిక ప్రీతి - అనేది వాసక సజ్జిక లక్షణం, అన్నమయ్య పాటలో రూపుదిద్దుకున్న వాసకసజ్జిక ఈ విధంగా వుంటుంది.

ఇపుడే వచ్చేవని ఇంట వాకిటను చెలి
కప్పురపు టారతెత్త గాచుకున్నది
దప్పితేర నీకు నీయ తట్టిలోనబాగాలు
కుప్పలుగా మీదెత్తుకొని వున్నది.
ఆరగించ వచ్చేవని అన్ని దెరగుల నెల్లా
చేర విందాయితముగా జేసుకొన్నది
గారవాన బాదాలు గడిగేనంటా బన్నీరు
ఆ రీతి పైడిబిందెల నమరించుకొన్నది . . .

అని నాయకునికై యెదురు చూసే నాయికను వర్ణించినాడు.

స్వయ మభిసరతి
ప్రియ మభిసారయతి
వాయా సాభిసారికా - అనేది అభిసారికా లక్షణం. అన్నమయ్య పదాలలో అభిసారికా పదాలు సాగిన తీరిది.

ఎందాక సిగ్గువడే నిప్పుడు నీవు
కందువ లెల్లా నంటి కౌగిలించరాదా
పూచిన తంగెడు వలె బొలితి నిలుచున్నది
కూచుండు మనరాదా కోరి నీవద్ద
రాచిలుక నీవలెనే రవళిగా మాటాడి
చేచేత మెచ్చి సంతోషించగరాదా
అందపు గోవెలవలె ఆకు కొరికి నీ కిచ్చి
చెంది పొత్తుల వీడెము చేయరాదా
ఇందునే శ్రీ వేంకటేశ యాకె నిట్టెయేలితివి
పొందుల రతులు తలపోసికొనరాదా!

అని నాయిక నాయకునికై అభిసరించిన విధం యిక్కడ వివరించబడింది.

సర్వదా స్వీయాయామ్ అనురక్తో
అనుకూలః .... అనేది శృంగార నాయకులలో అనుకూలుని గురించినది.

అన్నమయ్య పదాలలో అనుకూలుని వర్ణన యిది:

నీమగడిందరిలోన నీపైనే వలపు చూపే
చేముంచి కైవసమెంత సేసుకుంటివో
సారె నీ మొగ మాతడు చల్లుచూపులను జూచి
నారు వోసినట్లనే నవ్వులు నవ్వీ
నేరుపులెల్లా మెరసి నీతోనె మాటలాడి
దారకాన నీవెంత తపము సేసితివో
అలిమి శ్రీ వేంకటేశుడందినీకు విడెమిచ్చి
తలకొన లాలించి తమిరేచీని
అలమేలు మంగవు నీయంకెలనే మెలగీని
పిలిచె నెటువంటి వేళ పెండ్లియాడితివో

నాయికకు అనురక్తుడుగా నున్న నాయకుని వివరణ యిది -

సందర్భానుకూలంగా యిక్కడ కొన్ని పాటలను మాత్రమే ఉదహరించడం జరిగింది. ఈ పదాల్లో -

మెచ్చించగలిగె, బాసగొన్నది, నోచినట్టినోము, జట్టిగొన్నది, కప్పురపు టారతెత్త, తొట్టిలోన బాగాలు, పాదాలు కడిగేనంటపన్నీర, పైడిబిందెలు, కోవెల వలె, ఆకు కొరికి నీకిచ్చి, పొత్తుల పీడెము చేయరాదా, యాకె నిట్టెయేలితివో, చేముంచి కైవసం చేసుకో, నారువోసినట్లు, దారకాన, విడెమిచ్చి, తమిరేచీని, మెలిగేని, పూచిన తంగేడి, పుట్టక తొల్లె, నాకబలి, ఏకాంతానకు, వశమాయ, సేతామె, అంకెల, మొదలైన ప్రయోగాల్లో ఒకజానపద పదబంధమో, జాతీయమో, సామెతో, జీవన విధానంలోని భాగమో, వస్తు సంస్కృతో, యేదో వొక జానపదాంశం కనబడుతుంది.

జానపదగేయరీతులతోపాటు జానపదుల భాషను, యాసను, పలుకుబళ్లను అనుకరిస్తూ అన్నమయ్య అనేక సంకీర్తనలను చేసినారు.

మచ్చుకు -

జిగురు వంటివాడె శినకాటి । చింత
శిగురమ్మ బోనీడె శినకాటి.

శిరత నవ్వులవాడు శిన్నెకా
వెరపెఱుగడు సూడవె శిన్నెకా!

శిన్నెక తేవే శెలువుని తా
వెన్నలు సవిగొన వెన్నుని తా

సిన్నవాడవని నమ్మసెల్లదు నిన్ను
సిన్నెన యాట దెల్ల సిక్కుసీరైపోయను

మొదలైన ఉదాహరణలలో జానపద భాష, పలుకు బడులు విరివిగా కనబడతాయి.

స్థాలీపులాకన్యాయంగా అన్నమయ్య రచనలలోని జానపదాంశాల పరిశీలన యిది. అన్నమయ్య రచనల నిండా అన్నీ జానపదాంశాలే అంటే అతిశయం కాదు.

అన్నమయ్య పుట్టుక జనపదం లో,
సంచారం జనపథాల్లో,
భావం జానపదం,
భాష జానపదం మాండలిక మయం,
గీతం జానపదం
సంగీతం జానపదం,
చివరకు ఆయన చేతి సంగీత పరికరం
జానపదం;
ఇక జానపదం కానిదేది?
అంటే ఏమీ లేదు.
అన్నమయ్య సంపూర్ణ జానపదుడు.
ఆయన సాహిత్యం సర్వం
జానపద సర్వస్వం.

**ఉపయుక్తాలు:**


| | |
|---|---|
| తెలుగు జానపదగేయ సాహిత్యం | రామరాజు |
| శృంగార పదాలు | వడ్లమూడి గోపాలకృష్ణయ్య |
| ఆంధ్రుల జానపద విజ్ఞానం | సుందరం |
| తాళ్లపాక సంకీర్తనలు-మధురభక్తి | శ్రీరంగాచార్య |
| వాగ్గేయకారులు తులనాత్మక అధ్యయనం | గంగప్ప |

# అన్నమయ్య సంకీర్తనలలో మానవీయ విలువలు

డా॥ చిట్రాజు గోవిందరాజు

**అ**న్నమయ్య సంకీర్తనా సాహిత్యం ఒక సారస్వత క్షీర సాగరం. దీనిలోలేని అంశాలు లేవంటే అతిశయోక్తి కాదు. భక్తి, జ్ఞానం, వైరాగ్యం, నీతి ప్రబోధం, మానసిక ప్రబోధం, దైవస్తుతి, క్షేత్ర ప్రశంస, భక్త జన సంస్మరణ, శరణాగతి తత్వం, భగవన్నామమహిమ, విష్ణుతత్వం, వైష్ణవఘనత ఇలా ఎన్నెన్నో చెప్పుకుంటూ పోవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే అన్నమయ్య సంకీర్తనా సాహిత్యం ఒక విజ్ఞాన సర్వస్వం అంటే సత్యదూరం కాదు.

ఈ సాహిత్య సాగరంలోంచి ఎందరో ఎన్నో అనర్ఘరత్నాలను వెలికితీశారు. తీస్తూ వున్నారు. గ్రహించేవారి శక్తిని బట్టి, యుక్తిని బట్టి, అనురక్తిని బట్టి, ఎన్నో వెలుపలికి వస్తున్నాయి. ఆశ్చర్యకరమైన అంశం ఏమంటే అన్నమయ్య సాహిత్యం 15వ శతాబ్దానికి చెందినప్పటికి 21వ శతాబ్దంలో ప్రసిద్ధి వహించిన వాదాలకు, నినాదాలకు కూడ అందులో వేర్లు కనిపిస్తున్నాయి. అన్నమయ్య భావనాశక్తి అద్భుతమైన అభివ్యక్తి అంతగొప్పవి. మానవుని ఆలోచనలు కాలానికి అతీతమైనవి. ఏకాలంలోనైనా అవి అనుసరణీయాలని భావించేందుకు అన్నమయ్య సాహిత్యం ఉపకరిస్తుంది. ఈ దృష్టితోనే అన్నమయ్య సంకీర్తనలు ఆవిష్కరించే మానవీయ విలువలను క్రోడీకరించవలసి వుంది.

కోట్లకొలది సంవత్సరాలనుంచి నూతన ప్రాణి కోటిలో మానవునికి ప్రత్యేక స్థానం వుంది. అతని ఆలోచనలు, ప్రవర్తన, తక్కిన జీవరాశి కంటె భిన్నంగా వుంటూ అతనికా ప్రత్యేకతను సంతరించిపెట్టాయి. ఆదికాలం నుంచి నేటిదాకా సాగిన మానవజీవన గమనంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆ మార్పులలోను మారని అంశాలు కొన్ని మిగిలిపోయాయి. వాటినే మౌలిక విలువలని, మానవీయ

విలువలని వ్యవహరిస్తారు. గ్రంథాలు, జ్ఞానులు, చింతనాపరులు, వీటిని అంగీకరించి మానవత్వంలో విడదీయరాని భాగాలుగా గుర్తించారు. వాటిలో తల్లి, తండ్రి, గురువు, దైవం మొదలైన వారిపట్ల భక్తి, దేశభక్తి, లేదా రాజభక్తి, భూతదయ, పరోపకారం, స్నేహం, స్వతంత్రపిపాస, ఇతరులకు హానితలపెట్టకుండడం, సహనం, సదసద్వివేకం, సమున్నతలక్ష్యం మొదలైనవి పేర్కొనదగినవి. ఈ ప్రాథమిక విలువల నుంచి, మరెన్నో విలువలు ఉత్పన్నమై మానవతకు, మహనీయతకు, మంచి పరిమళాన్ని చేకూర్చాయి. ఈ అంశాలను దృష్టిలో పెట్టుకొని అన్నమయ్య సంకీర్తనలు పరిశీలించి వాటిలోని మానవీయ విలువలను సమన్వయ పూర్వకంగా ఆవిష్కరించడం ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది.

అన్నమయ్య అనేక మానవీయ విలువలను ఒకే కీర్తనలో పొందుపరచడం విశేషం. వాటిలో పరోపకారం, భూతదయ, పరనింద చేయకుండడం, పరపీడ చేయకుండడం, సత్యనిరతి, ధర్మతత్పరత, వేంకటేశ్వరభక్తి మొదలైనవి పేర్కొనదగ్గవి. ఈ అంశాలను కింది కీర్తనలో ఆవిష్కరించాడు.

ఏ కులజుఁడేమి యెవ్వఁడైన నేమి
ఆకడ నాతడె హరి నెఱిఁగినవాఁడు ॥ పల్లవి ॥

పరగిన సత్య సంపన్నుడైన వాడే
పరనిందసేయ దత్పరుడు గానివాడు
అరుదైన భూతదయానిధియగువాడే
పరులు దానేయని భావించువాడు ॥ ఏ కు ॥

నిర్మలుడై యాత్మనియతి గలుగువాడే
ధర్మతత్పరబుద్ధి దగిలినవాడు
కర్మమార్గములు గడవని వాడే
మర్మమై హరిభక్తి మఱవని వాడు ॥ ఏ కు ॥

జగతిపై హితముగా జరియించువాడే
పగలేక మతిలోన బ్రదికినవాడు
తెగి సకలము నాత్మ దెలిసిన వాడే
తగిలి వేంకటేశు దాశు డయినవాడు (1-292)

## గురు భక్తి

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ అని వేదవాణి. తల్లిదండ్రులు తర్వాత గురువుదే ఉన్నత స్థానం. దైవాన్ని దర్శింపజేయడంలో గురువు నిర్వహించే పాత్ర కీలకమైంది కాబట్టి గురుస్థానానికి అంత ప్రాధాన్యం వచ్చింది. అందువల్లనే అందరూ గురువులను దైవంగా భావిస్తారు. 'దైవతములంచు గురువులదలచువాడు' అని ప్రహ్లాదుని గురుభక్తిని పోతన పేర్కొన్నాడు. అన్నమయ్య కీర్తనలలో గురుస్తుతి, గురుప్రశంస అనేక చోట్ల కనిపిస్తున్నాయి. అన్నమయ్య గురు కృపను గుర్తించాడు. అన్నీ ఆచార్యాధీనమన్నాడు. గురుసేవకునికి కొరత వుండదని దృఢంగా విశ్వసించాడు. తనకు కూడా ఆచార్య కృపే దిక్కని అచంచలంగా విశ్వసించాడు.

అన్నియును దగ నాచార్యాధీనము (6-90)
గురువు గల వానికి కొరత ఏమియు లేదు (2-254)
చిలికి కర్మంబనెడి చిచ్చు చొచ్చిన నాకు
జవళి నాచార్యకృప జలధియే దిక్కు (6-146)

ప్రస్తుత వైష్ణవానికి ఆద్యుడు భగవాన్ రామానుజులు. గతులన్నీ నశించిన కలియుగంలో ఉన్నతగతి చూపిన ఉత్తమ గురువు. అతని దయలోనే అందరూ వైష్ణవులయ్యారు. తిరుమణిపెట్టుకొన్నారు. ముద్రధారణ చేశారు. అష్టాక్షరి జపించారు. వేదరహస్యం గ్రహించారు. ఈ అంశాలన్నీ అన్నమయ్య హృదయాన్ని అపార కృతజ్ఞతతో నింపివేశాయి. అందువల్లే గురుప్రశంసాపూర్వకంగా పాట వెలువడింది.

గతులన్ని ఖిలమైన కలియుగమందును
గతి యీతడే చూపె ఘన గురు దైవము ॥ పల్లవి ॥

యీతని కరుణనేకా యిల వైష్ణవుల మైతి
మీతని వల్లనే కంటి మీ తిరుమణి
యీతడేకా వుపదేశమిచ్చె నష్టాక్షరిమంత్ర -
మీతడే రామానుజులు యిహపరదైవము ॥ గతు ॥

వెలయించె నీతడేకా వేదపు రహస్యములు
చలిమి నీతడే చూపె శరణాగతి
నిలిపినాడీతడేకా నిజముద్ర ధారణము
మలసి రామానుజులే మాటలాడే దైవము ॥ గతు ॥

నియమము లీతడేకా నిలిపె ప్రపన్నులకు
దయతో మోక్షము చూపెదగనీతడే
నయమై శ్రీవేంకటేశు నగమెక్కే వాకిటను
దయచూచి మమ్ము నిల్పే తల్లి తండ్రి దైవము (2-372)

ఇప్పుడు చెప్పుకొన్నవేగాక ఆదివన్ శఠకోపయతి గురించి, ఆళ్వార్ల గురించి అన్నమయ్య రచించిన కీర్తనలన్నీ గూడ గురుపరంపరా స్తుతిగానే గుర్తించవచ్చు.

## దైవభక్తి

ప్రతి మానవుడికి తప్పనిసరిగా వుండవలసింది దైవభక్తి. భగవంతుడిచ్చిన దేహాన్ని అతని సేవకే అర్పించడం హర్షణీయం. దైవభక్తి లేని జన్మ వ్యర్థమని పోతనగారి అభిప్రాయం. చేతులారంగ శివుని పూజింపడేని, నోరు నొవ్వంగహరికీర్తి నుడువడేని - కలుగనేటికి తల్లుల కడుపు చేటు; కమలాక్షు నర్చించు కరములు కరములు, వైకుంఠుని బొగడని వక్త్రంబు వక్త్రమే ఇలాంటివి ఎన్నో అతని భాగవత రచనలో కనిపిస్తాయి. దైవభక్తినే శ్వాసగా చేసుకొని తను యాత్ర సాగించిన అన్నమయ్య దైవభక్తిని ప్రతిపాదించాడు. అనేక భక్తి విధాలను ఆదరించాడు. అతని కీర్తనల్లో వీటికి స్థానం కల్పించాడు. ఎనలేని తిరువేంకటేశుడే దైవమని వినగలిగినది కదా వినికి అని తెగేసి చెప్పాడు. అనయంబు నతని సేవానందపరులై మనగలిగినది కదా మనుజులకు మనికి - అని స్పష్టం చేశాడు.

మొక్కరో మీరు మోసపోక మీకు
దిక్కు దెసైన ఆది దేవునికి' అని
హరి భక్తి గలిగితే అన్నియు ముఖ్యము గాన
విరహాచారము లెల్ల వృథా వృథా

అని తెలియజేసి హరిభక్తి ప్రాముఖ్యాన్ని ఆవిష్కరించాడు. ఈ విధంగా చెప్పుకుంటూపోతే అన్నమయ్యలో మిగిలేది హరిభక్తే అని అందరికీ తెలుసు.

## భూతదయ

మానవుడికి తప్పనిసరిగా ఉండవలసిన గొప్పగుణం భూతదయ, 'దయగల హృదయమే భగవన్నిలయమని' సద్గురుమళయాల స్వాముల వారి సదుపదేశం. భక్త కవి బమ్మెరపోతన కూడ 'దయయు సత్యము లోనుగా దలపడేని కలుగనేటికి తల్లుల కడుపుచేటు' అని పేర్కొన్నాడు. ప్రతివారికి వుండవలసిన పంచయజ్ఞాలలో భూతదయ ఒకటని సనాతన ధర్మం చెప్పడంలోని ఆంతర్యం కూడా యిదే.

అన్నమయ్య భూతదయకు పెద్దపీటవేశాడు. దానధర్మాలు చెయ్యాలన్నాడు. దైవం నుంచి, ప్రకృతినుంచి మనం పొందే ప్రతి ఒక్కటి ఉపయోగపడాలన్నాడు. అవి ఉపయోగంలోకి రాకపోతే అంతా వ్యర్థమేనని ఆవేదన వెలిబుచ్చాడు.

మనుజులై ఫలమేది మఱి జ్ఞానియౌదాకా
తనువెత్తి ఫలమేది దయగలుగుదాకా
ధనికులై ఫలమేది ధర్మము సేయుదాఁకా

చదివియు ఫలమేది శాంతము గలుగుదాకా
పెదవెత్తి ఫలమేది ప్రియమాడు దాఁకను
మదిగల్గి ఫలమేది మాధవుదలచు దాకా (1-437)

సకల భూతదయ చాలఁగ గలుగుట
ప్రకటించి దేహ సంభవమైన ఫలము (1-223)

## పరోపకారం

మానవధర్మాల్లో పరోపకారానికి అగ్రస్థానం వుంది. 'పరోపకారార్థం యిదం శరీరం' అని అర్యోక్తి. శ్లోకార్ధేన ప్రవక్షామి యదుక్తం గ్రంథకోటిభిః, పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్' పరులకు ఉపకారం చేస్తే పుణ్యం, ఇతరులను బాధిస్తే పాపం. ఇదే కోటి గ్రంథాల సారం. ఇతరులకు ఉపకారం చేయడం ఎంత ముఖ్యమో అపకారం చేయకుండా వుండడం కూడా అంతే ముఖ్యం. ఇతరులకు చేసే ఉపకారం ఎవరికో చేస్తున్నట్లు భావించకూడదు. తనకే చేసుకొంటున్నట్టు గుర్తించాలి. ఇది ఎంత ఉన్నత భావం. అన్నమయ్య పరోపకారాన్ని ఉద్ఘాటిస్తూనే పరపీడనాన్ని నిరసించాడు.

పరపీడ సేయుకంటే పాపము మరెందు లేదు
పరోపకారము కంటే బహు పుణ్యము లేదు (1-443)

భగవంతుడు కూడా పరోపకారే. ఎవరికీ అపకారం చేయడు. 'ఉపకారి దేవుడు అపకారి కాడు' (2-384) అని అన్నమయ్య. అతన్ని అంగీకరించే మనం అతన్ని ఆరాధించే మనం అతని ఆశయాన్ని మాత్రం ఎందుకు ఆదరించకూడదు.

పరోపకారం పట్ల పరపీడనం పట్ల అన్నమయ్య ఆలోచనలు ఏమిటో ఈ కీర్తన వెల్లడిస్తుంది.

కడుపెంత తాగుడుచు కుడుపెంత దీనికై
పడనిపాట్లనెల్ల బడి పొరలనేలా ॥ పల్లవి ॥

పరుల మనసునకు నాపదలు గలుగగజేయు
బరితాపకరమైన బ్రతుకుకేలా
సొరిది నితరుల మేలు చూచి సైపగలేక
తిరుగుచుండేటి కష్టదేహ మిదియేలా ॥ కడు ॥

యెదిరి కెప్పుడు జేయుహితమెల్ల దనదనుచు
చదివి చెప్పని యట్టి చదువేలా
పొదిగొన్న యాసలో బుంగులై సతతంబు
సదమదంబై పడయు చవులు దనకేలా ॥ కడు ॥

శ్రీ వేంకటేశ్వరుని సేవారతికి గాక
జీవనభ్రాంతి బడు సిరులేలా
దేవోత్తముని నాత్మ దెలియనొల్లక పెక్కు -
త్రోవ లేగినదేహి దొరతనం బేలా (1-302)

## జాతి నిరసన

నిమ్నజాతులు, ఉన్నతజాతులు అని జాతుల తేడాను పాటించి తమ జీవితాలను తద్వారా సమాజాన్ని నరకప్రాయం చేసుకోవడం కనిపిస్తూ వుంది. జాతి మత సంఘర్షణలు ప్రపంచ మనుగడకే ప్రమాదకరంగా పరిణమించాయి. ఈ నేపథ్యంలో అన్నమయ్య ఆలోచనలను గమనించి స్ఫూర్తి పొందడం ఎంతో అవసరం. విశిష్ట జాతులలో పుట్టిన వారమని అహంకరించడం అన్నమయ్య వృథా అన్నారు. జాతులు శరీరానికి మాత్రమే అన్నాడు. శరీరంపోతే జాతులు పోతాయి అని అన్నాడు. అవినాశి, అవ్యయం అయిన ఆత్మ, జాతుల కతీతమన్నాడు. భగవంతుని సేవతో బాగుపడడమే ఉత్తమజాతి లక్ష్యమని ఉద్ఘాటించాడు. జాతి నిరసన తెలియజేసే అన్నమయ్య కీర్తన.

విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల కదియే జాతి ॥ పల్లవి ॥

జాతి భేదములు శరీరగుణములు
జాతి శరీరము సరిదోడనె చెడు

ఆతుమ పరిశుద్ధం బెప్పుడును అతి నిర్దోషం బనాది
యీతలహరి విజ్ఞానపు దాస్యం బిది యొక్కడెపో సుజాతి ॥విజా॥

హరి యిందరిలో నంతరాత్ముడిదె
ధరణి జాతి భేదము లెంచిన
పరమ యోగు లీ భావమష్టమదము భవవికారమని మానిరి
ధరణిలోన బరతత్వజ్ఞానము ధర్మమూలమే సుజాతి ॥ విజా ॥

లౌకిక వైదికలంపటులకు నివి
కై కొను నవశ్యకర్తవ్యంబులు
శ్రీకాంతుడు శ్రీ వేంకటపతి సేసిన సంపాదమిందరికి
మేకొని యిన్నియు మీరిన వారికి మీ నామమే సుజాతి ॥ విజా ॥

(2-383)

అన్నమయ్య జాతుల్ని మాత్రమే గాక వర్ణాశ్రమ ధర్మాలను గూడ ఎద్దేవా చేశాడు. వర్ణాశ్రమ ధర్మాల్ని ఉల్లంఘించిన పూజ్యపురాణ పురుషుల్ని పేర్కొన్నాడు. క్షత్రియుడైన ధర్మరాజు శూద్రకులజుడైన విదురునికి, రాముడు జటాయువుకు, అంతిమ సంస్కారం చేసిన విషయాన్ని పాఠకుల దృష్టికి తీసుకువచ్చాడు. బోయవనిత శబరి ఎంగిలిని రాముడు పరమప్రీతితో స్వీకరించిన విషయాన్ని గుర్తు చేశాడు. వర్ణాశ్రమ ధర్మ అనుచితత్వాన్ని అన్నమయ్య ఆవిష్కరించిన తీరే ఈ సంకీర్తన.

విదురునకు బరలోకవిధి చేసెనట తొల్లి
అదె ధర్మసుతుడు వర్ణాశ్రమంబులు విడిచి
కదిసి నీ దాసుడైన కతమునసే కాదె యీ -
యెదురసే తుది పదం బిహమునసే కలిగె

అంటరాని గద్దకుల మంటి జటాయువుకు నీ -
వంటి పరలోక కృత్యములు సేసితివి మును
వెంట నీకైంకర్య విధి కలిమినె కాదె
వొంటి నీ హస్తమున నో (యో:) గ్యమై నిలిచె ॥ ఇలా ॥

యిరవైన శబరిరుచు లివియె నైవేద్యమై
పరగెనట శేషమును బహు నిషేధములనక
ధర దదీయప్రసాదపు విశేషమే కాదె
సిరుల శ్రీవేంకటేశ చెల్లు బడులాయె (1-399)

## మతసామరస్యం

విజ్ఞుల ఆలోచనా వైవిధ్యాన్ని బట్టి జీవన విధానము, ఉపాసనా విధానము ఏర్పడ్డాయి. ఇవే మతాలు. మతాల మౌలికతను మర్చిపోయి పైపై ఆచారాలను పట్టుకొని పాకులాడుతూ మతోన్మాదులు కొందరు మతఘర్షణలకు దారి తీస్తున్నారు. ఇది సరికాదు. మతాల మౌలిక తత్వాన్ని గ్రహిస్తే ఈ ఆవేశాలు, ఆర్భాటాలు, అర్థరహితాలని బోధపడక తప్పదు. మతాలు ఎన్నైనా వాటి మూలం మాత్రం ఒకటే. అందుకే 'ఏకం సద్విప్రాబహుధావదంతి' అని వేదం చెప్పింది. ఈ అంశాన్ని అన్నమయ్య గూడ గుర్తించాడు. ఎంతమంది దేవతలు ఉన్నప్పటికీ ఆ దేవతల అస్తిత్వం వేంకటేశ్వర తత్వమే అని ఎలుగెత్తి చాటాడు. చూపులను బట్టి రూపులే గాని మతులను బట్టి మతములే కాని నిజానికి అంతా ఆ అంతర్యామి పన్నిన మాయే అని అన్నమయ్య భావించాడు. ఆ యథార్థాన్నే పరమార్థంగా ఈ కీర్తనల్లో పలికించాడు.

ఎంత మాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచిచూడ బింతంతే నిప్పటియన్నట్లు ॥ పల్లవీ ॥

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మం బనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవు డనుచు ॥ ఎంత ॥

సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిశనములు మిము నానా విధులను తలపులకొలదుల భజింతురు
సిరుల మిమ్మునే యల్పబుద్ధి దలచిన వారికి నల్పం బవుదువు
గరిమల మిమునే ఘనమని తలచిన ఘన బుద్ధులకు ఘనుడవు ॥ఎంత॥

నీ వలన గొరతే లేదు మరి నీరు కొలది తామెరవు
ఆవల భాగీరథిదరి బావుల ఆజలమే వూరినయట్లు
శ్రీ వేంకటపతి నీవైతే మముజేకొని వున్నదైవమని
యీవల నే నీశరణనియెదను యిదియే పరతత్వమునాకు ॥ ఎంత ॥
(2-393)

తగు దైవమొకడే తమమతములే వేరు
పగటుల విష్ణుమాయ భ్రమయించీ నిదివో (3-550)

వైష్ణవులు, వేదాంతులు, శైవులు, కాపాలికులు, శాక్తేయులు మొదలైనవారు వారి వారి మతాలను ఆశ్రయించి అనేక భావనలతో ఆరాధిస్తున్నారు. అనేక పేర్లతో భగవంతుని పిలుచుకొంటూ సేవిస్తున్నారు. స్థూలదృష్టికి వారిలో పరస్పర భేదం కనిపించినా సూక్ష్మదృష్టి వుండే విజ్ఞానవంతునికి వారందరూ ఒకే పరమాత్మను చేరడానికి ప్రయత్నిస్తున్నారని స్పష్టం కాక తప్పదు.

## సమానత్వ ప్రతిపాదన

ప్రతి వారికి విశాల దృక్పథం వుండాలి. అది వుంటే సంకుచిత స్వభావం తనంతట తానుగానే సమసిపోతుంది. భేదదృష్టి నశిస్తుంది. మోదం వెల్లి విరుస్తుంది. ఇటువంటి విశాలదృక్పథం ఉదాత్తమనస్తత్వం అన్నమయ్యలో వున్నాయి. అందరిలోను వున్న అంతరాత్మ ఒక్కడే అని అన్నమయ్య గుర్తించగలిగాడు. హీనాధికాలు లేవన్నాడు. 'ప్రాణికోటి' అంతా ఒక్కడే అని ప్రమాణీకరించి ప్రతిపాదించాడు. రాజు-బంటు ఒకే విధంగానే నిద్రపోతారు. బ్రాహ్మణుడు-చండాలుడు ఒకే భూమిలోనే నడుస్తారు. ఏనుగుమీద, కుక్కమీద ఒకే ఎండ కాస్తుంది. ఇలాంటప్పుడు హీనాధిక భేదాలకు తావెక్కడ వుంది. హాస్యాస్పదం. ఇది అన్నమయ్య భావన.

బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర
బ్రహ్మ మొకటే పరబ్రహ్మ మొకటే

కందువగు హీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ

ఇందులో జంతు కులమంతా నొకడే
అందరికి శ్రీహరే అంతరాత్మ

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అంతనే బంటు నిద్రదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలు డుండేటి సరిభూమి యొకటె

అనుగు దేవతలకును అలకామ సుఖమొకటె
ఘనకీటపశువులకు కామసుఖమొకటే
దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే
వొనర నిరుపేదకును వొక్కటే అవియు

కొరలి శిష్టాన్నములు గొననాకలొకటే
తిరుగు దుష్టాన్నములు దినునాక లొకటే
పరగదుర్గంధములపై వాయువు నొకటే
వరుస బరిమళముపై వాయువు నొకటే

కడగి యేనుగు మీద గాయు యెండొకటే
పుడమి శునకము మీద బొలయు నెండొకటే
కడుబుణ్యులను పాపకర్ములను సరిగావ
జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే (2-385)

## స్వతంత్ర ప్రీతి

మానవుడు సంఘజీవి అయినప్పటికి అతని మనసు మాత్రం స్వేచ్ఛగా సంచరించాలనుకొంటుంది. స్వతంత్రంగా జీవించాలనుకొంటుంది. ఎవరి ఆధిక్యానికి లోబడకూడదనుకొంటుంది. ఇది మానవసహజ స్వభావం. ఈ స్వభావాన్ని అన్నమయ్య ఆదరించాడు. ఆకలిలో జంతువుగా జీవించినా ఫరవాలేదు గాని యితరులను సేవిస్తూ జీవించడం హీనమన్నాడు. పక్షిగా బ్రతికినా ఫరవాలేదుగాని యితరులను వేడికొంటూ తద్వారా జీవించడం హేయమన్నాడు. గొడ్డుగా పుట్టి పడరాని పాట్లైనా పడవచ్చు గాని యితరులను పొగడడం నికృష్టమన్నాడు. ఉసిరిమానైవున్నా ఫరవాలేదుగాని వీరిని వారిని అడుక్కొని జీవించడం అధమమన్నాడు అన్నమయ్య. స్వతంత్రప్రవృత్తి, స్వేచ్ఛాకాంక్ష, ఆయన పదంలో పల్లవించిన తీరు పరమరమణీయం.

చీచీ నరులకేటి జీవనము
కాచుక శ్రీహరి నీవే కరుణింతుగాక ॥ పల్లవి ॥

అడవిలో మృగజాతియైన గావచ్చు గాక
వడినితరుల గొలువగావచ్చునా
వుడివోని పక్షియై వుండనైనా వచ్చుగాక
విడువ కెవ్వరినైనా వేడవచ్చునా ॥ చీచీ ॥

పసురమై వెదలేనిపాటు పడవచ్చు గాక
కసివో నొరుల బొగడగావచ్చునా
వుసురు మానై పుట్టి వుండనైన వచ్చుగాక
విసువక వీరి వారి వేసరించవచ్చునా ॥ చీచీ ॥

యెమ్మెల బుణ్యాలు సేసియిల యేలవచ్చుగాక
కమ్మి హరిదాసుకు గావచ్చునా
నెమ్మది శ్రీ వేంకటేశ నీచిత్తమే కాక
దొమ్ముల కర్మములివి తోయవచ్చునా (1-397)

## స్నేహం

జీవితంలో తీయని చక్కని, చిక్కని అనుబంధం స్నేహం. హృదయానికి దగ్గరగా వుంటూ హృదయంతో మాట్లాడేది స్నేహం. అందువల్లనే 'పరమ మిత్రుండున్న బంధువర్గంబేల' అని అడిదము సూరకవి తెలియజేశాడు. మంచి వారితోస్నేహం అన్నిటినీ సాధించి పెడుతుందని భర్తృహరి భావన. 'సాధు సంగంబు సకలార్థ సాధనంబు' జీవితంలో స్నేహానికి అంత విలువ వుండబట్టే అన్నమయ్య కూడా స్నేహం పట్ల తన గాఢ స్నేహాన్ని ఒక గేయంలో ప్రకటించాడు.

స్నేహం పెంచుకొనే కొద్ది పెరుగుతూ వుంటుంది. దానికి అంటూ శొంటూ అంటూ ఏవీ వుండవు. ఇది మనసులో హత్తుకుపోతుంది. తన వెంట యితరులను తిప్పుకొంటుంది. సంతోషాన్ని కళ్లల్లో కనబడేటట్టు చేస్తుంది. దీనికి ఎడబాటు వుండదు. స్నేహం ఇంత గొప్పది కాబట్టే అన్నమయ్యను కూడా బాగా ఆకట్టుకొంది. స్నేహానికి పెద్ద పీటవేసిన అన్నమయ్య పాట పరమ ఆసక్తికరం.

పెంచబెంచ మీద బెరిగేటి చెలిమి
ఇంచుకంత తాలిముల కెడలేని చెలిమి ॥ పల్లవి ॥

అంటు ముట్టు లేక మనసులంటు కొన్న చెలిమి
కంట గంట నవ్వించే ఘనమైన చెలిమి
వెంట వెంట దిరిగాడు వెట్టిగొన్న చెలిమి
యింటి వారి చిత్తములకు నెడరైన చెలిమి ॥ పెంచ ॥

చెక్కు చెమట పెక్కుమనే చిక్కనైన చెలిమి
యెక్కుడౌటా తమ్ము దమ్ము నెఱగనీని చెలిమి
చక్కదనమే చిక్క మేను చిక్కినట్టి చెలిమి
లెక్కలేని యాసలెల్లా లేతలయిన చెలిమి ॥ పెంచ ॥

అంకురించినట్టి తలపు లధికమయిన చెలిమి
లంకెలయిన యాసలెల్లా లావుకొన్న చెలిమి

వేంకటాద్రి విభుని గూడి వేడుకయిన చెలిమి
పంకజాననలకెల్ల బాయరాని చెలిమి (1-29)

దైవత్వమెంత అనంతమో ఆలోచిస్తే మానవత్వం కూడా అంతే అనంతం. మానవీయ విలువలు కూడా అసంఖ్యాకాలు. మానవీయ విలువలను ఒక వ్యక్తి అనుకొంటే పరోపకారం, యితరులను బాధించకుండటం. ఆ వ్యక్తి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మానవీయత ఎంత విశాలమో అన్నమయ్య సాహిత్యం అంతకంటె విశాలం.

# "తాళ్లపాక వాఙ్మయం-21వ శతాబ్దపు పరిశోధన"

జి.బి. శంకర రావు

**వి**జయీభవ శ్రీ వేంకటరాయ జ్ఞ
విజయీభవ ముని వినుతదైవరాయ ॥పల్లవి॥

ఖలజనభీషణ కౌస్తుభభూషణ
విలసిత శారచాప వివిధరూప
బలిజ్ఞుదభంజన పరమ నిరంజన
అలమేలు మంగ సహాయ వేంకటరాయ
(సంకీ.273, తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతి, అజ్ఞాతం, అముద్రితం)

శ్రీ వేంకటేశ్వరుని వైభవం వర్ణనాతీతం! విశాల విశ్వానికి ఆది దేవుడై, అధిపతియై, సకలజీవాళికి శ్రేయోదాయకుడై. ఆమటి మొక్కులవాడై, వడ్డీ కాసులవాడై, వనజనాభుడై, దురితదూరుడై, కోరిన వరాలిచ్చే దేవుడై, వక్ష స్థలమున అలమేలుమంగను, ఆదిలక్ష్మిని నిడుకొని వేవేల చందాలతో వేంకటాచల వైకుంఠంపై అలరారు శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని ఆత్మార్పణ భక్తితో వేనవేల కీర్తనల్లో, వివిధ సాహితీ ప్రక్రియల్లో వర్ణించి తరించిన కవి కుటుంబం తాళ్లపాక కుటుంబం.

అసూర్యంపశ్యగా రాగిరేకులలో మ్రగ్గియుండిన తాళ్లపాక కవుల వాఙ్మయాన్ని తెలుగుజాతికి వెలుగుదివ్వెగా అందించిన కారణజన్ములు కీ.శే.వేటూరి ప్రభాకర శాస్త్రి గారు! 20వ శతాబ్దం ఆరంభంలో, ఎన్నడో తాళ్లపాక కవులు శ్రీవేంకటేశ్వర పరంగా చెప్పిన అమూల్య నిధియైన సారస్వత సంపదను గుర్తించి, దాని విలువను అప్పటి అధికారులకు తెలిపి 'తాళ్లపాక వాఙ్మయ పరిశోధనా ప్రస్థానాన్ని' ప్రారంభించిన మహనీయులాయన! తదనంతర కాలంలో వారు వేసిన పరిశోధనా బాటలోనే నడచి, రాగిరేకులలో లభ్యమైన తాళ్లపాక వాఙ్మయాన్ని పరిష్కరించి ప్రకటించి

స్వామికి అర్పించిన గొప్ప పరిశోధకులు కీ.శే. రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, కీ.శే. గౌరిపెద్ది రామ సుబ్బశర్మ గార్లు మరియు శ్రీ శాస్త్రి గారి శిష్యులై, శాస్త్రి గారికి పరిశోధనా సహాయకులుగా నుండిన శ్రీ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు. ఇదంతయూ సాహితీ పరిశోధనా ప్రస్థానం.

సంగీత పరంగా కూడా తాళ్లపాక కవులకు తొలి సేవ చేసినది ప్రభాకరులే! 1949వ సం॥లో అన్నమాచార్య వర్ధంత్యుత్సవాలను ఆరంభించి, గాయనీగాయకులను ఆహ్వానించి ఆకాశవాణి విజయవాడ కేంద్రం ద్వారా ప్రసారం చేయించిన మూర్తిమంతులు. సంగీత సాహిత్య పరిపుష్టులని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారిని కొనియాడి, వారిని మైసూరు నుండి రప్పించి తాళ్లపాక వాఙ్మయ పరిశోధనా ప్రస్థానంలో తన సరసన వారిని నిలిపిన ఉదాత్త సంస్కారులు ప్రభాకరులు.

రాగి రేకులలో సూచించిన రాగాలలోనే స్వరరచన ఆరంభించి పాటలను సంగీతంతో పరిపుష్టం చేసిన రాళ్లపల్లి వారు మొదలుకుని ఎమ్మెస్ సుబ్బులక్ష్మి, నేదునూరి కృష్ణమూర్తి, డా॥ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ, డి. పశుపతి, మల్లిక్, మంచాళ జగన్నాధరావు, డా॥ పినాకపాణి వంటి మహోన్నత సంగీత విద్వాంసులు రాగాలు కూర్చి ప్రచారం చేయగా, ఆనాడు వర్ధమానులై, నేడు అన్నమయ్య స్వర సంపదతో పండి పరిఢవిల్లి, పరిపూర్ణ విద్వాంసులైన డా॥ శోభారాజు, బాలకృష్ణ ప్రసాద్ గార్ల ప్రచార ప్రస్థానం నిరుపమానమైనది.

ఇక డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు గారి కృషి అటు సాహిత్యంలోను, ఇటు సంగీతంలోను వుండి భావితరాలకు మార్గ నిర్దేశం చేసింది.

పై చెప్పినదంతయూ 20వ శతాబ్దికి, ప్రత్యేకించి రాగి రేకుల సారస్వతానికి సంబంధించిన ఆరంభ కృషి.

ఇక 21వ శతాబ్దపు పరిశోధనకు వస్తే -

తిరుమలలో లభించిన 'ప్రథమోపలబ్ధ స్వర సహిత శిలా లేఖము' పై 20వ శతాబ్దం కడలో జరిగిన విస్తృత స్థాయి పరిశోధన 21వ శతాబ్దపు పరిశోధనకు ఆరంభ సూచకంగా నున్నది. 'తాళ్లపాక వాఙ్మయ పరిశోధనా ప్రస్థానం'లో 20,21 శతాబ్దాలకు వేర్వేరు విశేషములు కలవు.

తరచి చూడగా-

1. 20వ శతాబ్దపు పరిశోధన కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రి గారిచే ఆరంభమైనది.

2. 21వ శతాబ్దపు పరిశోధన శ్రీ శాస్త్రి గారి నిజ, సాహితీ వారసులు డా॥వేటూరి ఆనందమూర్తి గారిచే ఆరంభమైనది.
3. 20వ శతాబ్దపు పరిశోధన రాగిరేకులకు సంబంధించినది.
4. 21వ శతాబ్దపు పరిశోధన శిలాశాసనాలు, తాళపత్రాలు, కాగితపు ప్రతులకు సంబంధించినది.

21వ శతాబ్దపు పరిశోధనా పూర్తి వివరాలకు వెళదాం -

1998వ సం॥లో తిరుమల తిరుపతి దేవస్థానం, అన్నమాచార్య ప్రాజెక్టు వారు తాళ్లపాక పద సాహిత్య సంపుటాలను 20 సంపుటాలుగా పునర్ముద్రించి రాగిరేకుల సారస్వతమంతా సమగ్రంగా ప్రకటించామని తెలియజేశారు.

రాగిరేకులలో లభ్యం కాక, కాలగర్భంలో నష్టం చెందిన రాగిరేకులలో వుండి మన కందక లేక రాగిరేకుల కెక్కక తాళపత్రాలలో మాత్రమే వుండి అవి తంజావూరు, మధురై, శ్రీరంగం, కుంభకోణం మొదలైన ప్రాంతాలకు చేరుకున్నవి, ఇంతియే కాక తాళ్లపాక వంశస్థుల వద్ద పారంపర్యంగా వస్తూ వుండిన తాళపత్రముల నుండి కాగితపు ప్రతులకెక్కిన సాహిత్యం ఈ శతాబ్దపు పరిశోధనకు మూల ద్రవ్యము.

ఈ నూతన శతాబ్దపు పరిశోధనకు ఆరంభ సూచకంగా 'ప్రథమోపలబ్ధ స్వర సంగీత శిలా లేఖము'ను పరిష్కరించిన డా॥ వేటూరి ఆనందమూర్తి గారే 1998లో తంజావూరు సరస్వతీ మహలు నుండి పెదతిరుమలయ్య విరచిత సస్వర ఝోంబడ ప్రబంధాలు రెండింటిని, మరికొన్ని తాళ్లపాక వారి పదాలు తంజావూరు, మధురై, తిరుపతి ప్రాంతాల నుండి సేకరించారు, సేకరిస్తూ వస్తున్నారు.

తాళ్లపాక కవి కుల గురువు అన్నమాచార్యుల కీర్తనల సంఖ్యలో అనుమానం లేదు. అవి ఖచ్చితంగా ముప్పది రెండు వేలు. శ్రీ వేంకటనాథుడు అన్నమయ్యా పదహారవ యేట ప్రత్యక్షమై, దినమునకొక్క సంకీర్తన తక్కువ కాకుండా సమర్పించమని ఆనతినివ్వడం, అదే ఆనతిన ఆచార్యుడు స్వామికి నివేదించటం జరిగినది. అన్నమయ్యా జీవించిన కాలంలోనే సంకీర్తన రచన చేపట్టిన పెద తిరుమలయ్యా తండ్రి పరమపదం పొందిన వేళ నుండి శ్రీ స్వామి వారు తండ్రి కిచ్చిన ఆజ్ఞను తాను శిరసావహించాడు. దీనికి పెద తిరుమలయ్యా సంకీర్తనల తొలి రాగిరేకు సాక్ష్యంగా నిలుస్తున్నది. ఈ విధంగా పెద తిరుమలయ్యా విరచిత కీర్తనలు కూడా వేల సంఖ్యలో ఉంటాయి. తరువాత కాలంలో చిన తిరుమలయ్యా

ఆ మార్గాన్ని అనుసరించాడు. నిశిత దృష్టిని సారిస్తే, తాళ్లపాక కవులవి కీర్తనలు మాత్రమే దాదాపు యాభై వేలకు పైగా నున్నా ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు. ఇందులో మనకు లభ్యమైన రాగి రేకులలోని కీర్తనలు పదిహేను వేలు మాత్రమే! రాగి రేకుల సారస్వత విలువ తెలియని కొందరు కొన్ని రేకులను కరిగించుకుని చెంబులు, పాత్రలుగా మలచుకున్నారు. అలా కాలగర్భంలోకి పోగా పోగా పదిహేను వేల కీర్తనలైనా దక్కించుకునే అదృష్టం తెలుగు వారికి కలిగింది.

పైన తెలిపిన దంతా తామ్రపత్రాల చరిత్ర, అందులో నున్న కీర్తనలున్నూ! మరి తాళపత్రాల చరిత్ర ఏమిటి? అందులోనున్న కీర్తన లేమిటి? తామ్రపత్రాల లోనున్న కీర్తనలే తాళపత్రాలలో ఉన్నాయా? లేక తామ్రపత్రాలలో లేని కీర్తనలు కూడా తాళపత్రాలలో ఉన్నాయా? తామ్రపత్రాలు నష్టం చెందగా ఆ నకలు పాటలు తాళపత్రాలలో ఉన్నాయా? అనే ప్రశ్నలు తాళ్లపాక వాఙ్మయ పరిశోధకు లందరికీ మదిలో మెదలవలసిన ప్రాథమికస్థాయి విషయాలు. ఈ వ్యాస రచయిత పరిశోధనకు పై ప్రశ్నలే ఆలంబన.

తాళ్లపాక కవుల వాఙ్మయాన్ని ప్రాణ సమానంగా భావించే ఈ వ్యాస రచయిత నిశితంగా పై విషయాలను సమగ్రంగా పరిశీలించిన పిమ్మట రాగిరేకులో లేని అనేక కీర్తనలు తాళపత్రాలలో చూడటం జరిగినది. తాళపత్రాల కీర్తనల సేకరణా కార్యక్రమం ఆరంభమైనది. శ్రీరంగం, తంజావూరు, కుంభకోణం మధురై ప్రాంతాలలో అన్వేషిస్తే తంజావూరు తాళపత్ర గ్రంథాలయంలో తాళ్లపాక వారి పదాలు లభ్యమైనాయి.

తంజావూరి ప్రతిలో 'వెంకట' ముద్రతో ఉన్న తాళ్లపాక వారి 39 అజ్ఞాత కీర్తనలను వెలికి తీయడం జరిగినది. ఈ 39 పదాలతో పాటు రాగిరేకులలో లభించిన మరికొన్ని పదాలూ, 'శ్రీకృష్ణ' ముద్ర గల మరికొన్ని పదాలూ ఈ ప్రతిలో ఉన్నాయి. అప్పటి నా యెరుకను అనుసరించి 'వెంకట' ముద్ర గలవి మాత్రమే తాళ్లపాక వారి పదాలుగా భావించి అజ్ఞాత సంకీర్తనలు 39 తో పాటు, రాగిరేకులకు ఎక్కి పాఠభేదాలతో ఉన్న 28 పాటలను, రాగిరేకులలో లేక వేటూరి ప్రభాకర శాస్త్రి గారిచే అన్నమాచార్య జీవిత చరిత్ర పీఠికలో ఉదాహృతమైన 2 పాటలను కలిపి మొత్తం 59 సంకీర్తనలుగా లెక్క తేల్చడం జరిగింది. తంజావూరు ప్రతిలో లభించిన అజ్ఞాత సంకీర్తనలన్నీ శృంగార సంకీర్తనలు. ఈ ప్రతిలో మరో విశేషమేమంటే ప్రతి సంకీర్తనకు రాగంతో పాటు తాళం కూడా సూచించబడింది. రాగిరేకులలో వలెకాక మొదట చరణం వ్రాసి, తరువాత పల్లవి, తరువాత మిగిలిన చరణాలు వ్రాశారు.

**రాగం: కాంబోజి** **తాళం: యెడవొత్తు**

అప్పటప్పటికి నీ ముద్రిక యిట్టే కన్నుల నొత్తుకొనును
తప్పక మదిని నీ మాటలే తలఁచి తలయూఁచును
చొ(వొ?)ప్పడని రూపమే వ్రాసుక చూచిజూచి మ్రొక్కిమ్రొక్కి ముద్దాడును
కప్పిన తమిని తానే పలికి కన్నీరు లోలో(న) నించును

॥చరణం1॥

ఎటువంటి మోహము ఇంతి! ఇదిగో నేడు
తటుకున నిన్ను బేర్కొని తనకుఁదానే సిగ్గుబడును ॥పల్లవి॥

చెలితోడ నీ మన్ననలెల్ల చెప్పి చాల పులకించును
ఉలికి (ని?)న్నూరకే పిలిచి వుసురుయని వెరవు బడును
నెలవుగ యన్నియు మాని నీ కాలి చప్పుడు యాలకించును
తొలగక వీ(నీ?)వు వచ్చే ద్రోవ తప్పక చూచును ॥చరణం2॥

గ్రక్కున నిను కనుగొంటేను కడు తానే ముందు పైకొనును
అక్కరతో నిన్ను (దగ్గ (గ్గే)ర ) నప్పుడే యట్టే తానే కరుగును
చక్కని అలమేలు మంగ సరగున శ్రీ వేంకటేశ
చిక్కినీ కౌఁగిటిలోన చిత్రమై పరవశమౌను ॥చరణం3॥

(సంకీ.18, అన్నమయ్య గుప్త సంకీర్తనాధనం)

పై పరిశోధనా కృషి యంతయూ 'అన్నమాచార్య భావనా వాహిని' వ్యవస్థాపక అధ్యక్షురాలు డా॥ శోభారాజు గారి ఆధ్వర్యంలో జరిగింది. తంజావూరు తాళపత్రాల పాటలను 'అన్నమయ్య గుప్త సంకీర్తనాధనం' పేర ప్రకటించి, 594వ అన్నమయ్యా జయంతి సందర్భమున, 2002 సం॥లో సాహితీ విశ్వంభరులు, కవీశ్వరులు డా॥ సి. నారాయణరెడ్డిగారి అమృతహస్తాల ద్వారా ఆవిష్కరింపజేసినది 'అన్నమాచార్య భావనా వాహిని'.

ఇక ఈ వ్యాస రచయిత పరిశోధనా ప్రస్థానం ద్వితీయ దశలో తాళ్లపాక వారి అజ్ఞాత కీర్తనలు మరికొన్ని వారి వంశస్థుల వద్దనే వున్నవని తెలిసింది. ఆ వివరాలు చూద్దాం!

తాళ్లపాక వంశస్థుల నుండి 'తాళపత్ర ప్రతి' రూపంలో పదనిధిగా 'తాళ్లపాక సంకీర్తనలు' పేరుతో సంక్రమిస్తున్న సంకీర్తనా గుచ్ఛము ననుసరించి 1940 వ

సం॥ ప్రాంతములో శ్రీ తాళ్లపాక వేంకట శేషాచార్యులు గారు కాగితపు ప్రతిని తయారు చేశారు. ఆది 24-4-1941 సం॥ న మూల ప్రతి ననుసరించి 'శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ' అధికారులు నకలు చేసినారు. (S.V.O.6609) మూల ప్రతి తిరిగి శ్రీ తాళ్లపాక శేషాచార్యులు గారికి ఇవ్వబడినది. 'శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ'కు ఆ విధముగా 'తాళ్లపాక శేషాచార్యులు ప్రతి' చేరినది.

తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతిలో 288 పాటలు కలవు. అధిక భాగం వేంకట ముద్రతోను, మరికొన్ని కృష్ణ ముద్రతోను కలవు. ఇదిగాక పెద తిరుమలయ్యా విరచిత 'శ్రీ వేంకటేశ్వర సుప్రభాత స్తవం' (ద్విపద) కలదు. ఈ ద్విపద రచన కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారిచే ఇదివరకు పరిష్కృతమై ప్రకటింపబడియున్ననూ, ఇందు లభించిన దానిలో కొన్ని ద్విపదలు అధికంగా కలవు.

తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతిని తొట్ట తొలుతగా గుర్తించినది కీ.శే.వేటూరి ప్రభాకర శాస్త్రి గారే! వారు అన్నమాచార్య జీవిత చరిత్రను పరిష్కరిస్తూ, సందర్భములకు తగిన సాక్ష్యములకై రాగిరేకులతో పాటు ఈ వ్రాతప్రతినీ ఆశ్రయించారు. ఆ విధముగా ఈ వ్రాతప్రతిలోని పది సంకీర్తనలను 'అన్నమాచార్య జీవిత చరిత్ర' పీఠిక లో పరిష్కృత పాఠాలతో ఉదహరించిరి. ఈ పాటలలో రాగి రేకులలో కానరాని "పొడగంటిమయ్యా" పాట వుండటం, అది ప్రపంచమంతా పరివ్యాప్తి నొందడం ఈనాడు మనం చూస్తున్నాం! అయితే వారు తదనంతర కాలంలో శేషాచార్యుల వ్రాతప్రతి పరిష్కరణకు పూనుకోక పోవటానికి కారణం, అప్పటికి పరిష్కృతములు కావలసిన రాగిరేకులు, అందునున్న పాటలు వేల సంఖ్యలో వుండటమే. అందునా మొదటి రాగి రేకులలోని మొత్తం సంకీర్తనలు ప్రకటితమైతే తప్ప, ఎన్ని కొత్త పాటలు (రాగి రేకులలో లేనివి) ఈ ప్రతిలో కలవో తెలియును. అయిననూ శ్రీ శాస్త్రి గారి దృష్టి చాలా నిశితమైనది. అందుకే వారు 'అన్నమాచార్య జీవిత చరిత్ర' పీఠిక పుట 65లో ఈవిధముగా తెల్పిరి. "క్రీ.శ.1560కి పూర్వమే కొన్ని సంకీర్తనములు తంజావూరికిఁ జేరి యుండును. అక్కడ సంకీర్తనము లన్నియుఁ దిరుపతి రాగి రేకుల మీఁద నున్నవో లేవో? శేషాచార్యుల వారి తాళపత్ర ప్రతి లోని సంకీర్తనములు గూడ నన్నియు రాగి రేకుల మీఁది కెక్కినవో లేవో? పెద తిరుమలాచార్యుఁడు గూడ దినమునకొక సంకీర్తనము చొప్పునఁ దండ్రి యానతిని రచించెను. అవి కొన్ని వేలుండవలెను గదా! కానరావు". శ్రీ శాస్త్రి గారి పరమపదానంతరం మరలా శేషాచార్యుల వ్రాతప్రతి కీ.శే. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారి అమృత హస్తములచే పరిశీలింపబడినది. రాళ్లపల్లి వారు

కొత్త పాటల అన్వేషణకు కాక, రాగిరేకులలోని పాటల పాఠభేదముల కొరకు, పాదముల సవరణలకు మాత్రమే ఈ ప్రతిని ఉపయోగించినారు. ఈ విషయమును వారు పరిష్కరించిన **4,5** సంపుటముల పీఠికలలో **30-3-1955** మరియు **4-10-1956** సంగులలో తెలియజేసితిరి.

శ్రీ శాస్త్రి గారి శిష్యులైన శ్రీమాన్ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు తాము పరిష్కరించిన సంపుటాల పీఠికలలో వివిధ ప్రాంతాలలో సేకరించ వలసిన తాళ్లపాక వారి కొత్త కీర్తనలను తెలియజేస్తూ, 8వ సంపుటము పీఠికలో "శ్రీ తాళ్లపాక శేషాచార్యుల ప్రతి నుండి, తంజావూరి సరస్వతీ మహలులోని ప్రతి నుండి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము వారు వ్రాయించుకొన్న ప్రతులలోనివి సరి చూచి యిప్పటి రేకులలో కానరాని సంకీర్తనలు ముద్రింప వలసియున్నవ"ని **12-3-1961** సంగులోనే తెలియజేసితిరి. అప్పటికీ రాగిరేకుల సాహిత్యమంతా ప్రకటింపబడలేదు కాబట్టి ఇది కొంత కష్ట సాధ్యమైన విషయమే!

**1998** సంగులో రాగి రేకులలో లభ్యమైన సంకీర్తనలన్నీ సమగ్రంగా ముద్రించినట్లు, తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్య ప్రాజెక్టు తెలియజేసింది. అనంతర కాలములో తాళపత్రముల కీర్తనల పరిశీలన, ప్రకటన ఆరంభం కావల్సివుంది. ఆ కార్యమునకు అది సరైన సమయం. కారణములేవో తెలియవు కాని, అది జరుగలేదు.

పై ఎరుకతో పరిశోధన ప్రారంభించిన ఈ వ్యాస రచయిత 'అన్నమాచార్య భావనా వాహిని' అధ్యక్షురాలు డాగి శ్రీమతి శోభారాజు గారి ఆధ్వర్యంలో తంజావూరు పాటలను సేకరించి 'అన్నమయ్య గుప్త సంకీర్తనాధనం' పేరుతో ప్రకటించడం జరిగినది.

ఇక మిగిలినవి శ్రీ తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతిలోని తాళ్లపాక కవుల అజ్ఞాత సంకీర్తనలు. కార్యకారణముల సర్వమునకూ కర్తయైన శ్రీ వేంకటేశ్వరుని అపార కరుణా వృష్టితో తాళ్లపాక వాఙ్మయ సాగరంలో తడిసి తన్మయం చెందిన ఈ వ్యాస రచయితకు 'శేషాచార్యుల వ్రాతప్రతి'ని తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ నుండి సేకరించే భాగ్యం **29-4-2005**న కలిగింది అనంతరం ఆ వ్రాతప్రతి నకలును శ్రీ వేంకటేశ్వర స్వామి వారి శ్రీ చరణారవిందముల ముందుంచ గలిగే మహద్భాగ్యం కూడా కలిగినది. **1956** వ సంగులో రాళ్లపల్లి వారు పాఠభేదములకై శేషాచార్యుల వ్రాతప్రతిని పరిశీలించిన తదనంతరం ఈ ప్రతి అజ్ఞాతంగా వుండిపోయినది. రాగిరేకులలోని పాటలన్నీ వెలికి వచ్చినా ఈ ప్రతిని పట్టించుకున్న

వారు లేరు. దాదాపు 50 సం॥ ల తరువాత మరలా ఈ వ్రాతప్రతి నేడు చర్చనీయాంశమైనది. తంజావూరు పాటల సేకరణ రీతిలోనే శేషాచార్యుల వ్రాతప్రతి సేకరణకు శాంతా బయోటెక్నిక్స్ అధినేత పద్మభూషణాలంకృతులు డా॥ కె.ఇ. వరప్రసాద్ రెడ్డి గారు ఈ వ్యాస రచయితకు అందించిన సహాయ, సహకారములు అమూల్యములు, ఎనలేనివి. తెలుగు సంస్కృతీ సంప్రదాయాలపై, సంగీత సాహిత్యములపై ఆదరాభిమానాలు కలిగి, బయోటెక్నాలజీ రంగంలో తెలుగు వారి తేజాన్ని, భారతీయ ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన సేవాభావ సహృదయులైన వీరు ఈ రచయితకు తాళ్లపాక వాఙ్మయ పరిశోధన లోనూ, పాటల సేకరణ లోనూ ఆది నుండి అవ్యాజానురాగంతో శక్తికి మించి సహాయాన్ని అందిస్తున్నారు. తాళ్లపాక వాఙ్మయ పరిశోధనకు ఊతమిస్తున్న మహనీయ పరంపరలో నేటి తరానికి చెందిన ఈ సౌహార్ద్ర హృదయుని ఆదరణ ఈ రచయితను తాళ్లపాక సాహితీ రంగంలో నిలబెట్టినది. అందులకు సర్వదా వారికి కృతజ్ఞుడను.

శేషాచార్యుల వ్రాతప్రతిని ఆమూలాగ్రం పరిశీలించగా 288 పాటలు తేలినవి. ఇందున్న కొత్త పాటల గుర్తింపునకు ఇప్పటి వరకూ రాగిరేకులలో ప్రకటితములైన మొత్తం పదిహేను వేల పాటలతో, శేషాచార్యుల వ్రాతప్రతిలోని పాటలను సరిచూడగా, ఇప్పటి వరకూ రాగి రేకులలో కాని, మరోచోట కాని కానరాక నూతనముగా వేంకట ముద్రతో, శ్రీ కృష్ణ ముద్రతో లోకం వెలుగుచూసినవి దాదాపు 170 పాటలు. కొత్త పాటల గుర్తింపున కోసం ఈ వ్యాస రచయితచే శేషాచార్యుల వ్రాతప్రతిలోని పాటలన్నిటితో పట్టిక రూప విషయసూచిక (పాత, కొత్త పాటల వివరాలతో) ఒకటి తయారు చేయబడినది. తిరుమల శ్రీవారి శ్రీ చరణములందుంచ బడిన శేషాచార్యుల వ్రాతప్రతిని, ఈ విషయ సూచికను పరిష్కరణకు ప్రముఖ తాళ్లపాక వాఙ్మయ పరిశోధకులు కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రి గారి నిజ, సాహితీ వారసులు డా॥ వేటూరి ఆనంద మూర్తి గారికి పరిష్కరణార్థమై ఈ వ్యాస రచయిత అందించటం జరిగినది. (చూ. 'తాళ్లపాక సంకీర్తనలులో శ్రీ కృష్ణ పదాలు ఎవరివి?' రసమయి, సాంస్కృతిక మాస పత్రిక, అక్టోబరు, 2005 మరియు అముద్రితములైన తాళ్లపాక సంకీర్తనలు, ఒక పరిశోధనాత్మక పరిశీలన, అక్షర, డిఆర్ అభినందన సంచిక, 2006 ప్రచురితం)

అతి తక్కువ కాలంలోనే డా॥ వేటూరి ఆనందమూర్తి గారి చేత శేషాచార్యుల వ్రాతప్రతిలో నున్న పాటలన్నీ పరిష్కరింపబడి నేడు అచ్చుకు సిద్ధంగా నున్నవి.

తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతిలోని అపురూప పరిశోధనా విషయములను

జాతికి సవివరంగా అందించాలనే సదుద్దేశ్యంతో డా॥ వేటూరి ఆనందమూర్తి గారు సాంస్కృతిక మాస పత్రిక 'రసమయి'లో ఆగస్టు 2005 నుండి ధారావాహికంగా వ్యాసాలు వ్రాస్తున్నారు. ఇదియే గాక అక్షర, డి.ఆర్. అభినందన సంచికలో (2006 ప్రచురితం) అముద్రితములైన "తాళ్లపాక సంకీర్తనలు", ఒక పరిశోధనాత్మక పరిశీలన పేర ప్రత్యేక వ్యాసమొకటి వ్రాశారు. ఇందు ఆ ప్రతి పూర్వాపరాల గురించి విస్తృత స్థాయిలో పరిశోధనాత్మకంగా చర్చింపబడినది.

తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతి మూలమున, డా॥ వేటూరి ఆనంద మూర్తి గారు కొత్తగా కనుగొన్న తాళ్లపాక కవుల ముద్రా భేదాల వల్ల 'చిన్నన్న' గాయకుడుగా కూడా ఆవిష్కరింపబడుతున్నాడు. చిన్నన్న ద్విపద రచనలే కాక, కీర్తనలేవో వ్రాసినాడని, అవి అలభ్యములని పూజ్యులు వేటూరి ప్రభాకర శాస్త్రి గారు, రాళ్లపల్లి వారు ప్రతిపాదించితిరి. నేడు డా॥ వేటూరి ఆనందమూర్తి గారి ప్రత్యేక నిశిత పరిశోధన వల్ల అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్యల కీర్తనల ముద్రాభేదాలు స్పష్టంగా తెలిసినవి. తాళ్లపాక కవులందరిలోనూ వేంకటేశ్వర మూల ముద్రను వ్రథమంగా కలిగినవాడు అన్నమయ్య. ఈ మహనీయుడు శ్రీ వేంకట, తిరువేంకట, వేంకటేశ్వర, వేంకటనాధ ఇత్యాదిగా ముద్రను ఉపయోగించగా, పెద తిరుమలయ్య ఒక దశలో 'వెంకట' ముద్రను, తరువాత ఆచార్యుని అనుమతితో 'అలమేల్మంగా సహిత వెంకటేశ్వర' ముద్రను ఉపయోగించగా, చిన తిరుమలయ్య 'శ్రీ వేంకటనాధ' అను ప్రత్యేక ముద్రను తన కీర్తనలలో ఉపయోగించాడు (చూ.రసమయి, అక్టోబరు, నవంబరు, 2005)

తాళ్లపాక పద కవిత్రయమని అన్నమయ్య, పెద తిరుమలయ్య చిన తిరుమలయ్యలను పేర్కొంటారు. మిగిలిన వారు పదములు వ్రాయలేదనే దృష్టితో! కాని నేడు ముద్రాభేదాల స్పష్టత తెలిసిన తరువాత శేషాచార్యుల వ్రాతప్రతిలోని ఒక కీర్తన (కరము జీడి పులుసు, సంకీ.13) నాలుగవ పదకర్తను సూచిస్తుంది. ఈ కీర్తన వేటూరి ప్రభాకర శాస్త్రి గారిచే పరిష్కరింపబడి అన్నమాచార్య జీవిత చరిత్ర పీఠికలో **1949** వ సం॥ లో అచ్చయింది. అప్పుడు వారు తమకు లభ్యమైన సమాచారం అనుసరించి దానిని చిన తిరుమలయ్య రచనగా పేర్కొన్నారు. (చూ. అన్నమాచార్య జీవిత చరిత్ర పు.6 మరియు పు.80) నేడుపలబ్ధమైన సమాచారం ప్రకారం చిన తిరుమలయ్య ముద్ర 'శ్రీ వేంకటనాధ' మాత్రమే! మరి "కరము జీడి పులుసు" పాటలోని ముద్ర "శ్రీ వెంకటప్ప". ఇది చిన తిరుమలయ్య ముద్ర కాదు. కాన ఈ పాట చిన తిరుమలయ్య రచన కాదు. పాటలో అన్నమయ్య, పెద

తిరుమలయ్యల మహిమలు వర్ణింపబడినవి. కాన వారిరువురూ తమ గొప్ప తనం గురించి తాము పాడుకునే అవకాశమే లేదు. ఈ సందర్భంలో తాళ్లపాక వంశానికి చెందిన ఆ నాల్గవ పదకర్త ఎవరు? చిన్నన్న కాబోలునని పరిశోధనాసారం తెలియజేస్తుంది. ఈ పరిశోధనాంశం పూర్తి వివరాల కోసం పరిశోధకులు డా॥ వేటూరి ఆనందమూర్తి గారి 'రసమయి' ప్రచురిత వ్యాసాలను చదువ ప్రార్ధన.

తాళ్లపాక శేషాచార్యుల ప్రతి యందు తాళ్లపాక పద కవులందరి పాటలుండటం మరో విశేషం!

ఇన్ని విధముల పరిశోధనాంశములతో, తాళ్లపాక వంశీయులచే పారంపర్యంగా వస్తూ వుండిన 'తాళ్లపాక సంకీర్తనలు' అవశ్యం అచ్చు కావల్సియున్నది. ఈ ప్రతి ఆధారమున బహుముఖముల పరిశోధన సాగవలసియున్నది. ఈ సందర్భమునకై ఈ వ్యాస రచయిత వేయి కళ్ళతో ఎదురు చూస్తూ, వేనామాల వెన్నుడుని వినయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాడు.

ఇక 'తాళ్లపాక సంకీర్తనలు'లోని కొన్ని మధురమైన కీర్తనల గురించి ఇప్పుడు చర్చిద్దాం!

శేషాచార్యుల వ్రాతప్రతిని తిరుపతిలో పరిశీలిస్తుండగా, ఈ వ్యాసకర్తను అమిత భక్తి భావంతో, అద్భుత భావ సంపదతో ఒళ్ళు పులకరింపజేసిన ఒక సంకీర్తన.

**వసంతభైరవి**

శంఖమా పోయి వత్తునా చక్రమా పోయి వత్తునా
లంకెలై నా రెండు భుజాల మీరు రండి ॥పల్లవి॥

నీడదిరుగని చింత నే పోయివత్తునా
తోడనీడవై నా తోడనె రమ్మీ
వు(?)డక పశిడి కంభమా వూరికి పోయి వత్తునా
యేడనున్న వరాలిత్తువు నీవు రమ్మీ ॥శంఖ॥

చక్కదనపుటంజన శైలమా పోయివత్తునా
నిక్కి నాకు నవనిధులిత్తువు రమ్మీ
యెక్కువనమృతంపు కోనేరి పోయివత్తునా
అక్కజపు మా జీవనమవుదువు రమ్మీ ॥శంఖ॥

ననచిన శ్రీవేంకటనాధుడా పోయివత్తునా
నా నెనరువాడవై వెంటనె నీవు రమ్మి
నను గన్న అలమేలుమంగ నాచారి పోయివత్తునా
వెనకముందర నీవు విజయమిత్తువు రమ్మి

(సంకీ.203, శేషా చార్యుల వ్రాతప్రతి, అపరిష్కృత పాఠం)

ముద్రను బట్టి అన్నమాచార్యుడో, చిన తిరుమలాచార్యుడో తిరుమల స్వామిని వీడి, వైష్ణవ మత, భక్తి ప్రచారార్థం మరో ఊరుకు వెళుతున్న సమయమది. తిరుమల లోని నీడ తిరుగని చింత చెట్టు మొదలుకొని, స్వామి పుష్కరిణి, పసిడి ధ్వజ స్తంభం, అంజనాద్రిలకు వీడ్కోలు చెప్పి, అలమేల్మంగా శ్రీ వేంకటేశ్వరుల వద్ద సెలవు తీసుకుంటున్నాడు కవి. ఈ కీర్తనలో విశేషమేమన మొదటి పాదంలో వీడ్కోలు, రెండవ పాదంలో ఆహ్వానం వుండటం! అందరికీ వెళ్లి వస్తానంటూ ఆత్మీయంగా వీడ్కొలు పలుకుతునే, శుభం కలుగ చేయటానికి వెంటనే మీరూ నాతో రండి అంటూ అంతే ఆత్మీయతతో ఆహ్వానిస్తున్నాడు కవి. అద్భుతమైన భావ సంపదకు ప్రతీక ఈ పాట! అంతే అద్భుతమైన రాగ సంపదతో మిళితమై తెలుగు నేల నాలుగు చెరగులా ఈ పాట పరివ్యాప్తం కావాలని కోరిక!

భర్తృహరి సుభాషిత సందేశాన్ని తలపింపచేసే ఒక కీర్తనను ఇప్పుడు చూద్దాం!

భూషణములవి యేటి భూషణములు
భూషణములెన్న నిజ భూషణము కాక ॥పల్లవి॥

దానమే భూషణము దనరు హస్తములకు
మానమే భూషణము మనుజులకును
పూనికతో శాంతమే భూషణము యోగికిని
మానినికి పతిభక్తి మంచి భూషణము ॥భూషణ॥

కమలాక్షు చూచుటె కన్నులకు భూషణము
.......సుగుణమె భూషణము సాధులకును
విమలమగు గురుభక్తి వెలలేని భూషణము
కమలములు జలములకు కడు భూషణములు ॥భూషణ॥

.....ట్టుకొని రాజులకు నీతియే భూషణము
గుట్టుతో తిరిగెటి కల భూషణములు
గట్టిగా యిపుడు వెంకటనాధు పాదములు

పట్టుటె భూషణము ప్రాణులకునెల్ల
(సంకీ. 150, శేషా చార్యుల వ్రాతప్రతి, అపరిష్కృత పాఠం)

యిట్టిదే మరొక సందేశపూరిత సంకీర్తన

## దేశాక్షి

చేతగాని పనులెల్ల జేసేది రోఁత
నీతిలేని వాని వద్ద నిలిచేది రోఁత ॥పల్లవి॥

తడువు పుట్టింటను తరుణినుంచిన రోఁత
అడుగరాని వాని అడిగేది రోఁత
.....ములో వలవని పొలఁతి పొందుట రోఁత
చెడి చుట్టము కడకు చేరేది రోఁత ॥చేత॥

అప్పుదీసి సౌఖ్యములనుభవించిన రోఁత
తప్పు విచారించ........చ్చేది రోఁత
ముప్పున చిన్న వయసు ముదిత జేకొన్న రోఁత
చెప్పరాని పనులెల్ల సేసేది రోఁత ॥చేత॥

కలవాని తోడను కలహించేది రోఁత
.......క్షుల పొందు నమ్మేది రోఁత
అలరు శ్రీ వేంకటేశుపతి గొలువని యట్టి
........నరుని జన్మము నెరయ రోఁత ॥చేత॥

(సంకీ. 164, శేషా చార్యుల వ్రాతప్రతి, అపరిష్కృత పాఠం)

కొమ్మ నీ పలుకులకు కుశలమస్తు! సమ్మదపు వయసు-కైశ్వర్యమస్తు (సంకీ.43) వంటి అద్భుత అభినయ ప్రధాన రచనలూ ఈ ప్రతి యందు కలవు.

## ఒక పెండ్లి కీర్తన

రారో దేవతలారా రంభాది సుదతులారా
పేరు గల యిందిరను పెండ్లాడె శౌరి ॥పల్లవి॥

పెక్కువ శేషాచలము పెండ్లిపీటగా జేశి
దిక్కులెల్లా ..........ముతేరగా జేసి

చుక్కలెల్లా తలబాలు సొరిది ముత్యాలు సేసి
బ(పి?)క్కటిల్ల హరి నేఁడు పెండ్లాడెనిదిగో ॥రారో॥

బాల సూర్య చందురుల బాసికముగా జేసి
పాల జలధి మధు పర్కము..........
......లుపు బ్రహ్మాండము పొంకపు చవికెగా జేసి
బలిటిక్యముల హరి పెండ్లాడెనిదిగో ॥రారో॥

గుంపుల పరుషవారి కూరిమి చుట్టములు
సొంపులో........శుభముగా జేసి
అంపలేకపురమున అలమేలుమంగతోను
పొంపుతో శ్రీ వేంకటేశు పెండ్లాడెనిదిగో ॥రారో॥

(సంకీ.110, శేషా చార్యుల వ్రాతప్రతి, అపరిష్కృత పాఠం)

అన్నమయ్యకు పూర్వం తాళ్లపాక వంశస్థులు స్మార్తులు, అద్వైతులు, కాని అన్నమయ్య నాటి నుండి వారు వైష్ణవం స్వీకరించి విశిష్టా ద్వైతులైరి. అందుచే వారి పాటలలో శివస్తుతి వుండక, చాలా పట్టుల అద్వైత ఖండన, దూషణలు కూడా కలవు. అయితే ఈ శేషా చార్యుల వ్రాతప్రతిలో లభించిన ఒక పాట హరిహర అభేదాన్ని తెలియజేస్తూ, ఆశ్చర్యం గొలుపుతున్న ఇది పెద తిరుమలయ్య రచనయనీ, ఆతడు హరి హర దేవాలయాలు నిర్మించినట్టు కైఫియ్యత్తుల ద్వారా తెలుస్తున్నదని డా॥ వేటూరి ఆనందమూర్తి గారి అభిప్రాయం. ఏది ఏమైతేనేం? శివుడైతేనేం? కేశవుడైతేనేం? బ్రహ్మమొక్కటే యని కదా అన్నమయ్య భావన! ఆ భావనతోనే హరిహరుల వీక్షిద్దాం! ఈ క్రింది సంకీర్తనలోని శబ్ద, భక్తి మాధుర్యంతో!

హరి యితండు హరుఁడతండు ఆకారమొక్కటే
హరి హరులందున అధికు లెవ్వరు లేరు ॥పల్లవి॥

నెరిగురులితనికి మరుజడ లతనికి
నురగపరపితనికి నురగము లతనికి
విరిగన్ను లితనికి చిచ్చుఱ గన్నతనికి
గరుడఁడీతనికి ఘనవృషభ మతనికి
హరిణాక్షి వినవె యిందధికు లెవ్వరు లేదు ॥హరి॥

శ్రీ తరుణి యితనికి శ్రీ గౌరి యతనికి
భూతలంబితనికి శీతనగ మతనికి

జాతిమణు లితనికి విషమణు లతనికి
రీతి గంధమితనికి భూతిపూత లతనికి ॥హరి॥

కరిభయహరుఁడితఁడు కరిముఖుని గురుఁడతఁడు
నరసింహుడితఁడర్ధ నారీశ్వరుండతఁడు
మురవైరి యీతఁడు పురహరుఁడతఁడు
పరగ శ్రీ వేంకటశైలపతి యీతఁడే అతఁడు
(సంకీ.227, శేషా చార్యుల వ్రాత్రప్రతి పరిష్కృత పాఠం,
పరిష్కర్త డా॥ వేటూరి ఆనందమూర్తి)

ఒక మంగళకరమైన కీర్తనతో పాటల చర్చను ముగిద్దాం!

**శంకరాభరణం త్రిపుట తాళం**

శృంగార శీలునకు మంగళం
సంగీతలోలునకు మంగళం ॥పల్లవి॥

కనకాంబరునకు కరుణాకరునకు
మనసిజగురునకు మంగళం
మునివరదాతకు మదనుజ జెతకును
మనుకులనేతకును మంగళం ॥శృంగా॥

విధినుత హరి విశ్వధారికిని
మధుసంహారికి మంగళం
బుధపోషునకును భోగిశేషునకు
మధుభాషునకును మంగళం ॥శృంగా॥

బహమత యతికిని మహిరమాపతికి
మహనీయ ధృతికి మంగళం
విహగవాహునకు శ్రీవేంకటరాయనికి
మహితదేహునకు మంగళం ॥శృంగా॥
(సంకీ.73, శేషా చార్యుల వ్రాతప్రతి, అపరిష్కృత పాఠం)

## తాళ్లపాక కవుల భవిష్యద్దర్శనం

తాళ్లపాక వాఙ్మయంపై జరిగిన పరిశోధన సంతృప్తికరమే అయినా భవిష్యత్తులో జరుగవలసిన దెంతో వుంది.

ఈ శతాబ్దంలో ఈ క్రింది విషయాలపై సమగ్ర పరిశోధన, పరిశీలన ఆవశ్యకం.

1. తాళపత్రాలలో, కాగితపు ప్రతులలో, మౌఖికంగా వున్న తాళ్లపాక వారి సారస్వత సేకరణ.

2. దాక్షిణాత్య తొలి వాగ్గేయకారుడు అన్నమయ్యను కర్ణాటక సంగీత పితామహుడుగా గుర్తించుట. ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు ఈ అంశాన్ని పలు సభల్లో ప్రస్తావించారు. దీనికి గల కారణాలు.

అ. కర్ణాటక సంగీత పితామహుడుగా మనం పిలిచే కన్నడ వాగ్గేయకారుడు పురందరదాసు తన బాల్యంలో వృద్ధుడైన అన్నమయ్యను కలిసి ఆశీస్సులు తీసుకున్నట్లు చిన్నన్న కృతమైన అన్నమాచార్య జీవిత చరిత్ర ద్వారా మనకు తెలుస్తుంది. చిన్నన్న ద్విపదలో

"పురందరదాసాహ్వయుండు
పరమ భాగవతుడై పరగుచు నంద
వర కులాగ్రణియై వైష్ణవోత్తముడు
తాళ్లపాక శాసనుఁ డన్నమయ్య
వెన్నునిగానె భావించి కీర్తించె"

అని పేర్కొంటాడు. అన్నమయ్య కీర్తనలచే బాల్యముననే ప్రభావితుడైనాడు పురందరదాసు.

ఆ. అన్నమయ్య పాటలు కేవల సాహితీ భావ ప్రధానాలే కాదు, సంగీత శాస్త్ర లక్ష్య లక్షణములను అనుసరించబడినవి.

## అన్నమయ్య సూళాది:

అన్నమయ్య రచించిన దేశి సూళాది రాగిరేకులలో లభ్యమైనది. సుబ్బరామ దీక్షితుల వారు 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'లో సూళాదులు కన్నడ వాగ్గేయకారులు మాత్రమే రచించినట్లు తెల్పినాడు. కాని వారికంటే ముందు గానే తెలుగు వాడైన మన అన్నమయ్య సప్తతాళ సప్తరాగ సూళాదిని సప్త గిరీశాంకింతంగా చెప్పాడు. తిరుమలలో లభ్యమైన స్వరసహిత శిలా శాసనంలోనూ తాళ్లపాక వారి సంస్కృత సూళాదులు లభ్యమైనాయి. ఇవి దశావతార సూళాదులు. పై తెల్పిన కారణములను ప్రాథమిక విషయములుగా గ్రహించి "అన్నమయ్య - కర్ణాటక సంగీతము -

పితామహుడెవరు?'' అన్ని అంశంపై పరిశోధన గావించవలె.

3. తాళ్లపాక వాఙ్మయం-కూచిపూడి నృత్యం.
అన్నమయ్య దేశి సూళాది అని గొప్పగా చెప్పుకుంటున్నామే కాని, దానికి తగినంత ప్రాచుర్యం మనం కల్పించలేదు. 1978లో శ్రీ యస్.ఆర్. జానకీ రామన్ గారు స్వరపరచి మద్రాసు మ్యూజిక్ అకాడమీకి సమర్పించారు. అది రికార్డులకే పరిమితమైనది. నేటికీ ఈ సూళాది స్వరరూపం సామాన్యులకు తెలియదు. నాయిక నాయకుడికి చెలికత్తెల ద్వారా సందేశాన్ని పంపుతున్న ఈ శృంగార సూళాదిని కూచిపూడి నృత్య శైలిలో తీర్చిదిద్ది ప్రచారం చేయవలె.
4. అన్నమయ్య పదకోశం
5. తాళ్లపాక వారి కీర్తనలన్నిటికీ బృహదకారాది విషయసూచిక.
6. తాళ్లపాక కవుల జీవిత చరిత్రలు సేకరించుట
7. తులనాత్మక అధ్యయనాలు

## అవశ్య కర్తవ్యం

తాళ్లపాక కవులు దూరదృష్టితో రాగిరేకులపై 'శాశ్వతనిధి' అందించిన 'పదసంపద' సైతం అజ్ఞానంతో, అశ్రద్ధతో కొంత పోగొట్టుకున్నాం! రాగిరేకులలోని పాటలన్నీ అచ్చయినా, తాళ్లపాక అరలో అయిదు వందల యేండ్లు అజ్ఞాతంగా వుండిన రాగిరేకుల వలె, అర్ధ శతాబ్ది (1956-2005) నుండి అజ్ఞాతంగా వుండిన శేషాచార్యుల వ్రాతప్రతిని అవశ్యం అచ్చు చేయించవలసిన బాధ్యత మన తెలుగు వారందరిదీ! ఇన్నేళ్ళు అశ్రద్ధ వహించిన మనం ఇక ఏ మాత్రం ఆలశ్యం చేయగూడదు. ఈ సందర్భంలో అముద్రితములైన "తాళ్లపాక సంకీర్తనలు'', ఒక పరిశోధనాత్మక పరిశీలన లో డా॥ వేటూరి ఆనందమూర్తి గారు ఉట్టంకించిన విషయములు స్మరణీయములు. "లభ్యములైన రేకులలోని తాళ్లపాక వారి పదాలన్నీ పరిష్కృతాలై 35 పాత సంపుటాలుగా పునర్ముద్రితాలు కావడానికి ఒక అర్ధ శతాబ్దికి పైగానే (1948-1999) పట్టింది. ఈ కార్యమంతా ముగిసి, ఇప్పటికి అయిదేళ్ళు దాటినా అలనాటి (1941) 'తాళ్లపాక సంకీర్తనలు' వ్రాతప్రతిని పరిశీలించి ప్రకటించే యత్నం మాత్రం జరుగలేదు. ఇది బాధ్యులైన వారి ఉపేక్షకు, అశ్రద్ధకు పరాకాష్ఠ, ఆ దేవబయకారులకు చేస్తున్న అపచారము''.

ఇకనైనా తెలుగుజాతి జాగృతమై "తాళ్లపాక శేషాచార్యుల వ్రాతప్రతి" అచ్చుకు సన్నద్ధం కాగలదనీ, ముందే చెప్పుకున్నట్లు కార్య, కారణములన్నిటికీ కర్తయైన శ్రీ వేంకటేశ్వరుడు తన అపార కరుణా దృష్టితో, ఆశీర్వాద బలంతో కార్యాన్ని సాఫల్యవంతం చేస్తాడని విశ్వసిస్తూ, అందుకు స్వామిని ప్రార్థిస్తూ "నిత్య నూతన చైతన్య స్రవంతి యైన తాళ్లపాక సంకీర్తనాధార నేల నాలుగు చెరగులా దేదీప్యమానంగా, జ్వాజ్వల్యమై ప్రకాశిస్తుందనీ తెలియ జేస్తూ, దానికి ఆధారమైన చిన తిరుమలయ్య వాక్కులను స్మరిస్తూ వ్యాసం ముగిస్తున్నాను.

"శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీధులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభ రతి క్రీడా రహస్యంబులై
నుతులై తాళులపాక యన్నయ వచో నూత్నక్రియల్ చెన్నగున్
( సంకీర్తన లక్షణం.12 )

శ్రీ వేంకటేశార్పణమస్తు

# భక్తరామదాసు సంకీర్తనలు - సామాజిక చైతన్యం

ఆచార్య కసిరెడ్డి

ప్రస్తావన:-

రామ రామయన్నరారాదు పాపంబు
రామ రామయన్నరాదు భయము
రామ రామయన్నరారాదు మృత్యువు
రామనామ మమృత రాశి యగును.

తెలంగాణాలోని పల్లెల్లో వినిపిస్తున్న ఈ పద్యం భక్త రామదాసు కాలం నుండే బహుళ ప్రచారంలోకి వచ్చింది. దీనికి కర్త ఎవరో? కాని వ్యవహర్తలు కోకొల్లలు. కర్త భద్రాచల రామాలయ నిర్మాత అనుకొంటే అదో తృప్తి.

**శ్రీ రామ నీ నామమేమి రుచిరా!**
**ఓ రామ నీ నామమేమి రుచిరా!**

అన్న రామదాసే ఆ పద్యాన్ని ఎక్కడో ఆశువుగ అని ఉంటాడు. రామ రామయని నోట, రామ రామ నీవే గతి గద, రామరామ శ్రీరామా రామా, అంతా రామమయం, అబ్బబ్బా రామ నామమది, ఏమిరారామ, కోదండ రామ కోదండ రామ, దశరథ రామా గోవిందా, పాహిమాం శ్రీ రామ యంటే, పాహి రామ ప్రభోపాహి రామ ప్రభో, భజ రే మానస రామ, రామచంద్రనన్నేలు, రామ నామము బల్కనే, రామనామమే జీవనము, రామప్రభో నీదయ, రామరామ సీతారామ, రామసుధాంబుధిరామ, రామహో సీతారామహో, రామాదైవశిఖామణి, రామా నను బ్రోవగరాదా, రామా నీ చేతేమీ కాదుగా, రామా ముద్దు మోము, రామచంద్రుడు నాపై, రామ జోగి మందుకొనరే, రామ దయజూడవే, రామా నామనవి చేకొనుమా, రాముడే గలడు నాపాలి, రాముని వారమైనాము, రాముని వారము మాకేమి, రావయ్యా భద్రాచల రామ, వందే రఘురామా, శ్రీ రామ నామం మరువాం మరువాం, శ్రీరామ నామమేజిహ్వకు, శ్రీరాముల దివ్యనామస్మరణ, సీతారామ స్వామి....."

ఇలా కీర్తన ప్రారంభంలో రామనామం ఉన్నవి వందలున్నాయి. రామ నామం అమృతం అన్న భావాలున్నవీ ఉన్నాయి. దాశరథీశతకంలోనూ రామనామాన్ని అమృతంతో పోల్చడమున్నది. పాప-భయ-మృత్యువులు దూరం కావడానికి రామనామమే శరణ్యమన్న భావాలున్న సంకీర్తనలూ - పద్యాలు లెక్కకు మిక్కిలే కనిపిస్తున్నాయి. పాపానికి దూరంగా ఉండడం వల్ల, పుణ్యానికి దగ్గరగా ఉండడం వల్ల, వ్యక్తిలో శాంతి, కుటుంబంలో సుఖసంతోషాలు, సమాజంలో సంక్షేమం నెలకొంటుంది. ఈ సంక్షేమం నెలకొనాలంటే సామాజిక చైతన్యం అవసరం. మరి అటువంటి చైతన్యం నిర్మాణంలో రామదాసు సంకీర్తనల యోగదానం గూర్చి స్థాలీ పులాకంగా చర్చించడమే ఈ వ్యాసం పరమోద్దేశం.

## రామదాసుకాలం- పరిస్థితులు

1620-1680 రామదాసుకాలం. అసలు పేరు కంచర్లగోపన్న. రామాలయ పునరుద్ధరణం, రామభక్తి సాహిత్యసృష్టి భద్రగిరి రాముని సన్నిధికి వంశపారం పర్య ప్రప్రథమ పూజారిగా చేరడం-వీటన్నిటి కారణంగా భక్తరామదాసుగా ప్రసిద్ధులయ్యారు.

ఖమ్మం జిల్లా నేలకొండ పల్లె గ్రామం రామదాసు స్వస్థలం. తల్లిదండ్రులు లింగన్న కామాంబలు. మేనమామల్లో అక్కన్న సేనాధిపతిగా, మాదన్న మహామంత్రిగా గోలకొండ చివరి కుతుబుషాహీ వంశ పరిపాలకుడు అబుల్ హసన్ తానీషా ఆస్థానంలో ఉన్నారు. తానీషా వల్లనో, మంత్రి సేనాధిపతుల వల్లనో గోపన్నకు తహసిల్దార్ ఉద్యోగం లభించింది. అది తానీషా కొలువు కూటంలోని ఎందరికో కంటగింపయింది.

నిజానికి ఈ భూభాగాన్ని తొలుత శాతవాహనులు, తర్వాత చాళుక్యులు, ఆ తర్వాత కాకతీయులు పరిపాలించారు. ఆ తర్వాతనే బహమనీల చేతుల్లోకి కుతుబుషాహీల చేతుల్లోకి ఈ నేల వెళ్లింది. కాకతీయులు కట్టించిన ఎన్నో దేవాలయాలు ఆధ్యాత్మిక వికాసానికి, చెఱువులు వ్యావసాయిక సంపదల అభివృద్ధికి మూల స్తంభాలుగా నిలిచాయి. వాటిలో కొన్నిటిని కుతుబుషాహీలు పునరుద్ధరించారు.

అయితే కరవు కాటకాలు వచ్చి పంటలు పండకున్నా పన్నులు వసూలు చేయడం, గ్రామ గ్రామాల్లోని భూములను, చెఱువులను, గుట్టలను, అరణ్యాలను గుర్తించడం, వాటి మీద పన్ను వసూలు చేయడం, గ్రామాల్ని వ్యవస్థీ కృతం చేయడం, సరిహద్దులు నిర్మించడం తదితర పరిపాలనా సంబంధి శాస్త్రాన్ని నిర్మించి దానిని యోజనాబద్ధంగా అమలులోకి తెచ్చిన వారు అఖండ మేధా సంపన్నులు మహామంత్రి మాదన్నగారు.

ఒక విధంగా రాజ్యం సుభిక్షంగానే ఉంది. ప్రభుత్వ పన్నులు వసూలవుతూనే ఉన్నాయి. కాని హఠాత్తుగా కరవు వచ్చింది. ప్రజలు తల్లడిల్లి పోయారు. కొండ కోనల్లో బ్రతికే వనవాసీ బంధువులు ఆకలితో అల్లాడుతూ ఆకులలాలు, కాయ కసరులూ తింటూ కాలం గడుపుతున్నారు.

## పరిస్థితులు-కింకర్తవ్యం?

వానలు పడి చేలు పచ్చగా ఉండి, పంట చేతికి వచ్చినప్పుడు మాత్రమే వ్యవసాయదారులు పన్ను కట్టగలుగుతారు? పస్తులుండే వాళ్లు పన్నులేం కట్టగలుగుతారు!

సంస్కృతాంధ్రాలు క్షుణ్ణంగా చదువుకొని, భాగవత ధర్మాన్ని, రామాయణ ధర్మకర్మల్ని జీర్ణించుకొన్న తహసిల్దారు గోపన్న దయార్ద్ర హృదయం పన్నులు వసూలు చేయడం తప్పని చెప్పింది. (ఇదికర్ణాకర్ణిగా విన్నది మాత్రమే. ఎక్కడైనా ముద్రితమై ఉందో లేదో తెలియదు)

భద్రాచల దేవాలయం శిథిలమై ఉంది. గాలిదుమారంతో గోడలులేని ఆలయ ప్రాంగణమంతా చెత్తా చెదారం పేరుకొనిపోయి ఉంది. దేవుని గుడి ఇలా ఉంటే దేవుడెందుకు వానలు కురిపిస్తాడు. గిరి జనులైన కొండ రెడ్లు తదితరులందరూ తమ ఆవేదన ఈ విధంగానే మొరపెట్టుకొన్నారు. వారి కష్టాలు కడగండ్లూ-వేదనలు గోపన్నను కదలించాయి.

ఏ యింటికి వెళ్లినా పన్నులు లేవు; కన్నీళ్లు మాత్రమే ఉన్నాయి. వర్షాలు బాగా పడితే పంటలు పండుతాయి; పంటలు పండితే పన్నులు కడతారు.

రామదాసుగా పరిణతి చెందుతోన్న గోపన్న భద్రాద్రి రామునికి మొక్కుకొన్నాడు. వర్షాలు కురిపిస్తే గుడికడతానన్నాడు. దేవుడు దయ దలిచాడు. వర్షాలు బ్రహ్మాండంగా కురిశాయి.

మూడు సం॥ల కరవు పోయింది. పొలాలు పచ్చగా కళకళలాడుతున్నాయి. వనవాసీలందరూ గోపన్న ప్రేరణతో భద్రగిరిని శుభ్రంచేశారు. ఆలయ ప్రాంగణాన్ని అందంగా తీర్చిదిద్దారు. కూలిన-పగుళ్లు వట్టిన ఆలయకుడ్యాలనూ, పైకప్పును పునర్నిర్మించాల్సిందే అని దీక్ష బూనారు.

ప్రజలు పన్నులు కడుతున్నారు-భద్రాచల రామదాసు శ్రీరామచంద్రుణ్ణి గూర్చి తానది వరకు ప్రార్థించిన శ్లోకాలను మననంచేసి కొన్నాడు.

శ్లో ॥ శ్రీరామచంద్ర కరుణాకర దీనబంధో!
సీతాసమేత భరతాగ్రజ రాఘవేశ!
పాపార్తి భంజన భయాతుర దీనబంధో!
పాపాంబుధీపతిత ముద్ధర మాం అనాథమ్ ॥

శ్లో ॥ వందేరామం అనాది పురుషం అజం వందే రమానాయకం
వందే హార కిరీట కుండలధరం వందేంద్ర నీలద్యుతిమ్।
వందేచాపక అంబకోజ్జ్వలకరం వందే జగన్మంగళం
వందే పంక్తి రథాత్మజం మమగురుం వందే సదారాఘవమ్ ॥

ఒకటి రెండూ కావు! ఎన్నో ప్రార్థనా శ్లోకాలు; ఆ నివేదన రామయతండ్రికి నచ్చింది. అందుకే వర్షాలు కురిశాయి. ఇది ప్రజలందరినమ్మకం; రామదాసు నమ్మకం నివేదన రామయతండ్రికి నచ్చింది. అందుకే వర్షాలు కురిశాయి. ఇది ప్రజలందరి నమ్మకం; రామదాసు నమ్మకం. పన్నులు వసూలయ్యాయి. ఆరు నెల్లల్లో ఆలయం దివ్యంగా భవ్యంగా నిర్మాణమయింది.

వసూలయిన పన్ను కూలీ రూపంలో మళ్లీ వనవాసీలకు శిల్పులకు అందింది. ఆ విధంగా ప్రజాధనం ప్రజలకేచేరింది. ప్రభువైనా వసూలైన పన్నుతో ప్రజల సంక్షేమమేకదా చేయవలసినది. రాముని ప్రేరణతో రామదాసు చేశాడు; ఇక రాజు తానీషా అంగీకరించక ఏంచేస్తాడు.

## విపరీత పరిణామాలు

రాజు తానీషా కీవార్త చేరింది. గోపన్న-ఉరఫ్ రామదాసు మంచి పనే చేశాడనుకొన్నాడు పాదుషా. కాని మంత్రులు చెవులు కొరికారు. వారు అక్కన్న మాదన్న మీది అక్కసు గోపన్న మీద తీర్చుకోదలిచారు. పన్ను ఖజానాలో కట్టక పోవడం రాజధిక్కారమన్నారు. పైగా ఆ డబ్బుతో రాములగుడి కట్టడం పాదుషాకే సవాల్ విసరడం అన్నారు. ఒకటికి రెండు సార్లు పది సార్లు చెవి నిల్లు గట్టుకొని పోరారు.

అంతే పాదుషాగారు రామదాసుకో బులావ్ అన్నారు; వర్తమానం వెళ్లింది. రామదాసు రాముని సేవలో ఉన్నాడు. ఇది అవిధేయత అని వజీర్లూ-జాగీర్దార్లు గుసగుసలు పోయారు. రాజుకు సెగ పెట్టారు. తానీషా ఆగ్రహోదగ్రుడయ్యాడు. భటులను పురమాయించాడు. గోపన్నను ఉన్న పళాన ఈడ్చుకొని రమ్మన్నాడు. గోపన్న రామదాసై పోయాడు. రామభక్తిలో లీనమైపోయాడు. కీర్తనలు పాడుకొంటున్నాడు.

హరిజనులు, గిరిజనులు, పురజనులు, అందరూ ఆసంకీర్తనా మహా ప్రపంచంలో తేలిపోతున్నారు. "పాహి రామ ప్రభో! పాహి రామ ప్రభో!" - అంటూ 246 చరణాల పాటను తన్మయంతో పాడుకొంటున్నారు.

అప్పుడు భటులు వచ్చి పట్టుకొన్నారు. పాదుషా ఆజ్ఞ అన్నారు; అక్కన్న మాదన్నల హుకుం అన్నారు. ఈడ్చుకొని వెళ్లారు. అంత వరకు ప్రజలు తానీషాను అయోధ్య రాజని పిలుచుకొనేవారు. అప్పటి నుండి అయోమయం రాజని పిలుస్తున్నారు. ఎఱ్ఱటెండన నాగసర్పం నీడన నిద్రస్తున్న బాలుణ్ణి తేగా అతనే తానీషా పాదుషా అయ్యాడని కట్టుకొన్న వన్నీ కట్టుకథలే అని నిర్ధారించుకొన్నారు. రామదాసును కోవెలకు మళ్లీ ఎలా తేవాలా అని ఆలోచించడం ప్రారంభించారు.

పన్నుగా వచ్చిన ఆరు లక్షల రూపాయలు ఆపన్న శరణ్యుని ఆలయం నిర్మించినందుకు రామదాసు కారాగారం పాలయ్యాడు. ఏళ్లూ-పూళ్లూ జైలులో తప్పదనుకొన్నారు. రాజు చింతిస్తున్నారు; అక్కన్నమాదన్నలు అతలాకుతలమవు తున్నారు. ప్రజలు పరితపిస్తున్నారు. రామదాసు మాత్రం రాగాలాపనతో రాముణ్ణి ఎత్తిపాడుస్తున్నాడు. గోలకొండ శిలలు ద్రవిస్తున్నాయి.

**శుభ పరిణామాలు**

గోలకొండ చెఱసాల నుండి శ్రీరామదాసు విడుదల విషయంలో, చరిత్ర నమ్మకపోయినా, ఎవరూ నమ్మినా నమ్మకపోయినా నాలుగు ఐతిహ్యాలు చోటు చేసుకొన్నాయి.

1. రాళ్లల్లో రాముణ్ణి చూస్తూ, చెఱసాలనే సంకీర్తనాశాలగా పరిణమింప జేసికొన్న రామదాసు రాగానికి లక్ష్మణ సహితుడై రాముడే దిగి వచ్చాడు. అందాల రాముడు- ఇందీవర శ్యాముడు తానీషాకు స్వప్నంలో సాక్షాత్కరించాడు. ఆ రాముడు కేవల రామదాసు మొరే వినలేదు, ఆయన తల్లిదండ్రుల 'ఆర్తి' కూడా విన్నాడు. ఆ ఘట్టాన్నే రామదాసు ఓ కీర్తనలో తర్వాత చెప్పాడు.

**సర్కారు పైకము తృణముగ నెంచుమీ రామచంద్రా! ఈ**
**దెప్పరమునఁగాచి యప్పు దీర్చుమయ్య రామచంద్రా॥**

అని మొదట పాడుకొన్న రామదాసు పైకం రామలక్ష్మణులిచ్చిన దృశ్యాన్నీ వర్ణించాడు. ఎవరిజవానులు మీరని తానీషా అడగ్గా, తాము రామదాస-జవానుల మని అన్న రామలక్ష్మణులతో "ఆరు లక్షలు తెచ్చినారా" అని ప్రశ్నించాడు తానీషా అప్పుడు రామలక్ష్మణులిలా అన్నారు.

- ఇదిగో నండి పైకము చూడండి!

1. దివిటీలూ వేయించండి - తివాసులు పఱిపించండి
రవాణకనము కన్నుల(జూచీ - రసీదు మాకు వ్రాసివ్వండీ! ॥ఇదిగో॥

2. పంద్రెండేండ్లాయె మీరు-బంది ఖానాలోన నుంచి
పాపమనక రామదాసుని - బాధింపు చున్నారుచాల ॥ఇదిగో॥

పాలనలేని దొరతనమట-పాలించారుమీరిచ్చట
చెల్లీ చెల్లములుంటే ప్రొద్దున-చెల్లగట్టి పొయ్యేముగాని ॥ఇదిగో॥

రామదాసుని తల్లిదండ్రులు-రయమున తనయుని గనుగొనితెమ్మన
క్షేమ మరసి పోవగవస్తిమి - క్షణమాలస్యము సేయ(జాలము."

(శ్రీ భద్రాచల రామదాసు మధుర కీర్తనలు - పు.20)

ఈ విధంగా రామలక్ష్మణులు పైకం చెల్లించారని, ఆ తర్వాత తానీషా తనను వదలి పెట్టాడని రామదాసే తన సంకీర్తనలో చెప్పాడు. ఇది మొదటి ఐతిహ్యం. దీనికి రామదాసు పాట ఆధారం. ప్రజల నోళ్లలో నానుతున్న మౌఖిక సాంప్రదాయిక కథ ఆధారం.

2. ఇక రెండవది సరిగ్గా అదే కాలంలోని మహారాష్ట్రలో ఛత్రపతి శివాజీ బ్రహ్మాండంగా వెలుగుతున్నాడు. ఆ ప్రభువు శ్రీశైల దర్శనార్థం బయలు దేరాడు. గోలకొండ మీదుగా రావలసినదని తానీషా ఆహ్వానించాడు.

శివాజీ బయలు దేరాడు. ఆ ప్రభువు ఏయేరాత్రులు ఎక్కడెక్కడ విడిది చేశాడో, అక్కడక్కడల్లా శివాలయాలు భవానీ మందిరాలు వెలిశాయి. శివాజీ గోలకొండలో విడిది చేశాడు. ఆ రోజు రాత్రి రాళ్ల కఱిగించే రామదాసు రాగాలు కొండల గుండెల్ని పిండి చేస్తున్నాయన్నట్టుగా శివాజీకి వినిపించాయి. అంతా రామమయం అనుకొన్నాడు. తనకు సపర్యలు చేయడానికి ఉన్న పరిచారికల నడిగి విషయం తెలుసుకొన్నాడు.

ఆ మరుసటిరోజు లక్షల విలవ చేసే తన మెడలోని హారం తీసి తానీషాకు కానుకగా సమర్పించాడు. ఇది కానుక కాదు; హిందూ పదపాదుషాహి ఛత్రపతి శివాజీ ఒక రామభక్తుణ్ణి గోలకొండ నుండి భద్రం కొండకు పంపించ వలసినదని కోరుకొంటున్నాడు అన్నాడు. తానీషా గడగడ వణకి పోయాడు. హారం స్పృశించలేదు; కాని శివాజీ ఇచ్చింది వెనక్కి తీసికోలేదు. ఆ ప్రభువు శ్రీశైలాభిముఖుడై వెళ్లిపోయాడు.

అంతే! రామదాసు విడుదలయ్యాడు. రాచమర్యాదలు జరుగుతున్నా ఆయనకు అంతటా రాముడే కనిపిస్తున్నాడు. తానీషా ఆయననూ ఆయన వంశాన్ని శాశ్వత కాలవు పురోహితులుగా ప్రకటించాడు. రామదాసు అన్నిటికీ అతీతుడయ్యాడు. రోమరోమంలో రామనామమే.

3. ఇక మూడవ ఐతిహ్యం. ఎంత మంది వజీర్ల మాటవిన్నా, గోపన్న చెఱసాలలో ఉన్నా, తానీషా మనస్సు వెన్న అన్నది అక్కన్న మాదన్నలకు తెలుసు. ఆయన పలవరిస్తున్నది ఆయన ఆంతరంగిక సచివులకు తెలుసు. వారికి గోలకొండ రహస్యాలన్నీ తెలుసు. రాజుకు కూడా తెలియని ఆయన శయనా గారం రహస్య ద్వారం తెలుసు.

అంతే! మధ్యరాత్రి; అక్కన్న మాదన్నలు చేతుల్లో రూకల మూటలతో, రామలక్ష్మణుల ఆకృతులతో తానీషా మంచం ప్రక్కన నిలుచున్నారు. తానీషా చేతులు జోడించాడు. ఏం మాటాడో తెలియదు. వారే మన్నారో తెలియదు. ఒక దివ్య స్పర్శకులోనైన అనుభూతి మిగిలింది. రామదాసు విడుదల ఫర్మానా కాగితం మీద సంతకం చేశాడు.

రామలక్ష్మణుల చేతుల్లో ఫర్మానా కాగితం; తన చేతుల్లో రూకల మూటలు. ఆ మరుసటి రోజు రామదాసును రామ లక్ష్మణులు విడిపించుకొని పోయారనే వదంతి వ్యాపించింది. రామ లక్ష్మణుల స్పర్శతో ధన్యుడైన ఆ తానీషాను అప్పటి నుండి ప్రజలు అయోధ్య ప్రభువని పిలవడం ప్రారంభించారు. (పాతిక సంవత్సరాల క్రితం 1980 ప్రాంతంలో జాగృతి వారపత్రికలో ఈ విషయాన్ని ఐతిహ్యకథగా రచించినవారు శ్రీహరీత)

**4.** ఇక నలుగురు నమ్మిన, నలుగురిని నమ్మించిన నాల్గవ ఐతిహ్యాన్ని పరామర్శిద్దాం. భద్రాద్రి ఆలయ నిర్మాత తమ గురువు తమదైవం తమకన్నీను అయిన రామదాసు రాజు కారాగారంలో ఉన్నాడు. కొండ రైతులు, వనవాసీలు అందరి ఆలోచన ఇదే. అందులో రాముడూ లక్ష్మణుడూ అనే అన్నదమ్ములున్నారు. వారిరువురు కొంత ధనాన్ని సమకూర్చారు. తాము తిండికి ఉంచుకొన్న ధాన్యాన్ని కూడా అమ్మారు. వీరికి మరి కొంతమంది వనవాసీ బంధువులు సహకరించారు. ఆధనంతో రామలక్ష్మణులు పాదుషాను ఏకాంతంలో సందర్శించారు. పన్ను ధనం తీసికొని రామదాసును వదలి పెట్ట వలసిందని అడిగారు. మీకింత ధనమెక్కడిది అని పాదుషా అడిగాడు. రామదాసును విడిపించ వలసిందని ఆ రాముడే ఇచ్చాడన్నారు. తానీషా అనుకొన్నాడు; "సీతారాములకు ఆభరణాలు చేయిస్తే

అంతకు మించి సహాయం చేస్తున్నాడు; తానుకూడా రామటెంకీలు (రాముని పేరిట నాణాలు) చేయించి సమర్పించాలి. సీతారామకల్యాణానికి ముత్యాలు తలంబ్రాలుగా పంపించాలి....'' ఇలా ఆలోచించి రామదాసును బంధ విముక్తునిగా చేశాడు. తన ఆలోచనలను అమలు పరిచాడు.

## సమాజం-సంకీర్తనలు

ఈ పరిస్థితులలో రామదాసు సంకీర్తనలు వచ్చాయి. వ్యక్తి, కుటుంబం, సమాజం, దేశం ఇవన్నీ రామదాసు దృష్టిలో ఉన్నాయి. అందరిలో రాముడుంటే ఈ అన్యాయాలు జరుగవనిపించింది. తననూ ప్రజలనూ కాపాడవలసిందని రాముణ్ణి వేడుకొన్నాడు. ఆలయ నిర్మాణ మప్పుడు వేడుకొన్నాడు; కారాగారంలో వేడుకొన్నాడు; విముక్తి తర్వాత భద్రాచలంలో రాముని సన్నిధిని ఉంటూ వేడుకొన్నాడు.

ఈ వేడుకోడం ప్రజలందరువిన్నారు. అవన్నీ భజనగీతాలుగా ప్రజలు పాడుకొన్నారు. రామదాసేమో వాగ్గేయకారుడయ్యాడు; అవి పదకవితలు, పద్యకవితలు అన్నిట్లోను రాముడే. ఆయన దర్వులు ఆయనవి. పల్లవి, చరణం, పాట, గేయం, గీతం, కీర్తన, సంకీర్తనలు అన్నీ జనంలోకి వెళ్లాయి. వాటికి కీర్తనలనీ, పాటలనీ ఎవరే పేరు పెట్టుకొన్నా పాడుకోవడమే ప్రధానం. నలుగురు కలిస్తే భజన చేయడమే.

తాను పాడుకొన్న పాటల ద్వారా రామదాసు రక్షింపబడ్డాడు. 'దుర్బలస్యబలం రాజా' అన్న సూక్తి ఉంది. బలహీనునికి రాజే రక్ష. కాని రాజే భక్షకుడైతే. రామదాసు జీవితం అందించే సందేశం సామాన్యునికి క్షేమంకలుగాలనే.

వర్షాలు పడలేదు; పన్నులు వసూలు చేయలేదు. ఇది ప్రజా సంక్షేమం నిమిత్తం చేసిందే. శిథిల దేవాలయం పునర్నిర్మాణ దృష్టి రాజుకులేదు. ప్రజాధనంతో రామదాసే నిర్మించారు. ఇదీ ప్రజా సంక్షేమమే.

భక్తి వాదం గానీ, రసం గానీ, భావం గానీ, ప్రేమమయమైన దివ్యమూర్తిమత్వం గానీ అది అందరినీ సమానంగా చూడుమంటుంది. ఒకే మతాన్ని పాటించే మత బోధకుల కన్నా అతీతమైంది భక్తి. స్వస్వరూపాను సంధానమే భక్తి. సేవ చేసి భగవంతుణ్ణి పొందడమే భక్తి. పూజాదుల అనురాగమేభక్తి. భగవత్కా ధాను రాగమేభక్తి. భగవంతునిపై శ్రేష్ఠ ప్రేమరూపమేభక్తి. స్వాత్మతత్త్వాను సంధానమే భక్తి. జ్ఞాన కర్మ రూపావరణాలను తొలగించి అనన్య కాంక్షా రూపంగా భగవదను భూతి పొందడమే భక్తి. పరాశరుడు, గర్గుడు, నారదుడు, ఆది శంకరులు, రూపగోస్వామి తదితర దార్శనికుల నిర్వచనాలివి.

భక్తి ద్వారా మానవుడు మాధవునిగా మారాలి. కర్మ జ్ఞానాది అంశాలకతీతంగా అందరిలో ఆదైవాన్నే చూడాలి. తనలోనే ఆ దివ్యత్వం ఉందని భావించాలి. అప్పుడే మనిషీ ఆనందమూర్తి అవుతాడు. ఆ మూర్తి మత్వ నిర్మాణానికే రామదాసు తపన చెందాడు. అందుకే ఆయన సంకీర్తనల్లో విరాట్రూప సమాజం కనిపించింది.

## సామాజిక చైతన్యం

మనది వ్యక్తి కేంద్రీ కృత సమాజం. వ్యక్తి సంస్కార వంతుడైతే కుటుంబం సమాజం వికాసశీలదిశలో నడుస్తుంది. వ్యక్తిలో పేరుకొన్న వికృతులను దూరం చేయాలి. సాంస్కృతిక మానవుణ్ణి నిర్మించాలి. అప్పుడు సమాజ సంస్కృతీ సంపన్న అవుతుంది. ఇది భక్తి ద్వారానే సాధ్యమవుతుంది. భక్తి ఎక్కువ తక్కువలు లేని సమాజాన్ని నిర్మిస్తుంది. భక్తి అంటే మతం కాదు. భక్తి సామాజిక సమానత్వాన్ని సాధిస్తుంది. దశావతారాలు సామాజిక సమానత్వం నిమిత్తం, ధర్మరక్షణ నిమిత్తమే పురాణాల్లో ప్రవచింపబడ్డాయి. సామాజిక న్యాయాన్ని నిర్మించాయి. ధర్మవీర ప్రదర్శనతో దుష్ట శిక్షణ శిష్టరక్షణ చేశాయి. ఈ దృష్టితోను, లౌకిక దృష్టితోను భక్త రామదాసు సంకీర్తనలు పరిశీలించ వలసి ఉంది.

### 1. పరులనుహింసించరాదు:-

"శ్రీరాముల దివ్య నామ స్మరణ - సేయుచున్న జాలు" అనే సంకీర్తనలో పరమ ధర్మం గుఱించిన బోధ ఉంది.

**పరులహింస సేయకున్న - పరమధర్మమంతేచాలు**
**పరులరక్షింతునని - పలుక నేటికే మనసా॥**

అహింసా పరమోధర్మః అన్న సూక్తే పై సంకీర్తనా ఖండిక. హింసలేని సమాజం నిర్మాణం కావాలి. శారీరక మానసిక హింసలుండరాదు. స్త్రీ బాల వృద్ధుల్ని హింసించరాదు. పటేళ్లు, రెడ్లు, దొరలు జీతగాళ్లను దూషించరాదు; హింసించరాదు. గృహ హింస అవసరంలేదు. ఉన్నవాడు లేని వానిని హింసించరాదు.

పని చేయండి! పరమాత్ముని నామ స్మరణ చేయండి! ఘోర తపస్సులు కూడా చేయాల్సిన అవసరంలేదు. పరులను హింసించ రాదు. "దొరకొని పరుల మనసు దోచుకొన్న నంతే జాలు" - అంటారు భక్త రామదాసు. ఇదే సంకీర్తనలో మరో విషయం చూద్దాం.

## 2) దీనజనపక్షం వహించాలి:-

నాడైనా నేడైనా రేపైనా అధికారశక్తి సామాన్యజనపక్షంలోనే నిలవాలి. అలనాడు రంతి దేవుడిదే మాట అన్నాడు. అన్నీ దానం చేసిన రంతి దేవుణ్ణి ఆ దివ్య శక్తి ఏం కావాలో కోరుకొమ్మంది. అప్పుడాయన ఇలా కోరుకొన్నాడు.

**శ్లో॥ నత్వహం కామయేరాజ్యం-నస్వర్గంనపునర్భవమ్।**
**కామయే దుఃఖ తప్తానాం- ప్రాణినా మార్తి నాశనమ్ ॥**

(సంస్కృత భాగవతమ్)

నాకు రాజ్యం అక్కరలేదు; స్వర్గంవద్దు; పునర్జన్మా వద్దు దుఃఖతప్తులైన ప్రాణుల కష్టాల్ని దూరం చేసేశక్తి నాకు కావాలి. పరమ భాగవతోత్తముడైన భక్త రామదాసు పరమాత్ముని పక్షం వహించేకన్నా పరమ దీన జనపక్షం వహించడం మిన్న అన్నారు.

**"పరగ దీన జనులయందు-పక్షముంచితే చాలు**
**పరమాత్ముని యందు ప్రీతి- పట్టనేటికే మనసా ॥"**

రామదాసు దీన జనపక్షపాతి. ఆ దీనజనులలోనే రాముణ్ణి దర్శించాలనే సందేశమిచ్చిన భక్తాగ్రగణ్యుడు. సామాన్య మానవుని హితాన్ని ఆపేక్షించిన వాగ్గేయకారుడు.

## 3. ఆకలిగొన్న వారికి అన్నం పెట్టండి:-

చీనీ చీనాంబరాలు, నగలూ, నట్రా ఎన్ని ఉన్నా ఫలం లేదు. అధికారం ఉండవచ్చు; పాండిత్యం ఉండవచ్చు; పది మందిలో ఏదో విధంగా కీర్తి ప్రతిష్ఠలు పొందవచ్చు. ఇవియేవీ నిలిచేవికావు. ఆధునిక దార్శనికులు స్వామి వివేకానందులు ఈ లోకంలోకి వచ్చినందుకు విద్యాదానం, శ్రమదానం, సేవాదానం, అన్నదానం అనే ఈ నాల్గింటిని కొనసాగించాలని అన్నారు. వేమన్న 'అన్ని దానములకు అన్నదానమెమిన్న' అన్నారు. మరి, పై సంకీర్తనలోని గోపన్న చరణం చూడండి!

**"అతిథి వచ్చి ఆకలన్న-అన్నమిడినదేచాలు**
**క్రతువు సేయవలెననెడి-కాంక్షలేటికే మనసా॥"**

యజ్ఞయగాదులు తదితర కర్మకాండలు కొనసాగించే కన్నా అతిథికి అన్నం పెట్టడం ఉత్తమం; అందులో ఆకలిగొన్న అతిథికి. కూడూ-గూడూ-గుడ్డ ఏ సమాజంలో, ఏ దేశంలో అందరికీ అందుబాటులో ఉంటాయో ఆ సమాజం ఆ

దేశం దివ్యమైంది. అన్నానికి నకనకలాడే ప్రజలుండాలని ఎవరూ అనుకోరు. ఆకలికి అలమటించని సమాజం కావాలి. ఆకలితో ఎవరైనా ఉన్నారంటే వారు మా అతిథి అనిపిలుచుకొనే వ్యక్తులున్న సమాజం నిర్మించుకోవాలి. రామదాసు రాగాల్లోని అనురాగమిదే.

## 4. ఆత్మనివేదనలో అనంతలోకాల సంక్షేమం:-

ఆ దేవ దేవునికి పతితపావన, పతితపాలన అనే బిరుదులున్నాయి. నేను కష్టాల్లో ఉన్నాను; ఆ బిరుదులు సార్థకం చేసికో! ఆ బిరుదులు ఇతరులనాదుకోవడం వల్ల వచ్చాయి. ఎవరేమి అన్నా నన్నూ, నాలాంటి వారిని ఆదుకో! కష్టాలు కడగళ్లు కన్నీళ్లు తొలగించు.

" అడుగుదాటి కదలనియ్యను-నా
కభయమివ్వక నిన్ను విడువను
గడియా గడియకు తిరిగితిరిగి
అడిగితిని వేసరిల వచ్చెను
గడువు దప్పిన వేనునిక బహు
దుడుకు తనముల సేయుదును విను ॥అడుగు॥"

..................................................

" పతితపాలన బిరుదు లేదా-నన్ను
పరిపాలన సేయరాదా!
ప్రతి దినంబున దేవతలు-భూ
పతివటంచును వేడినను-నీ
హితవు జనములు వచ్చి- నన్ను
వేడికొనినను విడువ నిన్ను ॥అడుగు॥"

-భూమి నెర్రెలు దెఱచినా, చెట్లు ఎండినా, గోడలు పగిలినా, రాని దుఃఖం సమర్థుడు చేతులు ముడుచుకొన్నప్పుడు వస్తుంది అంటారు స్వామి రామలింగయ్యర్. సర్వజ్ఞుడూ - సమర్థుడైన పరమాత్మ దీన జన బంధువు. అటువంటి వాడిని భక్తకవి చూస్తూ ఊరుకొంటే నేనూరుకోను, మంకుపట్టుపట్టి నీచేత పని చేయిస్తానంటున్నాడు.

ఇది కేవల కవివాణి కాదు; ప్రజాబలం ఉన్న కవివాణి.

### 5) దశావతారాలు ధర్మ చైతన్యంలో భాగమే:-

పాహిరామ ప్రభో! భజన పాటలో మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్కి అవతారాలను భక్తరామదాసకవి ప్రస్తుతించారు.

"మత్స్యమై జలధిలో జొచ్చి సోమకు ద్రుంచి
తెచ్చి వేదములజున కిచ్చు రామ ప్రభో!".... ॥పాహి॥

వేదాల రక్షణ, అమృతావతరణానికి సహాయం, భూమి రక్షణ, భక్త ప్రహ్లాద రక్షణ, బలిని అణచి దేవతల రక్షణ, దుష్ట రాజసంహారం, రావణాసుర సంహారం, హలధారులకుసేవ, ధర్మపథం వైపుగా ప్రజలను మళ్లించడం, కలిధర్మం వైపుగా ఆహ్వానించడం - ఇవన్నీ ఈ కీర్తనలో ఉన్నాయి.

ఈనాటి సమాజానికి కూడా ఇవి అవసరమే. పుస్తకాలను కాపాడాలి. (మత్స్య), మంచి వస్తువునుత్పత్తి చేయాలి (కూర్మ), భూమిని రక్షించాలి(వరాహ), దీన జన రక్షణ చేయాలి (నరసింహ), దేవతల లేదా దివ్య మానవుల రక్షణ చేయాలి (వామన), చెడు చేసే అధికారులను తొలగించాలి (పరశురామ), అధార్మికతను అంతంచేయాలి (శ్రీరామ), కర్షకుల పక్షం వహించాలి (బలరామ), బుద్ధి-ధర్మ-సంఘాలను శరణం అనాలి (బుద్ధుడు), పాపాన్ని పరిహరించాలి (కలికి).

దశావతారాలను ఈ విధంగా అన్వయం చేసి కొన్నప్పుడు ఆధునిక సామాజిక చైతన్యాన్ని ఆశించే, లేదా తాము జీవించి ఉన్న కాలం నాటి విపరీత పరిస్థితుల ప్రహారానికీ-పరిణామానికీ ఇటువంటి రచన భక్త రామదాసు చేశారని చెప్పుకోవచ్చు. అది ఎప్పుడో వ్యాసులవారే చేశారు గదా అని కొందరన వచ్చు. అవును ఆయన ఎప్పుడో ఆయన భాషలో ఆయన బాణీలో చెప్పారు. ప్రజలు పునరావృతమవుతారు; పరిస్థితులూ పునరావృతమవుతాయి. భావాలూ పునరావృతమవుతాయి. రామ దాసుకూడా చెప్పిందే చెప్పినా తన బాణీలో చెప్పారనుకోవాలి.

### 6. వివిధాంశాలలో సామాజిక దృక్పథం:-

ఆయా సంకీర్తనలలోని ఈ క్రింది పాదాలు కూడా సామాజిక చైతన్యానికి సంబంధించి వ్యాఖ్యానించుకొనే అవకాశం కల్పిస్తున్నాయి. ఆయా కీర్తనల్లోని కొన్ని పాదాలను పరిశీలిద్దాం.

- కామక్రోధ లోభ మోహ-గర్వమడచేరామనామం......
  నీమముతో బలికి తేను - నిత్యమోక్ష పదవినామం."
- "రామభక్తుల జేరగల్గెను - ఇతర
  కామములెల్ల వీడ గల్గెను - పర
  భామలపయి భ్రాంతి దొలగెను-మేము
  పరులు దోషములెన్న నెదురాడము ॥"
- "నిలిచిదానవుల నెత్తి కొడుదుగద
  ఖర యుద్ధంబునఁ గౌగిలింతుగద ॥"
- "ఇంద్రసుతు సోదరుని హితవు గావించి ॥"
- "పాలనలేని దొరతనమట-పాలించారు మీరిచ్చట
  చెల్లీ చెల్లములుంటే - ప్రొద్దున - చెల్లగట్టి పొయ్యేముగాని"-
- "ఏడనున్నాడో జాడ తెలియరాదు
  నాడూ గజేంద్రుని కీడు బాపిన సామి"
- ద్రౌణి బాణ జ్వాల దాకిన బాలునికి
  ప్రాణమిచ్చిన జగత్ర్రాణ రక్షకుడు.
- "పాంచాలి సభలోన భంగమొందిన నాడు
  వంచన లేకయె వలువ లిచ్చిన తండ్రి॥"
- "దూర్వాసుండుగ్రతతో ధర్మ సుతుజాడ
  నిర్వహించిన నవనీత చోరకుండు"

ఇలా కొన్ని వందల ఉదాహరణలు చూపవచ్చు. పై విషయాలొక్కొక్కటే చూద్దాం. అరిషడ్వర్గాల్లో చిక్కుకొంటే అరిష్టం; భామలపై భ్రాంతి ఉన్నవాడు కర్మయోగీ కాడు - కష్టజీవీ కాడు; దానవ గుణాలున్న వారిని పరిమార్చాలి. స్నేహితులకు సహకరించాలి; దొరతనం పది మందికి సహకరించి ఆదుకోవాలి; గజేంద్రుని వంటి వారిని ఆదుకోవాలి; గర్భస్థపిండాన్ని సంరక్షించాలి; స్త్రీల నవమానించే వారిని శిక్షించాలి; స్త్రీలను రక్షించాలి.

తాను మేధావినని (ఋషి దూర్వాసుడు) ధర్మజుని వంటి సత్య సంధులను ఆపదలకు గురిచేస్తే - ధర్మాన్ని కాపాడాలి.

## ఫలశ్రుతి

పై సంకీర్తనల పాదాలను, పై విధంగా అర్థం చేసి కొంటే, ఆచరిస్తే సామాజిక సంక్షేమం సాధించినట్లే. వికాస శీల జగత్తులోకి సమాజాన్ని నడిపించి నట్లే. ఉన్న వాణ్ణి లేనివాడు నరకడం, వర్గపోరాటం ద్వారా సామాజిక సమానత్వం సాధించడం అనేవి సామాజిక చైతన్యం క్రిందికి రావు. అవి హింసనూ, అశాంతిని సమాజంలో ప్రస్థాపిస్తాయి.

ఓం ద్యౌఃశాన్తిః, అంతరిక్షగ్ంశాన్తిః, పృధ్వీశాన్తిః, ఆపఃశాన్తిః, ఓషధయశ్శాన్తిః..... అనేదే సామాజిక చైతన్యానికి, శాంతి స్థాపనకు దోహదం చేసే దివ్యవాక్కులు. భక్తరామదాసు సంకీర్తన సాహిత్యంలో కూడా ఇటు వంటి అంశాలనే సామాజిక చైతన్యంగా పరిగణించడం జరిగింది. చైతన్యం శాంతిని నిర్మించాలి; అశాంతిని కాదు.

# రామదాసు కీర్తనలు-నవవిధ భక్తులు

ఆచార్య పి. సుమతీ నరేంద్ర

**నా**రదుడు భక్తిని నిర్వచిస్తూ భగవంతుని ఎడల శ్రేష్ఠమైన ప్రేమరూపమే భక్తి అన్నాడు. "స్వాతస్మిన్ పరమ ప్రేమ రూపా". భక్తునికి భగవంతుని పట్ల ఉండే పూజ్య భావమే భక్తి. అది మళ్ళీ సగుణ భక్తి, నిర్గుణ భక్తి అని రెండు రకాలు. రెండవది యోగులకు మాత్రమే సాధ్యమైంది. భగవంతుడిని చేరడానికి ఉండే భక్తి, కర్మ, జ్ఞాన మార్గాలలో కూడా భక్తి సామాన్యులకు సైతం సాధ్యమయ్యేది. భక్తిని ఎందరెందరో నిర్వచించి దానిలో గల అనేక భేదాలను కూడా చర్చించారు.

అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం అనేవి క్రమంగా శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు ప్రతి పాదించిన భక్తి మార్గాలే.

భక్తి రసామృత సింధువులో సాధన భక్తి, భావభక్తి, ప్రేమభక్తి అని భక్తి మూడు విధాలుగా విభజించబడింది.

సాంఖ్యమతానుసారం భక్తి నాలుగు విధాలు అని భక్తి రసాయనంలో చెప్పబడింది. అవి. 1. రాజసం 2. తామసం 3. సాత్వికం 4. మిశ్రమం. రాజసానికి భీమ, ధ్రువాదుల భక్తిని పేర్కొనవచ్చు. తామసానికి చోరుల భక్తిని ఉదాహరించవచ్చు. వ్యాస శుక నారదాదులది సాత్వికభక్తి దేవతల భక్తి మిశ్రమం క్రిందికి వస్తుంది.

భగవద్గీతలో శ్రీ కృష్ణుడు తన భక్తులు నాలుగు రకాలవారని పేర్కొన్నాడు.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతిఒ నోర్జున ।
ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥"

అన్నమయ్య, రామదాసు ఆర్తభక్తుల కోవలోకి వస్తారు. తత్వాన్ని అన్వేషించే యోగీశ్వరులు జిజ్ఞాసులే. సామాన్యులందరూ అర్థార్థులే. జ్ఞానిని నేనే అని శ్రీ కృష్ణుడే స్వయంగ చెప్పాడు.

రామదాసుకి పూర్వుడైన అన్నమయ్య అతని సంతతి వారు భక్తిని అనేక విధాలుగా భావించారు. ఉన్మాద భక్తి, పతివ్రతాభక్తి, విజ్ఞానభక్తి, ఆనందభక్తి రాక్షసభక్తి, తురీయభక్తి, తామసభక్తి, వైరాగ్యభక్తి, రాజసభక్తి, నిర్మలభక్తి అని పేర్కొంటూ శరణాగతభక్తి శ్రేష్ఠమని భావించారు. "గట్టిగా శ్రీ వేంకటేశుకైంకర్యమే సేసి తట్టు ముట్టులేనిదే తగ నిజ భక్తి". శ్రీ వేంకటేశ్వరుని పట్ల అన్నమయ్యకు ఎటువంటి భక్తి ఉండేదో ఇంచుమించు అదే భక్తి రామదాసుకు శ్రీ రామచంద్రుని పట్ల ఉండేది. వారి వారి జీవన విధాలను బట్టి తారతమ్యాలకు తావు ఏర్పడింది కాని ఇరువురిదీ అనన్యభక్తే!

భక్తి ఒక్కటే కాని వ్యక్తం చేసే విధానాలు వేరు. దానిని బట్టే రకరకాల వర్గీకరణాలు.

భక్తికి సంబంధించినంత వరకు భాగవతం పరమోత్కృష్టమైంది. ఆ తరువాత చెప్ప వలసింది ఏమీ లేదు. మొట్ట మొదటి సారిగా నవవిధ భక్తులను ప్రతిపాదించింది భాగవతం. అవే అందరికీ మార్గ దర్శకాలయ్యాయి. అయితే భక్తి రసం అవునా కాదా అనే చర్చలో మాత్రం ఆలంకారికులు భిన్న దృక్పథాలను వెలువరించారు.

ఏది ఏమైనప్పటికీ భగవంతుడిని సేవించడానికి అతి శ్రేష్ఠమైందీ, సులువైందీ భక్తి మార్గమే. తన్మయత్వం చెందిన భక్తుడు ఆ భగవంతుడిని చూడ గలుగుతాడు తన మనోనేత్రంతో. అటుపైన భగవంతుడికీ భక్తుడికీ మధ్య నున్న అంతరాలన్నీ ఒక్కటొక్కటిగా తొలగిపోతాయి. ఆ దశలో భక్తుడు భగవంతుడితోనే మాట లాడతాడు, మొర పెట్టుకుంటాడు. ఒక దశలో తానే తల్లియై భగవంతుడిని బిడ్డడిగా భావించి లాలిస్తాడు. లేదా మిత్రుడిగా ఎంచి సల్లాపాలాడతాడు. ఇవన్నీ దాటిన తర్వాత తనను తాను స్త్రీగా ఎంచుకొని ఆ పరమపురుషునికి అర్పణ చేసుకొంటాడు. అప్పుడది మధుర భక్తి అవుతుంది. అయితే అన్నమయ్య, రామదాసు ఈ కోవకు చెందిన వారుకారు. ఇప్పుడు రామదాసు కీర్తనలలో నవవిధ భక్తుల ఛాయలను పరిశీలించవచ్చు.

## రామదాసు కీర్తనల్లో నవవిధ భక్తులు

శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥

సంస్కృత భాగవతంలో నవవిధ భక్తులు ప్రస్తావించబడ్డాయి ప్రహ్లాదుని చేత. దీనికి పోతన అనువాదం తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్

వందనార్చనముల్, సేవయు, ఆత్మలో నెరుకయున్, సంకీర్తనల్, చింతనం బనునీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి సజ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబుదైత్యోత్తమా.

ఇవి కాకుండ భక్తి అయిదు విధాలు అని ప్రాచీన మతం ఒకటి ఉంది. అవి శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భక్తులు. శాంతభక్తికి భీష్ముడు, విదురుడు, సఖ్యభక్తికి అర్జునుడు, కుచేలుడు, వాత్సల్యభక్తికి యశోద దేవకీవసుదేవులు, దాస్యభక్తికి హనుమంతుడు, గరుడుడు, మధుర భక్తికి శ్రీ కృష్ణుని అష్ట భార్యలు, గోపికలు ఉదాహరణలుగా భావించవచ్చు.

ఉద్వేగం లేకుండా నెమ్మదిగా శాంతంగా ఉండేది శాంతభక్తి. ఇది మొదటి దశ. దాసత్వభావన కలిగినది దాస్యభక్తి ఇది రెండవదశ. సంభ్రమ గౌరవాలు ఉండే ఈ దశలోనే పరాకాష్ఠ ఏర్పడితే అది సఖ్యభక్తి అవుతుంది. ఇది మూడవ దశ. సఖ్య భక్తిలో అనుకంప ప్రవేశించినపుడు అది వాత్సల్యభక్తిగా పరిణమిస్తుంది. ఇది నాల్గవ దశ. వాత్సల్యభక్తిలో మాధుర్యం చేరితే అది మధురభక్తి అవుతుంది. ఇది ఐదవ దశ. భక్తి పరిణామంలో ఇది అత్యున్నతమైంది, ఉజ్జ్వలమైంది. దీనిలో మిగతా అన్ని భావాలు పర్యవసిస్తాయి. మధుర భక్తిలో ఆనంద పారవశ్యం కలుగుతుంది. దివ్య ప్రణయభావం భక్తుని భగవంతునికి చేరువయ్యేటట్లు చేస్తుంది. లౌకిక ప్రపంచ స్పృహను కోల్పోయే ఈ దశ భక్తికి పరాకాష్ఠ.

రామదాసు ప్రధానంగా దాస్యభక్తి, శాంతభక్తి ప్రధానాలైన కీర్తనలే వ్రాశాడు. మధురభక్తి ప్రతి పాదకమైన కీర్తనలువ్రాయలేదు. రామదాసుకు పూర్వులైన పోతన్న, అన్నమయ్యల మీద మధురభక్తి ప్రభావంగాఢంగా ఉంది. రామదాసు మీద ఆప్రభావంలేకపోవడానికి కారణం అనూహ్యం. ఆయన జీవితంలో నిర్వహించిన బాధ్యతలు, అనుభవించిన శిక్ష, వేదన అందుకు కారణాలేమోనని ఊహించవచ్చు.

ఇక సంస్కృత భాగవతంలో ప్రస్తావింపబడిన నవవిధ భక్తుల క్రమాన్ని పోతన మార్చడానికి హేతువులు తెలియవు. పద్య శిల్ప దృష్టితో మాత్రమే మార్చి ఉండవచ్చు. భక్తి భావాలకు వివరణ తోడు కావడం జరిగింది. సఖ్యం అన్నదానికి తనుహృద్భాషల సఖ్యం అనడం అందుచేతనే. 'ఆత్మనివేదనం' అన్నదాన్ని 'ఆత్మలో నెరుక' అని మార్చడం కొంచెం లోతుగా అధ్యయనం చేయాల్సిన విషయం. ఆత్మనివేదనం అన్నప్పుడు శరణాగతి భక్తి స్ఫురిస్తుంది. ఆత్మలోనెరుక అంటే జ్ఞానం అనేఅర్థం. ఈ మార్పుకు భక్తి, కర్మ, జ్ఞాన మార్గాలు మూడూ భగవంతుడిని చేరడానికి ఉపాదేయాలే అయినా భక్తి మార్గం సులువైంది, జ్ఞాన మార్గం ఉత్తమమైంది

అనే అభిప్రాయం కారణమని ఊహించాల్సి వస్తుంది. ఏది ఏమైనా పోతన క్రమాన్ని, భావాన్ని కొద్దిగా మార్చుకొని వివరణాత్మకంగా చెప్పినట్లు తెలుస్తుంది.

రామదాసు భాగవతోత్తముడు అసలు పేరును మర్చిపోయేటట్లు చేసింది అతని దాసభక్తి. 'నామ స్మరణం' భక్తాగ్రేసరుడైన రామదాసుకు సహజమే. రామదాసు కీర్తనలలో ప్రధానంగా కనిపించేవి స్మరణం, కీర్తనం, అర్చనం, వందనం, ఆత్మనివేదనం, పాద సేవనం, దాస్యం అనే ఏడు భక్తి భావాలు. శ్రవణం, సఖ్యం అనేవి తత్ఫలితంగా సిద్ధించేవి. మొత్తానికి నవవిధ భక్తి భావాలతో శ్రీ రాముని సేవించి, పరిపరి విధాల కీర్తించి భవ బంధాలను కారాగార వాస రూపంలో అనుభవించి వాటి నుంచే కాక లౌకిక ప్రపంచ వాసనల నుంచి కూడా విడుమర పొంది జీవన్ముక్తుడయ్యాడు రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న.

విస్తృత కథలతో, ఉపాఖ్యానాలతో కూడిన మహాభాగవతంలో నవవిధ భక్తులు ఆయా భాగవతుల కథలలో చూడవచ్చు. రామదాసు కీర్తనలలో రాముడొక్కడే రామదాసు ఒక్కడే! అన్య పాత్రలు లేవు, వారి కథలు లేవు. తన భక్తి భావమ్ములు తనవి గాన రామదాసు తనివిదీరా శ్రీ రాముని అర్చించి, కీర్తించి, సేవించి, పూజించి కొండొకచో ఉపాలంభించి ఆత్మనివేదనం చేసుకొన్నాడు. శ్రీ రాముని గుణగానం చేస్తూ పరవశించి తానే కర్త, శ్రోత కూడా అయినాడు. ఆ మహాభక్తుని చెరసాల పాలుగావించింది శ్రీ రామ సేవనంలో లౌకిక వ్యాపార వైముఖ్యం ఏర్పడడం చేతనే. అది అతనికి పెట్టబడిన పరీక్ష కావచ్చు. అగ్నిలోపుటం పెట్టబడిన బంగారం రామదాసు విరచితమైన భక్తి సాహిత్యం. నిజానికి ధాతు, మాతుపుష్టి గల రామదాసు కీర్తనలను పాడి వినిపిస్తే గాని వాటిలో ఉండే శబ్దపుష్టి, రాగ తుష్టి అనుభవానికి రావు. అయినా కేవలం సాహిత్య దృష్టితో రామదాసు కీర్తనలలో నవవిధ భక్తులను మనం అధ్యయనం చేయవచ్చు. ఆ ప్రయత్నమే ఈ పత్రం. అయితే ఈ కీర్తనలలో రెండు మూడు భావాలు ఒకే కీర్తనలో ఉండడం చాలా తరచుగ జరుగుతుంది. ఎందు చేతనంటే సృజనాత్మక సాహిత్యం శాస్త్రాధ్యయనం కోసం పుట్టేది కాదు. సృజన వ్యాపారం యథేచ్ఛగా సాగుతుంది. శాస్త్రం దాన్ని అనుసరుస్తుంది.

రామదాసు కీర్తనలతో నవవిధ భక్తుల అన్వయం:-

**1. శ్రవణం:-**

వాగ్గేయ కారుడు తాను రచించిన గేయానికి తానే స్వర కల్పన చేసుకొని

గానం చేస్తాడు. గానం చేసేటప్పుడు తానే శ్రోతయై స్వరలయవిన్యాసాన్ని, సాహిత్య సమన్వయాన్ని భావించు కుంటూ వింటాడు. మళ్ళీ మళ్ళీ పాడుకొని శ్రవణానందాన్ని పొందుతాడు. ఈ క్రమంలో వాగ్గేయ కారుడే కవి, సంగీత కర్త, గాయకుడు కూడా. చివరి దశలో తానే శ్రోత కూడా అవుతున్నాడు. శ్రీ రాముడి పలుకులను విని ఆనందించాలని పరితపిస్తున్నాడు ఈ కీర్తనంలో. ఇది సర్వజనాదరణను పొందిన రామదాసు ప్రసిద్ధ కీర్తనలలో ఒకటి.

"పలుకే బంగార మాయెనా - కోదండపాణి
పలుకే బంగార మాయెనా.......
పలుకే బంగారమాయె - పిలిచిన పలుకవేమి
కలలో నీ నామస్మరణ - మఱవ జక్కని తండ్రి.

ఇందులో రాముని దర్శించాలనే తీవ్రమైన కాంక్ష ఆ పలుకులు విని తరించాలనే తపన ఉన్నాయి. మరి మరి పాడుకొని విని తన్మయత్వం చెంది ఉంటాడనడంలో సందేహంలేని కీర్తన ఇది.

నవవిధ భక్తులలో మొదటిది శ్రవణం. హరి కథా శ్రవణం నిరంతరం చేయడం ద్వారా ముక్తిని పొందవచ్చు. విద్యాగంధం లేనివారిని సైతం భాగవత కథా శ్రవణం భక్తి వైపు మరలేటట్లు చేస్తుంది. రామదాసు కీర్తనలు ఆంధ్రదేశంలో అత్యంత ప్రాచుర్యం పొందడానికిదే కారణం.

## 2. కీర్తనం:-

భగవంతుని గుణగణాలను కీర్తించడంలో భక్తునికి అవధి తెలియదు. ఎంత కీర్తించినా తనివి తీరదు. రామదాసు కీర్తనలన్నీ భగవన్నామ సంకీర్తనలే. భక్తులకు అమిత పారవశ్యాన్నిచ్చేది గుణగానమే. పోతనతో ఇది ప్రారంభమై అన్నమయ్యతో విస్తరించి, రామదాసుతో కొనసాగి, క్షేత్రయ్యతో పుష్టినంది త్యాగరాజుతో మనోహర మైంది సుసంపన్నమైంది కీర్తనం. పద కవుల సాహిత్యంలో అత్యంత ప్రధానమైంది కీర్తనమే.

శ్రీరామ నీనామ మేమిరుచిరా
ఓ రామ నీ నామ మెంత రుచిరా....

కదళీ ఖర్జూరాది ఫలములకన్నను
పతిత పావన నామ మేమి రుచిరా

నవరస పరమాన్న నవనీతముల కంటె
అధికమౌ నీ నామ మేమిరుచిరా.....

మరొక్క ఉదాహరణ

దశరథ బాల దాసానుకూల
దశముఖ కాల ధరణీశపాల
మారుతభీమ మాల్యాభిరామ
కళ్యాణ నామ కారుణ్యధామ

మురళీవిలోల మునిజనపాల
తులసీ వనమాల తుంబురులోల

రామదాసు రచించిన వన్నీ కీర్తనలే నిజానికి.

### 3. విష్ణోః స్మరణమ్:-

నిజానికి భక్తులకు నిత్య విధి భగవన్నామ స్మరణమే. కలియుగంలో యజ్ఞయాగాది క్రతువులకన్నా నామ స్మరణమే ముక్తి దాయకమని భక్తులు విశ్వసిస్తారు. భగవంతుని నిత్యం స్మరించాలని తమకు తామే చెప్పుకోవడం ఇక్కడ విశేషం. ఆత్మ ప్రబోధం అన్నమాట.

"శ్రీ రాముల దివ్య నామస్మరణ సేయుచున్న జాలు
ఘోరమైన తపములను గోర నేటికే? మనసా
తారక శ్రీ రామనామ ధ్యానము సేసిన జాలు
వేఱు వేఱు దైవములను వెదక నేటికే మనసా"

ఈ కీర్తనలో శ్రీ రాముని స్మరించడమే గాకుండ ఇతర సామాజికాంశాల ప్రస్తావన కూడ ఉంది.

"పరుల హింస సేయకున్న - పరమధర్మమంతే చాలు
పరులను రక్షింతునని పల్కనేటికేమనసా"
దొరకొని పరులధనము దోచకున్ననంతే చాలు
.............................................................
పరగ దీనజనులయందు పక్షముంచితంతే చాలు
.............................................................

అతిథివచ్చి యాకలన్న నన్నుమిడినదే చాలు
క్రతువు సేయ వలయుననెడి కాంక్షలేటికే మనసా.

ఇంకొక్క ఉదాహరణ:

దినమే సుదినము- సీతారామ స్మరణమే పావనము
ప్రీతినైన ప్రాణ భీతినైన గలిమి
చేతనైన మిమ్మే తీరు దలచిన.........

## 4. పాదసేవనమ్:-

భగవంతుని పాదాలను నమ్మికతో పట్టుకొన్నవాడు ఎన్నటికీ చెడిపోడు. "అంబుజోదర దివ్యపాదారవింద చింత నామృత చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు" అని ప్రహ్లాదుడన్న హరినామ సంకీర్తనమే చాలు అని అన్నమయ్య పాడినా సారాం శమదే. రామదాసు కష్టాలలో కాగినవాడు. ఎన్ని ఆటంకాలు ఏర్పడినా భద్రాద్రి రాముని పాదాలను పట్టి విడువనివాడు.

"నిన్నూ బోనిచ్చెదనా-సీతారామ
నిన్ను బోనిచ్చెదనా? - నన్నురక్షింపక
యెన్ని విధముల నా కన్నులాన రామ ॥నిన్ను॥

రట్టు చేసి నిన్నరి కట్టుదు నింక
దిక్కు గలిగతే మొఱ బెట్టుకోర రామ ॥నిన్ను॥

గట్టిగ నీ పాద కమలము లెప్పుడు
బట్టి నామదిలో గట్టి వేయుదు రామ ॥నిన్ను॥

రామదాసుకు తెలుసు భగవంతుడు భక్త వశంకరుడని, అందుకే వెళ్ళు చూద్దాం అంటున్నాడు. భక్తునికీ, భగవంతునికీ మధ్య రెండు రకాలైన సంబంధాలుంటాయి. ఒకటి కపికిశోర న్యాయం, రెండవది మార్జాల కిశోర న్యాయం. రామదాసుది మొదటి పద్ధతి. నన్ను విడిచి నువ్వు వెళ్ళలేవు. వెళ్ళినా నీతోనే నేనుంటాను అంటున్నాడీ కీర్తనలో. రాముని పాదాలను పట్టి విడువని వాడు కనుకనే రామదాసు డయ్యాడు.

## 5. అర్చనమ్:-

"ఏ తీరుగ నను దయ జూచెదవో-యినవంశోత్తమ రామా
నా తరమా భవసాగర మీదను నళిన దళేక్షణ రామా"

శ్రీ రఘునందన సీతారమణా - శ్రితజన పోషక రామా
కారుణ్యాలయ భక్త వరద నిను - గన్నది కానుపు రామా
మురిపెముతో నా స్వామివి నీవని ముందుగ దెల్పితి రామా
.......................................................................
క్రూరకర్మములు నేరక చేసితి నేరము లెంచకు రామా
.......................................................................
బంధనమున నీ నామము దలచిన బ్రహ్మానందము రామా
దాసార్చిత మాకభయ మొసంగ-వెదాశరథీ రఘు రామా

భగవంతుని నానా విధాలుగా అర్చించడం 'అర్చనమ్' అనిపించుకొంటుంది. అయితే కారాగారంలో ఉన్న రామదాసుకు షోడశోపచారాలతో కూడుకొన్న నిత్యపూజా విధులు నిర్వర్తించడం అసాధ్యం అయినా ఆ మహాభక్తుడు మానసిక పూజ చేత దాన్ని సాధించాడు. భక్తి జ్ఞాన కర్మ మార్గాలలో రామదాసుకు భక్తి మార్గమే ఉపాదేయమైంది. రామదాసు తన కీర్తనల ద్వారా తాను భగవంతుడిని అర్చించడమే కాకుండా వాటిని విన్న వారికి, పాడిన వారికి కూడా ముక్తి మార్గం దొరికేటట్లు చేశాడు.

## 6. వందనమ్:-

"అంతారామమయం - బీ జగమంతా రామమయం"

అని భావించి ఆ రామచంద్రుని సేవలోనే తరించిన రామదాసు కీర్తనలన్నీ వందన కుసుమాలే.

"ఆనంద మానంద మాయెను" అనుకుంటూ నిత్య మానస పూజలు చేసుకొన్న ధన్యుడు రామదాసు.

"ఇతర చింతనలిక చేయము - ఇతర
దైవముల గొనియాడము-ధరా
పతులకు జిక్కిచింత సేయము ఇన
కుల చంద్రుడౌ భద్రాచలరాము గొలుతుము"

ఈ కీర్తనలో కూడా సామాజికాంశాలు ప్రస్తావింప బడ్డాయి. పరభామల పయిభ్రాంతి తొలగిందని పరులు దోషములెన్న నెదురాడమని చెప్పుకోవడం గమనార్హం. దారిద్ర్యము లెల్లమది నెంచము అనే నిబ్బరం కూడా ఈ కీర్తనలో కనిపిస్తుంది.

శ్రీ రామ నామాన్ని నిరంతరం జపించి తరించిన వాడు రామదాసు. నీవు తప్ప ఇతఃపరం బెరుంగను అన్న గజేంద్రుని వంటివాడు రామదాసు. సంరక్షింపు భద్రాత్మకా అనుకొన్న గజేంద్రుని రక్షించినట్లే శ్రీరామ భద్రుడు రామదాసుని కటాక్షించాడు. వైయక్తికమైన రామదాసు భక్తి కీర్తనల ద్వారా సామూహిక భక్తి ప్రవాహానికి దారులు తీసింది.

## 7. దాస్యమ్:-

దాస భక్తి అన్నిటి కంటె శ్రేష్ఠమని వైష్ణవులు భావిస్తారు.

"మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్యభృత్య పరిచారక భృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాంస్మరలోకనాథ!

ఈ భావాన్ని రామదాసు కీర్తనలలో మనం చూడ గలం. భగవంతుడిని పరిపూర్ణంగ విశ్వసించిన భక్తుడు తనను దాసాను దాసునిగా భావించు కోవడం పరిపాటి.

"శరణా గత రక్షణ బిరుదని నే
శరణంటి గదయ్యా
వెఱవకు మని యభయం బొసగవె నను
గన్న తండ్రివయ్యా

ఆదిదేవ మీ చిత్తము భాగ్యము
భావ మెవరి దయ్యా
నీ దాసులకును నేదాసుడ దయ
యుంచి యేలుమయ్యా!

రామదాసు ప్రపంచించిన భక్తి పలువిధాలుగా కనిపించినా మరల అది దాస్యభక్తి గానే పరిణమిస్తుంది. నిరహంకార రూపమైనదే దాస్యభక్తి. దాసానుదాసుడు అనడం అందుచేతనే.

## 8. సఖ్యమ్:-

రామా సుధాంబుధి ధామా నాపై
నెందుకు దయరాదురా?

వేమఱు వినయముతో వివరించినా నాదు
విన్నపమూ వినవేమిరా?

అని బ్రతిమాలు కొంటున్నాడు రామదాసు

నిక్కముగా తల్లివి-తండ్రివి నీవని
నెఱ నమ్మి యున్నానురా
దిక్కు నీవని యున్న దయ జూడవిక మాకు
దిక్కెవ్వరున్నారురా
యెక్కడ నున్నావో- నా మొఱాలకించ

వింత పరాకేలరా-అని ప్రాధేయపడుతున్నాడు.

ఇంతకంటె ఇంకా కొంత దగ్గరి తనంతో తనకున్న చనువుతో స్వామినే నిలదీస్తున్నాడు చూడండి.

"సీతారామ స్వామీ-నే-జేసిన నేరము లేమీ?
ఖ్యాతిగ నీ పద కంజయుగమునే
ప్రీతిగ దలపక భేద మెంచితినో?"
రంగుగ నా పది వేళ్ళకు రత్నపు
టుంగరములు నిన్నడిగితినా?
సంగతి బంగరు సేలువ పాగా
లంగీల్ నడికట్లడిగి తినా?
చెంగటి భూసురపుంగవులెన్నగ
చెవులకు చౌకట్లడిగితినా?
ముంగర గొలుసులు ముత్యపుసరములు
నంగనలకు నిన్నడిగితినా?

ఇలా అది అడిగానా ఇది అడిగానా అని స్వామిని రెట్టించి మరీ అడగడం ఇందులో విశేషం. భక్తులు సాధారణంగా అడగడానికే దేవుడిని ఆశ్రయిస్తారు. అలాంటి వాడ్ని కాదు నేను అని నీవు నన్ను గుర్తించలేదా అని ప్రశ్నిస్తున్నాడు. ఇలాంటివి ఇంకా కొన్ని కీర్తనలు కూడా ఉన్నాయి.

## 9. ఆత్మ నివేదనమ్:-

ఆత్మార్పణం చేసుకొన్న అరిది భక్తి రామదాసుది. అయినా కరుణించలేదు

ఆ జగన్నాటక సూత్ర ధారుడు. అప్పుడు అమ్మతో మొర పెట్టుకొన్నాడు. అప్పుడుగాని అయ్య గారి కటాక్ష వీక్షణాలు దాసుని పై బడలేదు.

పాహి రామప్రభో-పాహి రామప్రభో
పాహి భద్రాద్రి వైదేహి రామప్రభో

పాహిమాం శ్రీ రామా యంటే పలుకవైతివి నీ

స్నేహ మెట్టి దని చెప్పు- అని వాపోయిన వెనుక నరహరిని నమ్మక నరులను నమ్మితే నర జన్మ మీడేరునా? చెఱకులుండగ వెట్టి చెలుకులు నమలితే జిహ్వకు రుచి పుట్టునా మనసా" అని పరిణతిని పొంది తన్నుతాను నివేదనం చేసుకొన్నాడు. అప్పటికీ దయరాకపోతే అమ్మను ఆశ్రయించాడు.

నను బ్రోవుమని చెప్పవే- సీతమ్మతల్లీ
నను బ్రోవు మని చెప్పవే!
నను బ్రోవుమని చెప్పు నారీ శిరోమణి
జనకుని కూతురా జననీ జానకమ్మ

ఇక్కడ కొంత సీతారాముల ప్రణయాన్ని వర్ణించిన విధం అన్నమయ్య ప్రభావంతోనే చేసి ఉండవచ్చునిపిస్తుంది.

"ప్రక్కను జేరుక-చెక్కిలి నొక్కుచు
జక్కగ మరుకేళి-సొక్కియుండెడి వేళ ॥నను॥
లోకాంత రంగుడు - శ్రీ కాంత నిను గూడి
యేకాంతమున నేక - శయ్యనున్న వేళ ॥నను॥

రెండు రూపాలలో కనిపించినా వారు ఒక్కరే. విడదీయరాని వారి సంబంధాన్ని మహాకవి వాగర్థాలతో పోల్చి చెప్పినా నీవు స్వామికి విన్నవించు తల్లీ అని రామదాసు వేడుకొన్నా ఆంతర్యం అదే. ఆయన హృదయంలో ఆమె వసిస్తుందనడంలో ఉన్న గూఢార్థం ఇదే. ఆమె ప్రత్యేకంగ స్వామికి చెప్పేదేం లేదు. వారిద్దరూ ఒక్కటే. అయినా ఒక స్వారస్యం కోసం రామదాసు చేసిన ఈ ప్రయత్నం గొప్ప ప్రసిద్ధిని పొందింది. త్యాగ రాజు కూడా ఇలా అమ్మను ప్రార్థించడం మనం చూడవచ్చు. వీరందరికీ మార్గ దర్శకుడు తాళ్ళపాక అన్నమాచార్యులు!

నవవిధ భక్తులు కాక మరి కొన్ని భక్తి భావాలు -

**10. వాత్సల్యభక్తి:-**

జో రవికుల శుభాంగ-జో సన్నుతాంగా
రార కరుణాంగ - రమ్యాంతరంగా ॥జోజో॥

శ్రీ వెలయ పాలవా-రిధి బవ్వళింపా
దేవ బృందము లెల్ల - దివి సన్నుతింపా ॥జోజో॥

భగవంతుడిని బిడ్డడుగా భావించి లాలపోయడం జోల పాడడం భక్తికి పరాకాష్ఠ.

శరణాగతి భక్తి వైష్ణవం వ్యాపించిన దశలో ఎక్కువ ప్రాధాన్యాన్ని సంతరించు కొన్నది. ఆప్రభావం రామదాసు కీర్తనలలో స్పష్టంగా కనిపిస్తుంది. "రామదాసస్తుతి నిదానం" అని రాముడిని సంభావిస్తాడు.

"దాసార్చిత మాకభయ మొసంగవె దాశరథీ రఘురామా" అని ప్రార్థిస్తాడు. "చరణములేనమ్మితి నీ దివ్య చరణములే నమ్మితి, వారధి గట్టిన వరభద్రాచల వరదా వరదా వరదా" అని శరణాగతి భక్తికి నిదర్శనంగా చెప్పదగిన కీర్తనల నెన్నిటినో రచించి భజన కూటములలో పాడుకోవడానికి అనుకూలమైన రాగాలతో స్వరపరచి భక్తి సాహిత్యంలో చిరస్థాయిని పొందాడు రామదాసు. ఎన్నెన్ని విధాలుగా భగవంతుడిని కీర్తించడానికి స్మరించడానికి వీలుందో అన్ని విధాలుగాను భజించి, సేవించి ధన్యుడయ్యాడు రామదాసు.

# అన్నమయ్య-రామదాసు తులనాత్మక పరిశీలన

ఆచార్య పి. కుసుమకుమారి

## 1.1 ఉపోద్ఘాతం:

భాషా సాహిత్యాలను స్థూలంగా మూడు పద్ధతులలో పరిశీలించవచ్చు. కాలానుగుణంగా వివిధ కాలాల్లో వెలువడిన రచనలను, భాషను పరిశీలించడం ఒక పద్ధతి. ఇది చారిత్రక పద్ధతి (Historical Method) అవుతుంది. అలా కాకుండా ఒక కాలంలో వెలువడిన రచనలనో లేదా ఒక కవి కావ్యాన్నో ప్రత్యేకంగా అధ్యయనం చెయ్యడం వర్ణనాత్మక పరిశీలన (Descriptive Method). ఒక కవి రచనలను మరొక కవి రచనలతో సరిపోల్చి పరిశీలించడం, భిన్న భాషా సాహిత్యాలను, కవులను తులన చెయ్యడం తులనాత్మక పద్ధతి (Comparative Method)అవుతుంది. సాహిత్య పరిశోధన, విశ్లేషణలలో తులనాత్మక పద్ధతికి ఒక ప్రత్యేకత ఉంది.

## 1.2 తులనాత్మక అధ్యయనం-కొన్ని ఆలోచనలు

ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ తులనాత్మక సాహిత్యం పేరిట వ్యాప్తిలో ఉన్నధోరణులను ఇలా సమీకరించారు.

### తులనాత్మక పరిశీలన-లక్ష్యాలు-పద్ధతులు

1. ఒక సాహిత్యానికి మరో సాహిత్యానికి మధ్య ద్వైపాక్షిక సంబంధాల (బైనరీ రిలేషన్స్)ను పరిశీలించడం.
2. సమాంతరంగా భిన్న సాహిత్యాలను అధ్యయనం చేయడం.
3. సాహిత్య చరిత్రలకు, సిద్ధాంతాలకు సంబంధించిన అంశాలను అనుశీలించడం.

4. సాహిత్యాలన్నిటికీ సమానంగా ఉన్న సార్వత్రిక లక్షణాలను సూత్రీకరించడం.

5. జాతీయ వారసత్వంలోని ఇతర అంశాలకు, సాహిత్యానికి మధ్య సంబంధాలను వివేచించడం.

6. భిన్న భాషలు కలిగిన దేశాలలో (Multilingual Uninational) భాషా భేదాలకు అతీతంగా సాహిత్యంలోని ఏకత్వాన్ని దర్శించడం.

7. మౌలిక సాహిత్య సంప్రదాయాలను - రచనా సంప్రదాయాలను సమన్వయించి సమగ్ర జాతీయ సాహిత్య వికాసాన్ని నిరూపించడం. ఇటీవలి శతాబ్దాలలో ప్రత్యేక దేశాలు (Nations)గా గుర్తింపు పొందిన దేశాలలో ఈ ధోరణి ఎక్కువ.

8. అంతర్జాతీయ సాహిత్య సంబంధాలను, సాహిత్య చరిత్రలను ఆవిష్కరించడం.

9. కళలకు, సాహిత్యానికి మధ్య సారూప్య వైదృశ్యాలను వివేచించడం.

10. సాహిత్య వికాసానికి, సామాజిక శక్తులకు లేదా సాంస్కృతిక శక్తులకు మధ్య సంబంధ ప్రభావాలను వివేచించడం.

ఇన్ని ధోరణులున్నా తులనాత్మక విజ్ఞానంలో ప్రాయికంగా ప్రాచుర్యమున్న విధానాలు లేదా అర్థావరణలు రెండే 1.మెథడాలజీగా 2.డిసిప్లిన్‌గా. మెథడాలజీగా దానిపేరు తులనాత్మక సాహిత్యం, డిసిప్లిన్‌గా భారతీయ సన్నివేశంలో దాని పేరు 'తులనాత్మక భారతీయ సాహిత్యం' (అలాగే ఏక సాంస్కృతిక వాతావరణంలోని విభిన్న సన్నివేశాలలో విభిన్నమైన పేర్లు, ఉదాహరణకు తులనాత్మక యూరోపియన్ సాహిత్యం, తులనాత్మక ఆఫ్రికన్ సాహిత్యం వగైరా)

వీరి దృష్టిలో తులనాత్మక సాహిత్యం అంటే వివిధ సంస్కృతుల మధ్య సాహిత్య సార్వజనీన తత్వాలను (లిటరల్ యూనివర్సల్) అనుశీలించే మెథడాలజీ. అంటే తులనాత్మక సాహిత్యం అన్నది వివిధ సంస్కృతుల మధ్య, వాటి ప్రతినిధి రూపాలైన సాహిత్యాల మధ్య చేసే అంతస్సాంస్కృతిక విచార చర్చ అవుతుంది. ఇది మూడు రకాలు

**1. తులనాత్మక విమర్శ (కంపారిటివ్ క్రిటిసిజం) :-**

ఏ రెండు సాహిత్యాంశాల మధ్యనైనా తులనాత్మకంగా చేసే విమర్శ. ఆ రెండంశాలు ఒకే సాహిత్యానికి సంబంధించినవి కావచ్చు.

**2. తులనాత్మక సాహిత్యం (కంపారిటివ్ లిటరేచర్) :-**

ఇందాక వివరించిన 'సార్వత్రిక సాహిత్య శాస్త్రం' భిన్న సంస్కృతులకు ప్రాతినిధ్యమైన సాహిత్యాలు ప్రధానంగా వివక్షలోకి వస్తాయి. అంతస్సాంస్కృతిక లేదా అంతర్ వైజ్ఞానిక (ఇంటర్ కల్చర్ లేదా ఇంటర్ డిసిప్లినరీ) అనుశీలన ప్రధాన వివక్షనీయాంశమవుతుంది. సమన్వయాన్ని నిరూపించడం ముఖ్య లక్షణమవుతుంది.

**3. తులనాత్మక అధ్యయనం (కంపారిటివ్ స్టడీస్) :-**

విభిన్న వైజ్ఞానిక క్షేత్రాలకు సంబంధించిన సామూహిక వాచి. భాషల పరంగా, విద్యాధిక వ్యవస్థల పరంగా, ఇంకా బహుముఖంగా తులనాత్మక అధ్యయనం జరుగుతోంది. ఫలితంగా తులనాత్మక భాషా శాస్త్రం (కంపారిటివ్ లింగ్విస్టిక్స్ / ఫైలాలజీ), తులనాత్మక చరిత్ర (కంపారిటివ్ హిస్టరీ), తులనాత్మక సామాజిక శాస్త్రం (కంపారిటివ్ సోషియాలజీ), తులనాత్మక విద్యాశాస్త్రం (కంపారిటివ్ ఎడ్యుకేషన్) వంటి భిన్న అధ్యయనాంశాలు వ్యాప్తిలోకి వచ్చాయి.

డా॥ భీమసేన్ నిర్మల్ గారు తులనాత్మక పరిశీలన ముఖ్యంగా మూడు దృక్పథాలతో జరుగుతుందంటారు.

1. తులనాత్మక పోకడలు (Trends) రచయితలను రచనలను పోల్చి చూడడం.
2. భాష-వ్యాకరణాంశాలను పోల్చిచూడడం.
3. సాంస్కృతిక విషయాలను పోల్చడం.

సాహిత్యంలో వివిధ అంశాలను పరిశీలించే వ్యాసంగంలో అయిదు అంశాలను ప్రస్తావించుకోవచ్చు. అవి:

1. సాహిత్య ధోరణుల తులన
2. ఒక్కోకాల ఖండం తులన
3. రచనల తులన
4. రచయితల తులన

5. పరస్పర ప్రభావాల తులన

ప్రసిద్ధ భారతీయ తులనాత్మక సిద్ధాంతకర్త ఆచార్య ఇంద్రనాథ్ చౌధురి తులనాత్మక అధ్యయనంలో క్రింది విషయాలు ప్రముఖపాత్ర వహిస్తాయంటారు. అవి

1. ప్రభావాలు, సారూప్యాలు, అంతస్సంబంధాల అధ్యయనం.
2. వస్తువు, వస్త్వంశాల అధ్యయనం.
3. భిన్న సాహిత్యాల ప్రక్రియా పరమైన అధ్యయనం.
4. భిన్న సాహిత్యాల్లోని లక్షణ గ్రంథాలు, సాహిత్య సిద్ధాంతాల అధ్యయనం.
5. ఉద్యమాలు, దోరణుల అధ్యయనం. ఇవి ముఖ్యంగా వేర్వేరు సంస్కృతులకు సంబంధించినవిగా ఉంటాయి.

భారతీయ సాహిత్యంలో తులనాత్మక అధ్యయనం విషయంలో నేషనల్ బుక్‌ట్రస్ట్, సాహిత్య అకాడమీ, భారతీయ జ్ఞానపీఠ్ వంటి సంస్థలు కొంత కృషి చేశాయి. తులనాత్మక అధ్యయనానికి అనువాదాల ద్వారా కూడా అవకాశం ఏర్పడుతున్నది. విశ్వవిద్యాలయ తెలుగు శాఖల్లో కూడా తెలుగు-తమిళం, తెలుగు-కన్నడ భాషల మధ్య కొంత కృషి జరిగింది. ఉదా: పంప-నన్నయ భారతాలు; వేమన-సర్వజ్ఞుడు; విశ్వనాథ-కువెంపు రామాయణాలు; తెలుగు-ప్రాకృత వ్యాకరణాలు; తెలుగు-కన్నడ జానపద గేయాలు, దాక్షిణాత్య భాషల్లోని ఛందోరీతులు మొదలైన అంశాలపై జరిగిన పరిశోధనలు కొన్ని ఉదాహరణలు.

ఆంధ్రప్రదేశ్‌లోని హిందీ శాఖల్లో కూడా తులనాత్మక అధ్యయనం కొంత జరుగుతున్నది. సూరదాసు-పోతన, పంత్-కృష్ణశాస్త్రి; జయశంకర ప్రసాద్-విశ్వనాథ, సాకేత్-రామాయణ కల్పవృక్షం వంటివేకాక రామకథాసాహిత్యం; వైష్ణవ భక్తి సాహిత్యం, నాటకాలు, సామాజిక నవలల వంటి అంశాలలో కూడా పరిశోధన జరిగింది.

తులనాత్మక పరిశీలన రెండు భాషల నడుమనేకాదు. ఒకే భాషకు చెందిన రెండు రచనలను కూడా తులనాత్మకంగా పరిశీలించవచ్చు. రెండు ప్రబంధాలను, రెండు పురాణాలను రెండు నవలలను తెలుగులో సరిపోల్చి పరిశీలించటం జరిగింది. ముదిగంటి సుజాతారెడ్డి మను-వసు చరిత్రల తులనాత్మక పరిశీలన; చివరకు మిగిలేది-హిమజ్వాలల తులనాత్మక పరిశీలన అటువంటివే. ఆ కోవలోనివే రామదాసు-త్యాగయ్య; అన్నమయ్య-రామదాసుల తులనాత్మక పరిశీలన కూడా.

## 1.3 తులనాత్మక పరిశీలన- ప్రయోజనం

భారత దేశంలో తులనాత్మక పరిశోధనకు ఎంతో ప్రాదాన్యముంది. భిన్న భాషా సాహిత్యాలతో విలసిల్లే భారత దేశంలో 'భారతీయ సాహిత్య భావన' (The Concept of Indian Literature) రూపుదిద్దుకోవడానికి తులనాత్మక అధ్యయనం దోహదం చేస్తుంది. సాహిత్యంలో మౌలికమైన ఏకతా లక్షణం, సాహిత్య విశ్వజనీనత (Literary Universals) ఆవిష్కృతమౌతాయి. జాతీయ సమైక్యతా భావం, ఇతర భాషా సాహిత్యాల పట్ల ఆసక్తి ఆదరణ ఏర్పడతాయి. Literary Tolerance అంటే ఇతర భాషా సాహిత్యాల పట్ల సహన భావం, గౌరవం కలుగుతాయి.

వివిధ భాషల, సాహిత్యాల తులనాత్మక పరిశీలన విశ్వమానవ సృజనాత్మక శక్తిని అన్వేషించడానికి దోహదం చేస్తుంది. మానవ జాతి ఆలోచనల్లో మౌలికంగా ఉన్న ఏక రూపతనూ (Uniformity) , విశ్వజనీనతనూ (Universality) ఆవిష్కరించడానికి తులనాత్మక సాహిత్య అధ్యయనం అవకాశం ఏర్పరుస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే (Universal Literature) విశ్వసాహిత్య దర్శనమే తులనాత్మక పరిశీలన లక్ష్యం. సాహిత్య అధ్యయన పద్ధతుల్లో తులనాత్మక అధ్యయన పద్ధతి అత్యంత ఆధునికమూ, శాస్త్రీయమైనదిగా ప్రపంచవ్యాప్తంగా గుర్తింపుపొందింది. ఈ నేపథ్యంలో అన్నమయ్య-రామదాసు సాహిత్యాల తులన చెయ్యవచ్చు.

## 1.4. అన్నమయ్య-రామదాసుల జీవిత విశేషాలు-తులన

అన్నమాచార్యుల తండ్రి, తాతముత్తాతల నివాసం కడప జిల్లా తాళ్ళపాక గ్రామం. వీరు నందవరీక బ్రాహ్మణులు; ఋగ్వేదులు; ఆశ్వలాయన సూత్రులు, భారద్వాజ గోత్రులు. ఇలాంటి వంశంలో నారాయణసూరికి అతని ధర్మపత్ని లక్కమాంబకు శ్రీ వేంకటేశ్వర స్వామి అనుగ్రహంతో "బిరుదు గజ్జియల ముప్పిడి కఠారంబగు నందకాంశమున వైశాఖ విశాఖా నక్షత్రమున, చక్కని అనుగ్రహము లుచ్ఛ్రయమున మూడలర" అన్నమాచార్యుడు జన్మించాడు. అన్నమయ్య జీవితకాలం క్రీ.శ.1408-1503 అని పరిశోధకుల అభిప్రాయం. ఈతడు 1424లో జన్మించి 1503లో దివ్యధామం చేరినట్లు వేటూరి ప్రభాకర శాస్త్రి గారు నిర్ణయించారు. ఈ విషయాన్ని డా॥ వేటూరి ఆనంద మూర్తి గారు బలపరిచారు. కానీ అనేకాధారాలతో గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు అన్నమాచార్య జననం 1408 అని నిరూపించారు. "అన్నమయ్య క్రీ.శ 1424 క్రోధి సంవత్సరం వైశాఖ శుద్ధపూర్ణిమ నాడు, విశాఖా నక్షత్రము నందు జన్మించినట్లు కీ.శే. ప్రభాకర శాస్త్రి గారు పేర్కొనియున్నారు."

1408 విరోధి వైశాఖ శుద్ధ పూర్ణిమ విశాఖా నక్షత్రమన సబబు. విరక్తుడగు అన్నమయ్య ఈ విధముగా లెక్కించెననుట సమంజసము.

తిరుమల కొండ దర్శనం అన్నమయ్య జీవితంలో ఒక ప్రముఖ ఘట్టం. ఆయన కొండనెక్కే సమయంలో ఉన్న వయస్సు విషయంలో బిన్నాభిప్రాయా లున్నాయి. అన్నమాచార్యుడు కొండనెక్కే సమయానికి పదహారేండ్ల వాడని చెప్పిన ప్రభాకర శాస్త్రి గారి మాటలను అంగీకరించక అన్నమాచార్యుని మనుమడు చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో చెప్పినట్లు కొండనెక్కేసరికి ఎనిమిదేండ్లే అని భావించి ఐదో ఏటనే ఉపనయనం జరిగినట్లు విశ్వసించి, దానికి తగిన ఉపపత్తులు గౌతమ ధర్మ సూత్రాల నుంచి ఉదాహరించి గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు స్థాపించారు. అట్లు అన్నమయ్య పుట్టినదాది ఎనిమిదవ యేటనే కొండనెక్కెననుట వింతగాదు.

"ఈ లీలనెనిమిది యేడుల పిన్న
బాలుడయ్యును నిష్ఠఁబనిఁబూని యతఁడు
.......................................
వితత వృత్తంబుల వేంకటపతికి
శతకంబు కుతుకంబు సమకూరజేసి
పదిరెండు నామముల్ బాగుగా ఁదీర్చి
సదమలా చారుఁడై, సనుదెంచియతఁడు".

(చిన్నన్న-అన్నమాచార్య చరిత్రము) పుట. 23,24

అన్నమాచార్యుడు శ్రీ వేంకటేశ్వరునిపై దినానికి ఒక సంకీర్తన చొప్పున రచించి సమర్పిస్తూ అతని జీవిత కాలంలో ముప్ఫై రెండు వేల సంకీర్తనలు రచించాడన్న సంగతిని అంగీకరిస్తూ, పరిశీలిస్తే గూడా అన్నమాచార్యుని జీవితకాలం క్రీ.శ 1408-1503 అని పరిశోధకులు స్పష్టం చేయడం జరిగింది.

చిన్న వయస్సులో అన్నమాచార్యుడు తల్లిదండ్రులు, వదిన పని చెబుతుండగా చేస్తూ ఉండేవాడు. యథారీతిగా ఒకరోజు పశువుల కోసం కసవు కోసి తెమ్మనగా, వెళ్ళి చేతివేలుకోసుకుని బాధపడి విసిగిపోయాడు. తెలిసీ తెలియని వయస్సులోనే శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనార్థం తిరుపతికి వెళుతూన్న భక్త బృందంతో కలసి వెళ్ళిపోయాడు. మోకాళ్ళ ముడుపు వద్దకి చెప్పులకాళ్ళతో నడచివెళ్ళి అలసిపోయి భక్తులను వదలి రాతిబండ మీద నిద్రపోయాడు. అలిమేలు మంగవచ్చి అతని అలుపు తీర్చివెళ్ళిపోయింది. అమ్మ ఇచ్చిన ప్రసాదం మూలంగా అతడు సరససాహిత్య

పారీణుడై అలమేలుమంగాంబపై శతకం ఆశువుగా చెప్పాడు. ఆ వెనుక పదాలు పాడుకుంటూ కొండ మీదికి వెళ్ళి కోనేరు మొదలైన వాటిని దర్శించి, స్నానాదులు ముగించి శ్రీ వేంకటేశ్వరుని దర్శించి పులకితుడవుతాడు. అర్చకులు తీర్థ ప్రసాదాలు శఠగోపం ఇచ్చి పంపుతారు. పాపనాశాదుల్లో అవగాహనుడై శ్రీ వేంకటేశ్వరునిపై శతకం చెప్పాడు. స్వామి దర్శనానికి పోగా తలుపులు బిగించి ఉండటం గమనించి, ఆవేశంతో అంతకుముందే చెప్పిన శతకంలోని పద్యాలు మళ్ళీ చదువగానే తలుపులు వాటికవే తెరుచుకున్నాయి. అర్చకులు ఆశ్చర్యచకితులైయ్యారు. స్వామి వారి ముత్యాల పేరు అన్నమయ్య పాదాలపై పడుతుంది. అచటి వైఖానసార్చకులు అబ్బురపడి, అతడు సామాన్యుడు కాడనీ, స్వామి అవతారమని కీర్తిస్తారు. ఆ వెనుక స్వామి ఆదేశాను సారం ఘన విష్ణుయతి అన్నమయ్యను శంఖచక్రాంకితుని జేసి, పంచసంస్కారాలు గావించి, శరణాగతి ధర్మాన్ని బోధించి వైష్ణవ మతావలంబిగా చేసి పంపుతాడు.

అన్నమయ్య తల్లిదండ్రులు పుత్రుడు కనిపించక బాధపడి ఎలాగో చివరకి తిరుపతి చేరి వెతికి అన్నమయ్యను ఇంటికి తీసుకునిపోతారు. అన్నమయ్య యుక్త వయస్కుడుకాగానే తల్లిదండ్రులు తిరుమలమ్మ, అక్కమ్మలనే ఇద్దరు కన్యలతో అన్నమయ్య వివాహం చేస్తారు. శఠగోపముని వద్ద సకల వేద వేదాంత పఠనం పూర్తి చేసుకొంటాడు. శ్రీ వేంకటేశ్వరునిపై భక్తితో పదరచన చేసి ఆడిపాడుకొంటూ ప్రసిద్ధికెక్కుతాడు. ఇతని బాల్యమిత్రుడు సాళవ నరసింహరాయలు పెనుగొండలో రాజ్యం చేస్తూండి ఇతనిని పిలిపించి శృంగార పదాలు పాడించుకొని మురిసిపోతాడు. ఆనందంతో అన్నమయ్యను ఎంతగానో సత్కరిస్తాడు. చివరికి తనపై సైతం అలాంటి శృంగార పదాలు చెప్పమని వేడుకోగా అన్నమయ్య తిరస్కరిస్తాడు. హరి నామ స్మరణంతో నానిన నాలుక నరుని నామం స్మరించలేదని గట్టిగా చెప్తాడు. కోపితుడై రాజు అన్నమాచార్యుని శృంఖలాబద్ధుని గావిస్తాడు.

"ఆకటివేళల అలపైన వేళల
తేకువ హరినామమే దిక్కుమఱిలేదు" (5-100)

అనే పదం పాడగానే సంకెళ్ళు ఊడిపోతాయి. వెంటనే అన్నమాచార్యుని మహిమను గుర్తించిన రాజు పాదాక్రాంతుడవుతాడు. ఆ వెంటనే ఘన సత్కారం చేసి పంపించివేస్తాడు. అన్నమాచార్యుడు క్షమించి శ్రీ వేంకటేశ్వరుని సేవకై శేషజీవితాన్ని వినియోగించమని దీవించి తిరుమలకు వెళ్ళిపోతాడు. అక్కడ దినానికొక్క పదం చొప్పున రచన చేసి ఆడిపాడి శ్రీ వేంకటేశ్వరుని అర్చనలో

కాలం గడుపుతూ ఉంటాడు. పుల్ల మామిడిని తియ్య మామిడిగా మార్చడం, నిరుపేద వివాహానికి ధనం సమకూర్చడం మొదలైన మహిమలు సైతం ప్రదర్శిస్తాడు. సంసారిగా ఉంటూ శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తుడై 32 వేల ఆధ్యాత్మ శృంగార సంకీర్తనల్ని రచించి తరించాడు. 1503లో దివ్యధామం చేరుతాడు. పదకవితా పితామహుడని, సంకీర్తనా చార్యుడని ప్రసిద్ధికెక్కుతాడు.

రామదాసు అసలు పేరు కంచెర్ల గోపన్న. ఇతని తల్లిదండ్రులు కామాంబ, లింగన్నలు. రామదాసు క్రీ.శ 1620-1680 దాకా జీవించిన వాగ్గేయకారుడు తెలంగాణా జిల్లాలోని నేలకొండపల్లి పుట్టిన వూరు. అక్కన్న మాదన్నలు మేనమామలు. వైష్ణవం ప్రసాదించిన వాడు రఘునాథ భట్టాచార్యులు. తారకమంత్రం ఉపదేశించినవాడని ఒక ఐతిహ్యము.

కంచెర్ల గోపన్న తండ్రి శిక్షణలో పెరిగినవాడు. బాల రామాయణం చదివే రోజుల్లోనే గోపన్నలో రామభక్తి నాటుకుని వుంది. అంచేతనే "ఆశ పుట్టేనే శ్రీ రాములాతో హాహానే బుట్టానైతిని" అని వేదన పడ్డాడు. రామదాసు మహిమలు నమ్మకానికి సంబంధించిన అంశాలు ఒకటి రెండు ప్రచారంలో ఉన్నాయి. రామదాసుకు ఒక కొడుకు వుండేవాడట. ఒకానొక సంతర్పణ సమయంలో రామదాసు కొడుకు గంజిగుంటలో పడి అచేతనుడయ్యాడు. ఈ విషయం బయటకి పొక్కితే సంతర్పణకు విఘాతం కలుగుతుందని గోపన్న దంపతులు ఆ బాధను గొంతులోనే అణచారు. సంతర్పణ సాఫీగా ముగిసింది. అణచుకున్న దుఃఖం గోదావరి వరదలా పొంగి పొరలింది.

ఎంత పని చేసితివి రామా - నిన్నేమందు
నిన్నేమందు । సార్వభౌమ: రామ
అన్నన్న మాటాడవేరా? నీ
కన్నులను నను జూడవేరా? రామ
చిన్నెలన్నియు దరిగియున్న ఈ చిన్నన్న
గ్రన్నను చూడు మాయన్న? రామ

అని ఆక్రోసించగానే కుమారుడు నిదురనుండి లేచినట్లు లేచాడు.

గోపన్న మేనమామలైన అక్కన్న, మాదన్నల వల్ల గోలకొండ రాజైన అబుల్ హసన్ తానీషా, అబ్దుల్లా తానీషాల పరిపాలనలో భద్రాచలం తహసిల్దారయ్యాడు. తహసిల్దారుగా వుంటూ సర్కారు పైకం ఖర్చు పెట్టి భద్రాచల రామాలయానికి

మరమత్తులు చేయించి, దేవుని కైంకర్యం చేయించి నందుకు గోల్కొండ నవాబు ఆగ్రహానికి గురియై కారాగార శిక్షను పొందుతాడు. పన్నెండు ఏళ్ళు కఠిన కారాగార శిక్షను అనుభవిస్తూ శ్రీ రాముని ఆర్తితో వేడుకుంటూ అనేక కీర్తనల్ని రచించాడు. చివరకు శ్రీ రామ చంద్రుడు సలక్ష్మణుడై వచ్చి పైకం చెల్లించి రసీదు నిచ్చి చెఱవిడిపించినట్లు చెప్పడం జరిగింది.

అన్నమయ్య, రామదాసుల జీవిత విశేషాలను పరిశీలిస్తే కొన్ని సాదృశ్యాలూ, కొన్ని వ్యత్యాసాలూ కనబడతాయి. అవి:

1. ఇరువురూ తెలుగునాట భాగవత శిఖామణులుగా పరమ భాగవతోత్తములుగా గుర్తింపు పొందినారు.

2. ఇరువురూ సాంసారిక జీవితాన్ని అవలంబించారు.

3. బాల్యం నుండి ఇద్దరూ భక్తులుగా రాణించినారు.

4. తానీషా కొలువులో తహసిల్దారుగా ఉద్యోగం చెయ్యడం రామదాసు జీవితకాలంలో జరిగింది. అన్నమయ్యకు జీవితంలో ఉద్యోగ అనుభవంలేదు.

5. ఇద్దరి రచనలూ సహజమైన భక్త్యావేశంలో, తన్మయత్వంలో అప్రయత్నంగా వెలువడినవే కాని సంఖ్యాపరంగా అన్నమయ్య సంకీర్తన సంఖ్య ఎక్కువ. అన్నమయ్య - పురందర దాసు సమాగమంతో సమానంగా రామదాసు - కబీరుదాసుల కలయికను ప్రస్తావించవచ్చు. కబీరు దాసు వల్ల 'గోపన్న' రామదాసైనాడు.

6. రామదాసు కీర్తనల్లో తారకమంత్రము కోరిన దొరకెను, పలుకే బంగార మాయెను, సీతమ్మకు చేయిస్తి చింతాకుపతకము, ఏ తీరుగనను దయచూసెదవో వంటివి ప్రసిద్ధ కీర్తనలైతే, బ్రహ్మ మొక్కటే పరబ్రహ్మ మొక్కటే, నానాటి బదుకు నాటకము, ముద్దు గారే యశోద మొదలైనవి అన్నమయ్య సంకీర్తనల్లో బాగా ప్రాచుర్యాన్ని పొందినాయి.

7. ఇద్దరి జీవితాల్లోనూ మహిమలు ప్రచారంలోకి వచ్చాయి.

8. రామదాసు చరిత్ర ఆధారంగా అతడు బాల్యంలోనే సంస్కృతంలో పాండిత్యం సంపాదించాడని తెలుస్తుంది. గోలుకొండ తురుష్క ప్రభువు కొలువులో అధికారి కాబట్టి పారశీక ఉర్దూ భాషల్లో కూడా పండితుడు

అయివుండవచ్చు. అన్నమయ్య స్వయంగా సంస్కృతంలో వేంకటాచల మాహాత్మ్యం, సంకీర్తన లక్షణం రచించాడు. అన్నమయ్య రచనలో కనపడే పారశీకపదాలు ఆ భాషా వ్యవహారం పట్ల ఆయనకున్న అవగాహనకు నిదర్శనాలు.

9. సర్కారు సొమ్ము ఖర్చుపెట్టి రామాలయానికి మరమ్మత్తులు చేయించి నందుకు రామదాసు గోలకొండ నవాబు ఆగ్రహానికి గురియై కారాగార శిక్ష పొందితే, సాళువ నరసింగరాయలు తనపై శృంగార పదాలు చెప్పమని వేడు కొనగా అందుకు తిరస్కరించి నందుకు అన్నమయ్య రాజుచేత శృంఖలా బద్ధుడవుతాడు.

10. ఇద్దరూ తమశిక్షను భక్తి మాహాత్మ్యం కారణంగా వదిలించుకున్నవారే.

ఆకటి వేళల అలపైన వేళల
తేకువ హరినామమే దిక్కుమఱిలేదు

అన్నపదం అన్నమయ్య పాడగానే సంకెళ్ళు ఊడిపోతాయి. రాజైన సాళువ నరసింగరాయలు అన్నమయ్య మహిమను గుర్తించి పాదాక్రాంతుడవుతాడు.

కారాగార వాసంలో దెబ్బలకు తాళలేక రామదాసు ఎన్నో విధాలుగా కీర్తనల ద్వారా ప్రార్థించి, బ్రతిమాలి, భంగపడి, భయపెట్టి ఉగ్రభక్తితో నిందాపూర్వకంగా కూడా వ్యవహరిస్తాడు. "ఇక్ష్వాకుకుల తిలక ఇకనైనా పలుకవా రామచంద్రా" అని రామచంద్రుని పిలుస్తూ ప్రాకారానికి పదివేల వరహాలయ్యాయనీ, సీతమ్మకు చేయిస్తి చింతాకు పదకమనీ లెక్కలు చెప్పి

"మీ తండ్రి దశరథ మహారాజు పెట్టెనా
మీ మామ జనక మహారాజు పంపెనా
అబ్బతిట్టితినని ఆయాస పడబోకు
ఇంత సొమ్మిదిని ఇటులూరకుంటివా?

అని నిలదీస్తాడు. చివరకు రామ లక్ష్మణులు రామదాసు భటుల వేషంలో వచ్చి నవాబుకు ఆరు లక్షల పైకము చెల్లించి రామదాసు చెరవిడిపిస్తారు. తానీషా జరిగినది తెలుసుకుని తాను భాగవతాపరాధ మొనర్చినందుకు పశ్చాత్తాపపడి రామదాసు పాదములపై వాలతాడు.

11. రామదాసు, అన్నమయ్య ఇద్దరూ అమాయకమైన, నిష్కల్మషమైన,

ఆవేశపూరితమైన భక్తి తత్వానికి ప్రతినిధులుగా అని పిస్తారు. ఇద్దరూ శతకాలు రచించారు. భక్తి భావ వ్యక్తీకరణకు అనువైనది శతకం.

## 1.5. అన్నమయ్య - రామదాసుల రచనలు - తులన:

1. అన్నమయ్య 32,000 పదాలు రచించినట్లు తెలుస్తున్నది. వాటిని శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మ సంకీర్తనలని రెండు విధాలుగా వర్గీకరించవచ్చు. శృంగార మంజరి, అలమేలు మంగపై చెప్పిన వేంకటేశ్వర శతకం ప్రకటితం. మరికొన్ని శతకాలు, ద్విపదలో రామాయణం, వేంకటాచల మాహాత్మ్యం (సంస్కృతం), సంస్కృతంలోనిది గానే చెప్పబడుతున్న సంకీర్తన లక్షణం లభించడం లేదు. అన్నమయ్య సంకీర్తనా చార్యుడుగా, పద కవితా పితామహుడుగా గుర్తింపు పొందినాడు.

రామదాసు రచనలు దాశరథీ శతకం, సుమారు 137 సంకీర్తనలు. రామదాసు రచనలను విషయ వివేచన దృష్ట్యా నామ గుణ కీర్తనలని, ఆత్మనివేదకాలని, తాత్వికాలని మూడు రకాలుగా వర్గీకరించ వచ్చని; కాలక్రమాన్ననుసరించి తొలి కీర్తనలని, బందికానా కీర్తనలని, మలి కీర్తనలని వర్గీకరించ వచ్చని డా॥ బిరుదురాజు రామరాజు గారి అభిప్రాయం. తెలుగులోనేకాక సంస్కృతంలో కూడా రామదాసు ముద్ర ఉన్న కీర్తనలు ఐదింటిదాకా ఉన్నాయి.

ఇద్దరూ వైష్ణవులే. అన్నమయ్య ప్రధానంగా శ్రీ వేంకటేశ్వరునీ, రామదాసు శ్రీ రామునీ కీర్తించినా వీరిరువురి రచనల్లో ఇతర దేవతా సంకీర్తనలు కూడా కనిపిస్తాయి. ఇరువురి సంకీర్తనల్లోనూ నవవిధ భక్తిరీతుల ఆవిష్కరణ కనపడుతుంది.

శ్రవణం, కీర్తనం
స్మరణం, పాదసేవనమ్
అర్చనం, వందనం, దాస్యం
సఖ్యమాత్మ నివేదనమ్ అన్న నవవిధ భక్తిరీతుల ప్రస్తావన కనబడుతుంది.

అన్నమయ్య నవవిధ భక్తుల్ని ఒక పదంలో ఇలా పేర్కొన్నాడు.

నిత్యసుఖానందమిదె నీ దాస్యము
సత్యములేని సుఖాలు చాలు (జాలునయ్య
కన్నచూపుల సుఖము కడునీ చక్కనిరూపె
యెన్నగ వీనుల సుఖమిదె నీ పేరు
పన్ని నాలుక సుఖము పాదపునీతులసి

వున్న సుఖముల తెరువాడ (బడమయ్యా
తనువుతోడి సుఖము తగునీ కైంకర్యము
మనసులో సుఖము నీ మంచి ధ్యానము
పనివినీ యూర్పు సుఖము పాద పద్మము వాసన
యెనయని పెరసుఖ మేమి సేసెనయ్యా
పుట్టుగుకెల్ల సుఖము పొల్లులేని నీ భక్తి........

ఇలా నవవిధ భక్తులను అనేక సంకీర్తనల్లో రచించాడు. ఉదా॥

-వినరో భాగ్యము విష్ణుకథ
వెను బలమిదివో విష్ణుకథ
-చాలదా బ్రహ్మమిదీ సంకీర్తనం మీకు
జావెల్ల నడగించు సంకీర్తనం
సంతోషకరమైన సంకీర్తనం
సంతాపమణగించు సంకీర్తనం.......
.....................................................
-సంతతము దలచుడీ సంకీర్తనం
-శ్రీమన్నారాయణ, శ్రీమన్నారాయణ
శ్రీమన్నారాయణ శ్రీ పాదమే శరణు
-విడువ విడువ నింక విష్ణుడు నీ పాదములు
కడగి సంసారవార్ధి కడముంచు కొనిన
-అరసి నన్నుగాచి నాతనికి శరణు
పరము నిహమునేలే పతికి శరణు
వేదములు దెచ్చినట్టి విభునికి శరణు
.......................................................
శ్రీదేవి మగడైన శ్రీపతికి శరణు

రామదాసు నవవిధ భక్తులను

రామరామ శ్రీరామ రామ
రామయనరాదా మనసా
కామిత ఫలదుడగు శ్రీ సీతా
కాంతుని గనరాదా మనసా (63)

శరణా గత రక్షణ బిరుదనీ
శరణంటి గదయ్యా (110)
శ్రీరామ నీనామ మేమి రుచిరా (108)
శ్రీరామ నామమే జిహ్వకు స్థిరమై యున్నది
శ్రీరామ నీదయ రాదుగా పతితపావనా (69)

మొదలైన కీర్తనల్లో వర్ణించాడు. ఇద్దరూ భక్తి సుఖానుభూతిని మనసారా అనుభవించి, అనుభవైకవేద్యమైన ఆభక్తి భావనను భక్తులకు అందించి తరించారు.

2. అన్నమయ్య రామదాసు రచనల్లో ఆర్తి ప్రధానంగా కనిపిస్తుంది. అన్నమయ్యలో మధుర భక్తిభావన కూడా అధికం. వారి భక్తిలో సంతోష పారవశ్యం, ప్రార్థన, ఆత్మనివేదన బాగా కనిపిస్తాయి. శృంగార సంకీర్తనలు అన్నమయ్య ప్రత్యేకత. వేంకటేశ్వరుడు కథానాయకుడుగా ఉదాత్తమైన శృంగార వర్ణన చేశాడు అన్నమయ్య. భక్తి భావ పూరితమైన ఆధ్యాత్మ సంకీర్తనల్లో అన్నమయ్య రామదాసు భక్తి కీర్తనలకు సమాన లక్షణంతో కనిపిస్తాడు. అన్నమయ్య అలమేలు మంగగా మారి

"నీ మహిమ నాలోన నిండిన వలపు జాడో
యేమి సేతు నన్నెప్పుడు నెడవకుమయ్యా"

అని వేంకటేశ్వరునితో సంభాషిస్తాడు. మనోజ్ఞమైన శృంగార భావన ఆధారంగా ఆత్మ పరమాత్మల సంయోగమనే మనోజ్ఞమైన శృంగార భావన ఆధారంగా ఆత్మ పరమాత్మల సంయోగమనే మహాయోగాన్ని, బ్రహ్మానందాన్ని మధురభక్తిప్రపూరితంగా వర్ణించడం అన్నమయ్య సంకీర్తనల్లో ప్రస్తావించదగిన విశిష్ట లక్షణం.

3. ఎత్తుగడలో భగవంతుని వాసస్థానాన్ని వర్ణించే సందర్భాల్లో ఒకటి రెండు సందర్భాల్లో ఇద్దరి రచనల్లో పోలిక కనబడుతుంది.

**(ఎ) అన్నమయ్య-**

"అదిగో అల్లదిగో హరివాసము
పదివేల శేషుల పడగల మయము
అదె వేంకటాచల మఖిలోన్నతము
అదిగో బ్రహ్మాదులకపురూపము
అదివోనిత్య నివాసమఖిలమునులకు
నదెచూడుడదె మొక్కుడానందమయము"

అంటే, రామదాసు

ఇదిగో భద్రాద్రీ - గౌతమి అదిగో చూడండి
ముదముతో సీతా ముదిత లక్ష్మణులు
కదసి కొలువగా రఘుపతి యుండెడి ॥ఇదిగో॥

చారు స్వర్ణ ప్రాకార గోపుర
ద్వారములను సుందరమై యుండెడి - భద్రాద్రిని సుందరంగా కీర్తనలో వర్ణిస్తాడు.

**(బి) రామదాసు**

"కంటిమా రాములను కనుగొంటి నేను
కంటి నేడు భక్తి గణముల బ్రోచు మా
యింటి వేలుపు భద్రగిరి నున్న వాని ॥కంటి॥

అంటాడు. అన్నమయ్య కలలో శ్రీ వేంకటేశుని గాంచి ఇలా పాడుకుంటాడు.

ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి
అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతి లేని గోపుర ప్రభ గంటి" -

ఇద్దరూ తమదేవతా మూర్తి స్వరూపాన్ని గాంచి పరవశించిన వారే.

**4.** భద్రాచల రామదాసు కీర్తనలకు రాముడే కేంద్రం. తిరుమల వేంకటేశ్వరుడు అన్నమయ్య సంకీర్తనలకు మూలవిరాట్టు. అయినా అన్నమయ్య ఇతర దేవతలను స్తుతించిన సందర్భాలు ఉన్నాయి. ఆయా ప్రాంతాలను సందర్శించినపుడు ఆయా దేవతా మూర్తులను అన్నమయ్య కీర్తించినాడు. నరసింహస్వామి, శ్రీరాముడు అన్నమయ్య స్తుతికి కేంద్రమయ్యారు. ఒంటిమిట్ట, గండికోట, వావిలిపాడు (వాయల్పాడు, చిత్తూరు జిల్లా) విజయనగరము, తిరుమల (వేంకటాద్రి) ప్రాంతాల్లో వెలసిన శ్రీరాముని అన్నమయ్య వర్ణించాడు. శృంగార సంకీర్తనల్లో కంటే ఆధ్యాత్మ సంకీర్తనల్లో శ్రీరాముని వర్ణన లధికంగా ఉన్నాయి. అన్నమయ్య రామాయణాన్ని ద్విపదకావ్యంగా కూడా రచించినాడు. అంతేకాకుండా రామకథను ఒకే సంకీర్తనలో వెలయించినాడు.

"రాముడిదే లోకాభి రాముడితడు
గోమున పరశురాము కోపమార్చెనాడటరే
యీతడా తాటకి ( జంచె యీపిన్నవాడు
ఆ తల సుబాహు(గొట్టి యజ్ఞము ( గాచె

..................................................
రామణుజంపి సీతమరల(దెచ్చెను"
శ్రీ వేంకటేశు(డితడా సిరులనయోధ్యయేలె
కావున నాటికి నేడు కంటిమిట్టెకదరె

ఈ విధంగా రామకథాగానం అన్నమయ్య చేశాడు. కాని ఏ దేవుని వర్ణించినా అన్నమయ్య 'వేంకటపతి' ముద్రను మాత్రం విడువలేదు.

**రామాయణ కథ - అన్నమయ్య సంకీర్తన:**

కౌసల్యా నందన రామ కమలాప్తకుల రామ
భాసుర వరద జయ పూర్ణరామ
మునుప దశరథ రాముడవై తమ్ములు నీవు
జనించి తాటక( జంపి జన్మముగాచి
వెనుకొని హరువిల్లు విరిచి సీత( బెండ్లాడి
సుప్పనాతి శిక్షించి సారిది రుషులగాచి
అప్పుడే ఖర దూషణాదుల గొట్టి
చొప్పుతో మాయామృగము సోదించి హరియించి
కప్పి హనుమంతు బంటుగా నేలు కొంటివి
సొలసి వాలినడ(చి సుగ్రీవు ( గూడుక
జలధి బంధించి లంక సాధించి
వెలయ రావణు గెల్చి విభీషణుని మన్నించి
చెల(గితి వయోధ్యలో శ్రీ వేంకటేశుడా (2-275)

ఇది రామాయణ కథా వస్తువైన అన్నమయ్య సంకీర్తన.

5. సంకీర్తనల ప్రాచుర్యం విషయంలో అన్నమయ్యతో పోలిస్తే రామదాసు కీర్తనలు ఏమాత్రం తక్కువ కావు. ఇరువురూ ప్రజలు ముఖ్యంగా భక్తుల నాలుకలపై తమ సాహిత్య రూపంలో నర్తించిన వారే. అందుకు వారు ఎన్నుకున్న గేయ ఫణితులే కారణం. ముఖ్యంగా అన్నమయ్య పద కవితకు పట్టం కట్టి పామర

జనుల్లో భక్తి భావ ప్రచారానికి కారణమైయ్యాడు. అందుకే ఆయన భాష గురించి "ఈతని రచన తిక్కన రచనవలె దేశీ మాండలిక పద బాహుళ్యము. వాక్య నిర్మాణము గూడా మనము వ్యవహరించునపుడు మాటలాడు నట్టిదిగా అక్కడక్కడా దోచుచుండును'' అంటారు గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు. అంతేకాకుండా "అన్నమయ్య తరువాత వెలసిన పదకర్తల కెందరికో మార్గదర్శి. ఈయన రచించిన శృంగార సంకీర్తన రచనా విధానము క్షేత్రయ్య, సారంగపాణి మొదలగు కవులకు ఆదర్శవంతమైనది.

అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనములు మునిపల్లె సుబ్రహ్మణ్య కవి రచించిన ఆధ్యాత్మిక సంకీర్తనములకు, కంచెర్ల గోపన్న సంకీర్తనలకు, నాదోపాసకుడైన త్యాగయ్యకు ఆధారములైనవి'' అని డా॥ గుమ్మా సాంబశివరావుగారు అన్నమయ్య ప్రభావాన్ని ప్రస్తావించారు. (పుట 325)

అన్నమయ్య సంకీర్తనల్లో లాలిపాటలు, జోల పాటలు, ఉయ్యాల పాటలు, డోలలు, ఉగ్గు పాటలు, దోబూచులు, రోకటి పాటలు, సువ్విపాటలు, తుమ్మెద పాటలు, మంగళహారతులు, జాజర పాటలు, గొబ్బిళ్ళ పాటలు, ఏల పాటలు అల్లోనేరెళ్ళు, చల్ల అమ్మకపు పాటలు, సోది పాటలు, కోలాటపు పాటలు, చిందులు మెదలైనవి అన్నీ జానపద బాణీలే. ఆధ్యాత్మిక సంకీర్తనల్లో కూడా

-"జీవాతుమై యుండు చిలుకా - నీ
నా నవలకి బరమాత్ముడనై యుండు చిలుకా

- తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన

- ఇందునందుఁ దిరుగుచు నెవ్వరివాడవుగాక
బందె పసరమువైతి బాపు జీవుడా

-పారకుమీ వోమనసా-పంతము విడువకు ఓ మనసా
పారిన నీవె బడగయ్యెదవు చెరువ నాడె చెప్పనే మనసా

- ఎన్ని బాధలు బెట్టియేచెదవు నీవింక నెంత కాలము దాక గర్మమా
మన్నించమనుచు నీమఱగు జొచ్చితిమి మా మాటాలకించవో కర్మమా

- ఏమీ నెఱగని నాకేడ పుణ్యము
తామసుడ జుమ్మీ ముందర నున్న దైవమా

..............................................................

రాతి బొమ్మ జుమ్మొ భారము నీది దైవమా

వంటి జానపద బాణీలు అన్నమయ్య సంకీర్తనల ప్రాచుర్యానికి ముఖ్య కారణాలు. అన్నమయ్య తాను పాడుతూ క్రమంగా తన పాటలు భజన పాటలుగా వ్యాప్తి చెందడానికి కారణమయ్యాడు. జానపద గేయ రీతులలో సంకీర్తనలు రచించి దేశి సాహిత్యానికి అన్నమయ్య విశిష్ట స్థానం కల్పించాడు. అంతే ప్రాచుర్యం పొందిన రామదాసు కీర్తనలు 'శ్రీరామ నీ నామమేమి రుచిరా', 'పలుకే బంగార మాయెనా', 'ఏ తీరుగ నను దయచూచెదవో ఇన వంశోత్తమ రామా', 'రామచంద్రాయ జనకరాజజా మనోహరాయ మామకాభీష్ట దాయ మహిత మంగళం', తారక మంత్రము కోరిన దొరకెను ధన్యుడనైతిని ఓరన్నా" మొదలైనవి

"తాళ్ళపాక అన్నమయ్య కాలం నాటికి సంకీర్తనగా ప్రారంభించిన కీర్తన రామదాసు కాలం నాటికి భజన కీర్తనగా, ఆధ్యాత్మ కీర్తనలుగా పరిణిమించి త్యాగయ్య కాలం నాటికి ధాతు కల్పనలతో విస్తరించి కృతి స్వరూపం సంతరించుకున్నది. అలాగే అన్నమయ్య కాలంలో పల్లవి మూడు చరణాలు గల రచనలకు ప్రాధాన్యముంటే రామదాసు కాలం నాటికి అనుపల్లవులతో కూడిన కీర్తనల రచన వెలుగులోకి వచ్చింది. ఈ విధానమే చరణాను పల్లవులతో త్యాగరాజాదులకు కృతి రచనల్లో మార్గదర్శకమైయ్యింది."

"పాడే విధానాన్ని గురించి పట్టి చూసినపుడు రామదాసు రచన బృందంగా పాడినపుడు రక్తికడుతుంది. ఎన్ని గొంతులు కలిసినా శ్రావ్యంగా వినిపించే పదబంధం రామదాసు కీర్తనల్లో సహజంగా వుంది. అంచేతనే భజన గోష్ఠులలో రామదాసు కీర్తనలకున్న ప్రసిద్ధి ఇతరుల కీర్తనలకు లేదు. సంగీత పరిచయం ఏ మాత్రం వున్నా చాలు రామదాసు కీర్తనలు అవలీలగా పాడుకోవచ్చు" అని అంటారు డా॥ కె.సర్వోత్తమరావుగారు (రామదాసు-త్యాగయ్య - 1984).

"రామదాసు కీర్తనలకు అన్నమాచార్య సంకీర్తనలకున్నంత సాహిత్య గౌరవంగాని, త్యాగరాజు కృతులకున్నంత సంగీత ప్రతిపత్తిగాని లేకపోవచ్చుగాక, సామాన్య ప్రజలలో, భజన కూటములలో సర్వత్రాస్మరింపబడి కీర్తించబడే కీర్తనలు రామదాసు కీర్తనలే అనే విషయం సర్వజనైకవేద్యం. రామదాసు కీర్తనలకున్న ప్రజాదరణ (Popularity) అటు వంటిదని స్పష్టమౌతుంది" - అంటారు డా॥ ఎన్. గంగప్ప గారు.

## అన్నమయ్య-రామదాసు కీర్తనలు - అనుకరణలు:

శ్రీరామ భక్తుల్లో ప్రసిద్ధుడుగా పేరెన్నికగన్నవాడు రామదాసు. ఆయన సంగీత సాహిత్యాల్లో నిష్ణాతుడైనప్పటికీ తాననుభవించిన బాధలలో నుండి రామభక్తి భావనను సంపూర్ణంగా అనుభవించి, తడిసి పునీతుడై లలితమైన, మధుర మనోహరమైన గీతాలు కరుణాన్వితంగా, భక్తి భావ ప్రపూరితంగా రచించినాడు. ఆయన కీర్తనలు అనేకం బహుళంగా ప్రచారంలో ఉండడం మాత్రమే కాకుండా, ఎందరో భక్తకవులు రామదాసు కీర్తనలను అనుకరిస్తూ భజన కీర్తనలు వెలువరించారు. శ్రీ రామ నీనామమెంతోరుచిరా, ఏ తీరుగ నను దయ చూచెదవో, నను బ్రోవమని చెప్పవే, అదిగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి, పాహిరామ ప్రభో పాహిరామ ప్రభో వంటి గేయాలకు అనుకరణలు చాలా వచ్చాయి.

అన్నమయ్య రచించిన భావములోనా బాహ్యము నందున, అదిగో అల్లదిగో శ్రీహరివాసము, నారాయణతే నమోనమో, తందనానా భళా తందనానా, ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు, బ్రహ్మ కడిగిన పాదము, కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు వాడు అన్న సంకీర్తనలను అనుకరిస్తూ భజన కీర్తనలు రచింపబడినాయి. ఒక పాటగాని గేయంగాని సంకీర్తన గాని బాగా వుండి జనంలో ప్రచారం పొందినప్పుడే అనుకరిస్తూ ఇతరులు గీతాలు రాస్తారు. ఆ విధమైన అనుకరణలు సామాన్యుల్లో భజన బృందాలలో వ్యాప్తిలోకి రావడం అన్నమయ్య రామదాసుల కున్న జనాదరణకు నిదర్శనంగా చెప్పవచ్చు.

ఉదా: భావములోనా బాహ్యము నందున పాటను అనుకరిస్తూ విఘ్నేశ్వరుని

పాట:- భావములోనా బాహ్యము నందున గణేశా గణేశాయని కొలువవో మనసా

2. నారాయణతే నమో- వీరబ్రహ్మతే నమోనమో, సిద్ధయసన్నుత నమోనమో
   రామదాసు:-

శ్రీరామ నీనామ మెంతో రుచిరా - ఓహరనాధ నీ నామ మెంతో రుచిరా
ఏ తీరుగ నను దయజూచెదవో - ఏ తీరుగనను దయ
జూచెదవో పాండ్య వంశోత్తమ అయ్యప్పా.

## 6. గేయ రచనల్లో ఒక పద్ధతి సంవాదాత్మక గేయ రచన:

రామదాసు అన్నమయ్య రచనల్లో వ్యష్టిగానానికి ఉద్దేశింపబడిన రచనలే

కాకుండా సంవాదగానం లేదా యుగళగానానికి అనువైన సంవాద రచనలు ఉన్నాయి. ముఖ్యంగా అన్నమయ్య సంకీర్తనల్లో అటువంటి సంవాద సంకీర్తనలు రామదాసు కీర్తనలతో పోలిస్తే ఎక్కువ. బావా మరుదుల సంవాదములు అత్తాకోడళ్ళు, గోపి గోపకులు, చెంచువాండ్లు, చెలుల మధ్య, వదిన మరిది మధ్య, శ్రీ వేంకటేశునికీ చెంచెతకు, శ్రీ వేంకటేశునకు ఎఱుకత, చెంచిత నాయకలతో సంవాదరూపంలో సాగిన సంభాషణాత్మక సంకీర్తనలను అన్నమయ్య రచించాడు. దీన్ని Discourse Style అనవచ్చు.

రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్య పొందులు నీతో చాలును

ఇది అత్తాకోడళ్ళ సంవాదము. అటువంటి రచన రామదాసులో కూడా కనబడుతుంది. కానీ చాలా తక్కువ.

ఉదా: పాదుషా వాక్యం: రండి గోపన్న గారూ - మాపైక మిప్పించండి వేగమే మీరు

భూమండలములోన గోలకొండ తురక వాడు చాల చండలని సుంతైన నీ గుండెలో నుంచవైతి

గోపన్న గారి వాక్యం:

వినుడీ తానీషాగారు ఏలనాపైనుద్దండ కోపం చేసేరు కండక్రొవ్వు చేతను, తుంటరికము చేయను. భూమండలములోను మీ కీర్తి నిండా గల్గజేసినాను "వినుడీ" ఇలా సాగుతుంది కీర్తన.

మరొక కీర్తన:

తానీషా: ఏ దేశమున నుండువారూ - మీరు ఎందుండి ఇట వచ్చినారు
రామలక్ష్మణులు: తొలుత గోదావరి యందు-మాస్థలము భద్రాచలమందు
తానీషా: ఎవరి జవానులు మీరూ - మిమ్మెవరు పంపగవచ్చినారు
రా : దాస జవానులు మేమూ - రామదాసు పంపగ వచ్చినాము.

ఈ బాణీలో ప్రత్యేకమైన రామదాసు బాణీ 'తల్లి సీతమ్మ ద్వారా ప్రార్థన'. ఆమెను తన గురించి శ్రీ రామునికి విన్నవించమని కోరడం. ఇది అన్నమయ్యలో కనబడదు.

- నను బ్రోవమని చెప్పవే-సీతమ్మ తల్లి నను బ్రోవమని చెప్పవే
- రామ చంద్రులు నాపై - చలమూ చేసినారు సీతమ్మ చెప్పవమ్మా!

రామదాసు కీర్తనల్లో దుఃఖం, అక్కడక్కడా కనబడుతుంది. ఇది ప్రత్యేకత తానీషా రామదాసును బంధించి కారాగార వాసంలో ఉంచినప్పుడు పాడిన కీర్తనల్లో దుఃఖం, ఆర్తి, రామునిపై ఆక్రోశం వ్యక్తమైనాయి.

ఉదా:- ఎటుబోతివోరామ ఎటుబోతివో
- ఏల దయరాదో రామయ్యా నీకేల దయరాదో
- పాహి రామప్రభో పాహిరామప్రభో
- ఇక్ష్వాకు కుల తిలక యికనైన బలుకవె రామచంద్రా-
  నన్ను రక్షింపకున్నావు - రక్షాకులెవరయ్యా రామచంద్రా
- రామ చంద్రులు నాపై చలము చేసివారు సీతమ్మా చెప్పవమ్మా
- పాహిమాం శ్రీ రామాయంటే పలుకవైతివే
- రక్షించు దీనుని రామరామ నీరమణి తోడు
- రామ నను బ్రోవరాగద - నన్ను గన్న సీతా రామదాసు
  భామా మణికైన జాలి లేదా - నా మీద మీకు -

పంద్రెండేండ్లు ఘోర నరకం కారాగారంలో అనుభవిస్తూ ఆర్తితో దుఃఖంతో రాముని వేడుకుంటు ఎన్నో కీర్తనలు రచించినాడు.

7. భాషాపరంగా చూస్తే అన్నమయ్య, రామదాసుల్లో కనిపించే సామాన్య లక్షణం ప్రజల భాషను ఆదరించడం. అంతేకాకుండా సంస్కృత పద ప్రయోగం, అన్యభాషా పద వినియోగం వారిలో కనిపిస్తుంది. "రామదాసు చరిత్ర పుస్తకాలను బట్టి, అతడు బాల్యంలోనే సంస్కృతాంధ్ర భాషల్లో పాండిత్యం సంపాదించినట్లు తెలుస్తుంది. గోలుకొండ తురుష్క ప్రభుత్వంలో అధికారి గనుక పారశీక, ఉర్దూ భాషల్లో కూడా పండితుడై ఉండాలి." అంటారు బాలాంత్రపురజనీ కాంత రావు గారు.

- 'వందే రఘురామా శుభనామ' అన్న కీర్తనలో
  కనకమణిమయ హారా సుకుమార
  సుకుమార పంక్తి రథ కుమార
  సువిహార అరిసూర - భూధర ధీర కల్మష దూర
  పాలిత హరణ దారుణ కారణమురహరణ
  రఘు వీర నీదరాభా విమల శరీర నిర్వికారా' అంటాడు

రామదాసు తక్కిన అన్ని చరణాలు సంస్కృత పదభూయిష్టంగా సాగుతాయి. 'కోదండరామ కోదండరామ' అన్న కీర్తనలో కూడా సంస్కృత పద ప్రయోగం ఎక్కువ. రామదాసు సంస్కృత కీర్తనలో ప్రసిద్ధి పొందినవి భజరే మానస రామం, భజరే శ్రీ రామం, వందే విష్ణుం దేవ మశేష స్థితి హేతుం, కుండల రుచిరం లలితకపోలం మొదలైనవి. ఇవి రామదాసు సంస్కృత భాషా ప్రావీణ్యానికి నిదర్శనాలు. ఇక రామదాసు రచనలో శ్రీ మహా విష్ణువుకున్న కేశవాది చతుర్వింశతి నామాలను రామచంద్రుని పరంగా చెబుతూ రచించిన 'చూర్ణిక' వుంది. 'చతుర్వింశతి నామ ప్రతిపాదక చూర్ణిక' అని రామదాసు చూర్ణిక పేరు. రామదాసు రచించిన ఈ దీర్ఘ సమాస భూయిష్టమైన చూర్ణికను భద్రాచల దేవాలయంలో ఏకాంత సేవ సందర్భంలో చదవడముంది. అన్నమయ్య రచనల్లో కూడా చూర్ణికలున్నాయి. ఇతర భాషా పదాలు కూడా ఇద్దరూ ఉపయోగించారు. జవాను బైరోజి, సర్కారు, తమాషా, ఖైదు, ఖజానా, రసీదు మొదలైన హిందూస్థానీ పదాల వాడుక రామదాసు కీర్తనల్లో ఉంది. ఇక అన్నమయ్య సంస్కృత భాషా ప్రావీణ్యానికి నిదర్శనం ఆయన సంస్కృతంలో రచించిన సంకీర్తనా లక్షణమే. ఉర్దూ, హిందీ, అరబ్బీ, కన్నడం, తమిళ భాషా పదాల వాడకం అన్నమయ్య సంకీర్తనల్లో కనబడుతుంది.

ఉదా: జగడం, జూటు, కబురు, ఫౌజు, అప్పణి, పెరుమాళ్ళు, తిరువాముడి మొ॥

8. అన్నమయ్య సంకీర్తనలు సంఖ్యాపరంగా రామదాసు కీర్తనలతో పోలిస్తే చాలా ఎక్కువ. అందువల్ల అలంకారాలూ, అష్టాదశ వర్ణనలు ఎక్కువగా అన్నమయ్య రచనలలో ఉండే అవకాశముంది. అన్నమయ్య పదకవితా పితామహుడు, ద్విపద కావ్య కర్త (శృంగార మంజరి) శతక కర్త, బహు భాషావేత్త, లక్షణ కర్త (సంకీర్తనా లక్షణము). అన్నమయ్యలో సాహిత్య పరంగా విస్తృతి, వైవిధ్యం ఎక్కువ. రామదాసు కీర్తనలు సంఖ్యలో తక్కువైనా ప్రాచుర్యంలో అన్నమయ్య సంకీర్తనలకే మాత్రం తీసిపోవు. అయినంతలో శబ్దాలంకార ప్రయోగం రామదాసులో కూడా కనబడుతుంది.

ఇబ్బంది నొందిన యాకరి బొబ్బ పెట్టినంతలో
గొబ్బున గాచితివట జాగు సేయక
నిబ్బరముతో నేనెంత కబ్బమిచ్చి వేడుకున్న
తబ్బిబ్బు జేదవు రామ అబ్బబ్బబ్బబ్బ -
- ధీరునకు వనధిగంభీరునకు దుష్ట
హారునకు ఘనమణీ - హారునకునూ

హారడిండీర నీహార హీరటీర
తారాళికీర్తివి - స్తారునకునూ

9. సంఖ్యలో తక్కువైనా సామాన్య జనులకు తన కీర్తనల ద్వారా నీత్యు పదేశం రామదాసు చేశాడు. రామదాసులో భక్తితో పాటు నీతి వైరాగ్యాలున్నాయి.

'నరహరి నమ్మక నరుల నమ్మితె
నరజన్మ మీడేరునే ఓమనసా
చెఱకులుండగ వెట్టి చెఱకులు నమిలితె
జహ్వకు రుచి పుట్టునా ఓమనసా
..............................................
భద్రగిరీశుపై భక్తిలేని నరుడు
పదమును గన నేర్చునే ఓమనసా'

అంటాడు రామదాసు. బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే అని సర్వజన సమానతను అన్నమయ్య చాటినాడు. 'మనుజుడై పుట్టి మనుజుని సేవించి అనుదినము దుఃఖమందనేల' అని ప్రశ్నిస్తాడు. 'ఎక్కువకులజుడైన హీనకులజుడైన నిక్క మెరిగిన మహిమాన్వితుడే ఘనుడు', 'నానాటి బ్రతుకు నాటకము', అప్పులేని సంసారమైన పాడేచాలు, తప్పులేని జీత మొక్క తారమైనఁజాలు', అని అన్నమయ్య సందేశమిస్తాడు. నీత్యు పదేశం చేస్తాడు.

10. అన్నమయ్య రామదాసుల రచనల్లో ఆనాటి రాజకీయ, సాంఘిక పరిస్థితుల ప్రతిఫలనాన్ని పరిశీలిస్తే రామదాసు కీర్తనల్లో తానీషా, భద్రాద్రి, గోదావరి మొ॥ ప్రస్తావననే కనబడుతుంది. అన్నమయ్య సంకీర్తనల్లో నాటి ప్రజా జీవితం, ఆనాటి రాజకీయాలు, ప్రభుత్వ పరిపాలనా విధానం, రాచరికం, యుద్ధం, ఆర్థిక వ్యవస్థ, ఆలయోత్సవాలు, సేవలు, పండుగలు, పెండ్లి పేరంటాలు, సాంఘికాచారాలు, విశ్వాసాలు, భిన్నజాతులు, కులగోత్రాలు, వృత్తి వ్యాపారాలు, కళలు, ఆటపాటలు, గృహోపకరణాలు, అలంకార విశేషాలు మొదలైన విషయాలెన్నో కనబడతాయి. అన్నమయ్య కీర్తనల విస్తృతి అందుకు కారణం. అన్నమయ్య ఒక సంకీర్తనలో "సొంపుగ నీ వదనపు సోమశిల కనుమ"లో దొంగలసాని కనుమ, సోమశిల కనుమ, గద్దెరాతి కనుమ, ఎఱ్ఱశిల కనుమ, గుబ్బలి కొండ కనుమ, మంతనాల కనుమ' అని ప్రాంతాన్ని వ్యక్తం చేశాడు.

11. రామదాసు కీర్తనల్లో సీతమ్మ ద్వారా శ్రీరాముని వేడుకోవడం ప్రత్యేకతగా

చెప్పుకున్నట్టే అన్నమయ్యలో వేంకటేశ్వరుని అభయహస్తం, పాదం కేంద్రంగా చేసుకుని వర్ణన చేయడం ఆకట్టుకున్న రచనా విధానంగా అని పిస్తుంది.

"ఇందరికి నభయంబు లిచ్చు చేయి
కందువగు మంచి బంగారు చేయి"
వెలలేని వేదములు వెదకి తెచ్చిన చేయి
-బ్రహ్మ కడిగిన పాదము

బ్రహ్మము తానెయైన పాదము - ఈ సంకీర్తనలు బహుళ ప్రచారము పొందాయి.

## 1.6 ముగింపు:

భారత దేశం భక్తి భావానికి కేంద్రం. అనాది కాలం నుంచి ఉత్తర దక్షిణ భారత దేశాల్లో భక్తితత్వం వ్యాపించి సామాన్యజన సముదాయానికి నీతి వైరాగ్యాల వ్యాప్తికి కారణమైయ్యింది. భక్త కవులందరూ నీతి ప్రాధాన్యంగల గేయాన్ని స్వీకరించి తమ పదాలు, సంకీర్తనలు, కీర్తనలు, పాటల ద్వారా ప్రజలకు చేరువైయ్యారు. ప్రజల భాషలో దేశీయరీతిని అనుసరించారు. వీరిలో అన్నమయ్య సంకీర్తనా చార్యుడు. పదకవితా పితామహుడు. భక్త రామదాసు భక్తి నీతి వైరాగ్య భావాలను తను భజన సంకీర్తనల ద్వారా, కీర్తనల ద్వారా ప్రచారం చేసిన మహాభక్తుడు. వీరిలో అన్నమయ్య సంకీర్తనలు రామదాసు కీర్తనలతో పోలిస్తే సంఖ్యాపరంగా అధికం. వీరిరువురి రచనలు తులనాత్మక దృష్టితో అధ్యయనం చెయ్యడం వల్ల మరిన్ని విశేషాలు స్పష్టమౌతాయి. ఆదిశలో పరిశోధకులు కృషి చేపట్ట వలసి వుంది. తులనాత్మక పరిశీలన వైవిధ్యంలోని ఏక రూపతను ఎత్తి చూపుతుంది. సమన్వయ సాధనకు, సర్వమానవ సౌహార్ద్రతకు మార్గం సుగమం చేస్తుంది.

## సంప్రదించిన రచనలు

1. తెలుగు వాగ్గేయ కారుల కీర్తనలు - 'సంకలనం' - వారణాసి అభితుకుచలాంబ - 2004.
2. అన్నమాచార్య - ప్రముఖ వాగ్గేయ కారులు - తులనాత్మకధ్యయనం - ఎన్. గంగప్ప - 1992
3. అన్నమాచార్య సంకీర్తనలు -తి.తి.దే. ప్రచురణలు
4. భక్తి సాహిత్యం-ఆధునిక భజన కీర్తనలు - డా॥ ఎం. సుధాప్రియ-2002

5. అన్నమాచార్య సంకీర్తన సుధ
- ఆచార్య ఎన్. గంగప్ప - 1995

6. రామదాసు-త్యాగయ్య
- డా॥ కె. సర్వోత్తమన్ - 1984

7. తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు
- డా॥ వేటూరి ఆనంద మూర్తి - 1976

8. ఆంధ్రుల కీర్తన వాఙ్మయ కళాసేవ
- ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ - 1982

9. అన్నమాచార్య సంకీర్తనములలోని వర్ణనలు
- డా॥ గుమ్మాసాంబశివరావు - 1990

10. తులనాత్మక సాహిత్య వ్యాసాలు -తులనాత్మక అధ్యయన కేంద్రం
- పొట్టి శ్రీ రాములు తెలుగు విశ్వవిద్యాలయం - 2004.

# రామదాసు కీర్తనలు - భావుకత

డా. సిహెచ్. లక్ష్మణచక్రవర్తి

**తె**లుగు సాహిత్యంలో పద కవితకు ప్రత్యేక స్థానం ఉంది. ఇప్పటికి తెలుగు కొంతలో కొంత బ్రతికి ఉందంటే అందుకు కారణం కీర్తన సాహిత్యమే. ఇటీవలి కాలంలో పాటలుపాడాలని, నేర్చుకోవాలని అనుకున్న సంగీతాభిమానుల పుణ్యమా అని సాహిత్యం జనుల నోళ్ళలో నానుతుంది. ఇటువంటి సాహిత్యానికి ఆదరణ కూడా పెరిగింది. భారతీయ సాహిత్యాన్ని బాడాల రామకవి గారు ఆశ్రమ, ఆశ్రయ, అనుభవ కవిత అని మూడు రకాలుగా విభజించారు. ఇందులో మూడో వర్గానికి చెందిన వారు శతకకవులు, వాగ్గేయకారులు. ఈ వాగ్గేయ కారులలో కూడా ఎక్కువగా అనుభవం పునాదిపై రచన చేసినవాడు దామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న.

అనుభవం వైయక్తికమైనప్పుడు అతను వెలువరించే భావాలు కూడా వ్యక్తి గతమైనవిగా ఉంటాయి. అటువంటి వ్యక్తిగత భావాల సమాకలనం రామదాసు కీర్తనలు. రామదాసు కీర్తనలు అనుభూతి ప్రధానమైనవి కావు. అందులో ఆలంకారిక శైలి ఉండదు. సంగీత, సాహిత్యాల స్థాయి రెండూ పరిమితంగానే ఉంటాయి. అందువలన ఆయన కీర్తనలు చాలా కాలం సంగీతజ్ఞులు పాడలేదు. సాహిత్యజ్ఞులు ఆదరించలేదు. ఒక 25 సం॥రాల ముందు వరకు గ్రామాల్లో పట్టణాల్లో చిఱుతలు పట్టుకుని, భజనకూటముల్లో, బిచ్చం ఎత్తుకుంటూ పాడే చాలా కీర్తనల్లో రామదాసువి ఎక్కువగా ఉంటాయి. అందుకు కారణం ఆయన తన కష్టాలను కీర్తనల్లో వివరించడమే నన్నది నిర్వివాదాంశం. అనుభవం పునాది మీద అభివ్యక్తమయ్యే విషయాల్లో 'భావన' ఏ విధంగా ఉంటుందో, రామదాసు కీర్తనల ఆధారంగా వివరించడం ఈ వ్యాసలక్ష్యం.

'భావుకత' అన్న పదం ఇటీవల బాగా ప్రచారంలోకి వచ్చింది. అలంకార శాస్త్రాలలో 'భావుకుడు' శబ్దం ఉంది. భావుకుడన్న మాటను సహృదయుడన్న

అర్థంలో కావ్య మీమాంస కర్త రాజశేఖరుడు ప్రయోగించాడు. కవి కవిత్వాన్ని అర్థం చేసుకోడానికి 'సహృదయత' కావాలని ప్రాచీనులు భావించారు. కానీ లోకంలోని వస్తువును తెలుసుకోడానికి కూడా కవికి సహృదయత కావాలి. ఈ హృదయ వ్యాపారమే కవిని భావనా జగత్తులోకి ప్రయాణింప జేస్తుంది. ఆ జగత్తులో అతడు దర్శించిన వస్తువే కవిత రూపంలో ఆవిర్భవిస్తుంది. ఇది రెండు రకాలుగా జరగవచ్చు.

1) Spontanity - అయత్నసిద్ధత

2) Imagination - భావనాశక్తి

అలవోకగా ఎటువంటి ప్రయాస లేకుండా ఒక ప్రవాహంలా సహజంగా రావడంతో బాటు అవి ఒక భావపరంపరను వ్యక్తం చేయడం మొదటి దాని గుణం.

ఇంద్రియాతీత భావాలను ఊహించగలిగి, తన అనుభవాలను లేదా ఇతరుల అనుభవాలను ఒక పద్ధతిలో కూర్చడ మంతా భావనాశక్తి అవుతుంది.

వాగ్గేయ కారులలో ఈ రెండు గుణాలు కవిత్వావిర్భావ కాలంలో ఉండాలి. వాక్కును గేయాన్ని ఒకేసారి ఊహించి సద్యః స్ఫూర్తితో చెప్పగలిగినవాడు వాగ్గేయ కారుడు. అందువల్ల ఇతర కవులకు వాగ్గేయ కారుల రచనలకు కొంత భేదం ఉంటుంది.

ఈ రెండు గుణాలు కొందరిలో సమంగా, కొందరిలో హెచ్చు తగ్గులుగా ఉండవచ్చు. ఈ హెచ్చు తగ్గులను బట్టే కవిలోని ప్రధాన కవితా గుణాన్ని నిర్ణయించాలి. అన్నమయ్యలో స్పాంటినిటీ. ఇమాజినేషన్ రెండూ సమపాళ్ళలో ఉంటే రామదాసులో మొదటిది ఎక్కువగా రెండవది చాలా పరిమితంగానూ ఉంటుంది. ఈ పరిమితమైన భావుకతను స్పాంటినిటీ పునాదిగానే అనుశీలించా లన్నది ఇక్కడ గుర్తించవలసిన విషయం. భావనాశక్తి, స్పాంటినిటీ రెండూ సమపాళ్ళలో ఉన్న వారిలో కూడా ఒక కీర్తనను మాత్రమే తీసుకుని అనుశీలించి నప్పుడు రెండు గుణాలు సమంగా ఉన్నాయా? చూడవలసి వస్తుంది. ఒక గుణం ఎక్కువగా ఉన్నచోట మరో గుణం సన్నగిల్లడం సాధారణంగా జరిగేదే. అదీగాక కొందరిలో అనుభవాలను వ్యక్తం చేసే పద్ధతిలోని భావనా శక్తి విశిష్టత వలన భావుకత ఏర్పడుతుంది. పద బంధాలు, అలంకారాలు, కవిసమయాలు ఇవన్నీ కవి భావనా జగత్తును నిర్ణయించేవే.

కవి భావనా వ్యాపారమంతా శబ్ద రూపమైంది అందువలన సహృదయుడు భావుకతను శబ్దాన్ని, దాని ద్వారా వ్యంజితమయ్యే అర్థాన్ని ఆశ్రయించి విశ్లేషించాలి. శబ్దం ద్వారా వ్యక్తమయ్యే భావాలు సహృదయుడిని భావుక పరంపరలో విహరింప చేస్తే కవి అనుభవాలు భావుక ప్రపంచంలో శబ్ద రూపాన్ని పొందుతాయి. కాగా భావుకత కవిలో అభివ్యక్తికి పూర్వం, పాఠకుడికి అనంతరం జరిగే ఒక విశిష్టక్రియ.

విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో -

బాధ పడునది గుండియ బడలి పోవు
నది శరీరము భావించునది మనస్సు
నా జని స్థానమగు రహస్య స్థలంబు
పొలఁకువ యెఱుంగరాదు యోగులకు నైన (యుద్ధకాండ. ఉప-6)

భావించునది మనస్సు అన్నది విశ్వనాథ వారి నిర్దేశం. మనస్సు బుద్ధికి, హృదయానికి సంబంధించినది. భావన ఎంతగా మనో వ్యాపారాలకు సంబంధించిందో అంత మేధస్సుకు సంబంధించింది. విస్తృత గ్రంథ పరిచయానికి, కవి విషయావ గాహనకు పాండిత్యానికి సంబంధించింది. అనుభవం పునాదిగాగలిగినపుడు 'భావుకత' మానసిక అనుభూతులకు సంబంధించిందిగా ఉంటుంది.

భావుకతను నిర్ణయించడానికి ఊహ, స్ఫురణ, కల్పన, అపూర్వత వంటివి కొలమానాలుగా నిలుస్తాయి. కవి సమయాలుగా సాహిత్య శాస్త్రం కొన్నిటిని నిర్దేశించింది. దీనికి కొంత విలక్షణంగా ఊహ, స్ఫురణ, కల్పన, అపూర్వత ల ఆధారంగా కవి సృజించేది భావనాశక్తికి సంబంధించిందై కవిత్వంగా మన ముందు నిలుస్తుంది. పైన చెప్పిన ఊహ, స్ఫురణ, కల్పన, అపూర్వత అన్న వాటిని భావనా శక్తి అధికంగా ఉన్న వారి రచనల అనుశీలనలో గుర్తించవలసినవి. ఇవి రామదాసు కీర్తనల్లో వర్తించి వర్తించనట్లుగా ఉంటాయి. ఎందుకంటే రామదాసు కీర్తనల్లో స్పాంటినిటీ, ఆర్తి అన్నవి ప్రధాన గుణాలు. భావుకత అందులో భాగంగా ఉండేదే. అందువల్ల ఈ నేపథ్యం నుంచే ఆయన భావుకతను అనుశీలించాలి.

రామదాసు అనుభవకవి. తాను ఏది అనుభవించాడో దానిని తన కీర్తనల్లో వ్యక్తీకరించాడు. అనుభవం నేపథ్యం నుంచీ వచ్చే రచనల్లో ఆర్తి, దృష్టాంతాలు ఎక్కువగా ఉంటాయి గానీ అధిక భావుకత ఉండదు. అదీగాక రామదాసు ఆవేదనను వెళ్ల బోసుకున్న వాగ్గేయకారుడు. అందుకే ఆయన కీర్తనల ఆధారంగా ఆయన చరిత్ర చెప్పడం కనిపిస్తుంది. ఈ పద్ధతిలో కవిత్వం చెప్పే రామదాసులో

కవిత్వాంశ కంటే విషయ వ్యక్తీకరణ ప్రాధాన్యం వహిస్తుంది. అన్నమయ్యలో కనిపించినంత భావుకత రామదాసులో కనిపించదు. రామదాసులో అనుభవం అభివ్యక్త మయ్యే తీరు ప్రధానంగా కనిపిస్తుంది. అన్నమయ్యలో ఏ పాదానికి ఆ పాదంగా కూడా భావుకతకు సంబంధించిన ఉదాహరణలు ఇవ్వవచ్చు. రామదాసులో అది కుదరదు, మొత్తం కీర్తనను తీసుకునే దాని వెనుక తాను భావించిన తత్త్వాన్ని చెప్పాలి. ఆ పద్ధతిని అనుసరించే రామదాసు భావుకతను విశ్లేషించాలి.

రామదాసు కీర్తనల్లో ఆర్తి కూడా ఒక ప్రధాన గుణమని చెప్పాం. ఆయనలో ఆర్త ప్రపన్నుడి లక్షణాలు ఎక్కువగా ఉన్నాయి. వైష్ణవ సంప్రదాయంలో ఆర్తప్రపన్నుడు దృప్త ప్రపన్నుడు అని రెండు రకాలవారున్నారు. పరమాత్మ ఏదో ఒక సందర్భంలో మోక్ష మిస్తాడని స్థిర చిత్తంతో ఉండేవాడు దృప్తప్రపన్నుడు. పరమాత్మను తనను రక్షించమని మోక్ష మివ్వమని పదే పదే ప్రార్థించేవాడు ఆర్త ప్రపన్నుడు. ఈ ఆర్త లక్షణమే రామదాసులో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ఆర్తి గుణాన్నే వేదనగా ఉప నిషత్తులు, భాష్యాదులు చెబితే జీవుని వేదనగా విశ్వనాథ సత్యనారాయణ చెప్పారు. రామదాసు కీర్తనల్లో వేదనలన్నీ భావ ప్రధానంగా ఉంటాయి. నిజానికి వాగ్గేయకారుల రచనలన్నీ భావ ప్రధానమైనవే. ఇందులో పాత్రల ప్రమేయం ఎక్కువగా ఉండదు. అలా ఉన్నా అది భావనా రూపంగానే ఉంటుంది. ఈ భావనలన్నీ ఆర్తి రూపమైన వేదనా ప్రసారంగా ఉంటాయి. వేదన ధ్రువానుస్మృతి. ఇదే మరో విధంగా భక్తి. ఈ భక్తిని, ఆర్తిని, వేదనను ఏ విధమైన భావాలతో వ్యక్తం చేస్తాడో దానినను సరించి భావుకత రామదాసులో ఏర్పడుతుంది.

రామదాసు భావుకతను నాలుగు రకాలుగా విభజించవచ్చు.

1. రాముని నారాయణ పరతత్త్వంగా భావించడం.
2. రామునితో తాను జీవనం సాగించినట్లు భావించడం. జీవనం చేయలేక పోయానని బాధ పడడం.
3. లౌకిక విషయాలను మానసిక చిత్తవృత్తులను చిత్రించడం.
4. ఆర్తి చెప్పే సందర్భంలో జీవుడు, ఇంద్రియం, మనసులను వస్తువులుగా గ్రహించి చెప్పడం.

1) కవి భావనా జగత్తులో కళ్ళ ముందు కనిపించే దృశ్యం కంటే దాని వెనుక నున్న తత్త్వాన్ని పట్టుకోవడం విశిష్టమైంది. రామదాసు రాముని కృష్ణావతార రూపంలో దశావతార రూపంలో, పరమాత్ముడైన నారాయణుని రూపంలో

దర్శించాడు. అనుభవం పునాది మీదే కీర్తనలు చెప్పినా రాముడు ఆయనకు వట్టి మానవ మాత్రుడిగా కనిపించడు. అందుకే రాముని కీర్తనల్లో భద్రాచలం వైకుంఠంగా రాముడు అవతార తత్త్వంగా గాక పరతత్త్వంగా నారాయణుడు కనిపిస్తాడు.

'గరుడ గమన రారా నను నీ
కరుణ నేలుకోరా ఆ
పరమ పురుష మే వెఱపు లేల
నీ మఱగు జొచ్చితిని అఱమఱ సేయకు' అంటూ

'పాలకడలి శయనా దశరథ
బాల జలజ శయనా
పాల ముంచు నను నీళ్ళ ముంచు

నీ పాల బడితి నింక జాలము సేయక' అని రాముని క్షీరాబ్ధినాధుడిగా భావిస్తాడు. గరుడగమన, పరమ పురుష, పాల కడలి శయనా వంటి విశేషణాలు రాముని నారాయణునిగా 'కల్పన' చేయడాన్ని చెప్పేవి. పై కీర్తనలో మరో చమత్కారం కూడా ఉంది. పాలకడలి శయనుడు, జలజ శయనుడు ఆయనే. అందువల్ల పాల ముంచినా నీళ్ళ ముంచినా పరమాత్మ సాయుజ్యమే కలుగుతుందన్న స్ఫురణను కలిగించాడు. పాల ముంచడం నీళ్ళ ముంచడం అన్న మామూలు మాటలు పై విశేషణాల వల్ల మరో విశిష్టార్థాన్ని కల్పించడం గమనించవచ్చు.

కలియుగ వైకుంఠము -
భద్రాచల నిలయము సేవింతము అన్న కీర్తనలో

కాంచన సౌధములు - వానికి కెంపు
మించిన దూలములూ - వజ్రములు చె
క్కించిన స్తంభములూ - పగడములని భ్రమించగ ద్వారమ్ములూ

అంచయాన మఱి యెంచలేనుగదె
మంచి పచ్చలు గూర్పించిన వాకిండ్లు

ఈ వర్ణనంతా భద్రాచలాన్ని వైకుంఠంగా దర్శించిన రామదాసు భావన. అక్కడి వస్తు సముదాయాన్నంతా నవరత్నాలతో పోల్చడం రామదాసు 'ఊహ'కు సంబంధించినది. కెంపు దులాలు, వజ్రాల స్తంభాలు, పగడాల ద్వారాలు, పచ్చల వాకిళ్ల్లు ఇవన్నీ రామదాసు భావనా జగత్తులో దర్శించిన వస్తువులు. కళ్ళ ముందున్న నగరాన్ని వైకుంఠంగా భావించడం, అక్కడి సౌధాలలోని వస్తువుల్లో నవరత్నాలను

ఊహించడం ఇక్కడి భావుకత. రెండంశాల కూర్పు ఇక్కడి భావుకతలో ఉంది. ఈ విధమైన దృష్టి ఉన్నవాడు కావడం చేతనే రామదాసుకు "అంతా రామమయం జగమంతా రామమయం"గా కనిపించింది. ప్రకృతి, ఆత్మ, సమస్త దేవరాశి, జీవరాశి అన్నీ రామ తత్త్వంగా కనిపించాయి. అలా దర్శించడం భక్తుడికి మాత్రమే సాధ్యం. ఈ భక్తి భావనలోనే రామదాసు భావుకత కనిపిస్తుంది.

2) కవికి భక్తుడికి ఉన్న ఒక సమానగుణం ఆవేశం. కవి భావావేశాన్ని భక్తుడు భక్త్యావేశాన్ని పొందుతాడు. రామదాసులో ఈ రెండు గుణాలు ఒకేచోట కనిపించే దృశ్యం ఒకటి ఆయన కీర్తనల్లో ఉంది. భక్తుడు భగవంతుని కథను వింటూ ఆ కాలంలో ఉంటే తానూ భగవత్ సేవ చేసుకునే వాడినే అని భావిస్తాడు. కవి ఒక కాలంలో తాను కూడా జీవించి ఉంటే బాగుండేదే అని భావిస్తాడు. మొదట దానికి తమిళ ఆళ్వారుల్లో కులశేఖరుడు, రెండవ దానికి కృష్ణశాస్త్రి అప్పుడు పుట్టి ఉంటే చక్కని ఉదాహరణలు. రామదాసు స్వయంగా కవి, భక్తుడు. అందువల్ల తాను భక్తుడుగా ఆయన సేవ చేయలేకపోయానే అని వ్యథ చెందుతాడు. అదే సందర్భంలో ఆయన సేవలో తాను ఒక పాత్రగా ఉండే వాడిని కదా అని బాధపడతాడు.

ఆశ పుట్టి నే శ్రీరాములతో - నాహా పుట్టనైతిని
రఘు రాములతో - అయ్యో నేఁ బుట్ట నైతిని
శ్రీ రాములతోఁ బుట్టి సేవలు సేయనైతిని

అని వ్యథ చెందుతాడు. తాను భక్త కవి కావడం చేత ఆ వ్యథను పక్కకు బెట్టి సేవ చేయలేక పోయానే అంటాడు.

"జనకుడు హరికి జానకిని బెండ్లి సేయంగా
వారిద్దరికి నెత్తి బియ్యము నేదెత్తును
అమ్మకు హరికి ఆకులు మడి చిత్తును
నరులార యితడే నారాయణుడని నే జాటుదును" అంటూ సాగే ఈ కీర్తనలో సేవ చేయలేకపోయానని, అదే సందర్భంలో రాముడి కష్టాలన్నీ తానే భరించేవాడినని భావిస్తాడు.

అసలు రాముడిని దేవుడిగానే గుర్తించని విషయం, గుర్తించిన తర్వాత అవస్థ రామదాసు ఒక కీర్తనలో చెబుతాడు.

తెలియక నే మోసపోతిని దేవుండని తెలియనైతిని అన్న కీర్తనలో

"కనకాసన మీయనైతిని కమ్మని గంధము బూయనైతిని
ధనము జూచి మోహమున తబ్బిబ్బైతిని
మనమున నతడాది దేవుడనుచు భక్తి
వినయ పూర్వకముగా బొగుడుచు........" అని తాను సేవ చేయలేకపోయానని భావించాడు. ఈ పదాల వెనుక రామదాసు ఒక ఊహను మనకు చెబుతున్నాడు. భక్తుడు తన ఇంటికి స్వామి వచ్చాడని ఆయనను గుర్తించలేకపోయానని చెప్పుకోవడం ద్వారా స్వామి తన హృదయ మందిరాన్ని అధివసించాడన్న 'స్ఫురణ'ను కలిగిస్తున్నాడు.

3) లౌకిక, సాధారణ విషయాలను భావనతో చెప్పడమనేది రామదాసులో ఉంది. ఇందులో ఒక్కొక్కసారి మానసిక చిత్త వృత్తిని చిత్రించడం కూడా కనిపిస్తుంది. సాధారణంగా వాగ్గేయకారులు సంచారప్రియులు. అందువల్ల లౌకిక విషయాలు వారికి కనిపిస్తూ ఉంటాయి. రామదాసు సంచార ప్రియుడని ఆయన జీవిత చరిత్రను బట్టి చెప్పలేము. ఇల్లే వైకుంఠం పందిరే పరమపదం అని భావించి శ్రీ రాముని కీర్తించినవాడు. అందుకే తల్లి దండ్రులను వదలని పిల్లల మనస్తత్వమే తనలో ఉందని భావిస్తాడు.

అడుగుదాటి కదల నియ్యను నా
కభయ మియ్యక నిన్ను విడువను

అన్న కీర్తనలో "నా హృదయ కమలము నందు, నీ మృదు పదములను బంధించివేయుదు" అంటాడు. పిల్లలు అల్లరి చేస్తే కట్టడి చేస్తాననడం సర్వ సాధారణం. కానీ తల్లి దండ్రులుగా ఉన్న సీతారాములు తన కోరికను తీర్చకపోతే వారి మృదు పదాలను హృదయ కమలంలో బంధిస్తాననడం వ్యతిరేకమైన ఊహ. సాధారణ విషయానికి విరుద్ధంగా చెప్పడం ఇక్కడి భావుకత. ఇది 'అపూర్వత'

నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి
నను బ్రోవుమని చెప్పు నారీ శిరోమణి అన్న కీర్తనలో

ప్రక్కను చేరుక చెక్కిలి నొక్కుచు
చక్కగ మరుకేళి సొక్కియుండెడి వేళ
లోకాంత రంగుడు శ్రీకాంత నిను గూడి
ఏకాంతమున నేక శయ్య నున్న వేళ

అన్న పాదాలలో వ్యక్తి మానసిక అనుభూతిని, చిత్త వృత్తిని రామదాసు భావించాడు. తనను రక్షించమని రామునితో చెప్పడానికి సీతమ్మకు నిర్దేశించిన

సమయం ఇది పురుషుడి మానసిక చిత్త వృత్తిని స్థితిని రాముడికి ఆరోపించడం, ప్రశాంత చిత్తానికి ఉదాహరణగా ఉండే సందర్భం తన విషయాన్ని చెప్పడానికి అవసరమైన సందర్భం ఇదేనని రామదాసు భావించడం లౌకిక అనుభూతిని మానసిక చిత్తవృత్తి పరం చేసే భావుకత.

రామదాసు భావుకతను పై అంశాలు స్థూలంగా నిరూపిస్తాయి. ఆర్తిని జోడించి లేదా నేపథ్యంలోంచి రామదాసు చెప్పిన భావాలు చాలా గొప్పగా ఉంటాయి. జీవుడు, మనసు, ఇంద్రియాలు, ఆధ్యాత్మికతలను ఆర్తికి జోడించి చెప్పడం రామదాసు ప్రత్యేకత.

అయ్యయ్యో నేజెల్ల ఈ జీవునకు సుఖ
మెయ్యెడ లేదు కదా
జన్మాలు ఎన్నెన్నో కలవూ గదా!

అన్న కీర్తనలో జీవుడు ఎక్కడెక్కడ ఉంటాడో వివరిస్తాడు. స్వర్గం, నరకం, ఆకాశం, మేఘం, సూర్యకిరణాలు, భూమి ఇలా ప్రకృతిలోని అన్ని వస్తువులను జీవుని స్థానంగా భావించాడు. అన్నిటికంటే ప్రధానంగా ధాన్యరాశి రూపంలో జీవుడున్నాడంటాడు. ఇలా సర్వ ప్రకృతిలో జీవుడు సంచరిస్తూ ఉంటాడని అన్నం రూపంలో పొట్టలో ఉన్నాడని చెప్పాడు.

కొన్నాళ్ళు నరవరుని రేతస్సు వల్ల నారీ గర్భ
నరకాన బడి యుంటిగా ఓరామ
త్రిప్పుడు తిత్తిలోన దిన దినము
ప్రవర్ధిల్లు చుంటి గదా కొన్నాళ్ళు
అప్పుడు మా తల్లి యుప్పు పులుపు దిన
నంగలార్చు చుంటిగా కొన్నాళ్ళు
ఎప్పుడు నిందుండి బయలు వెళ్ళుదునని
ఎదురు చూచుచుంటిగా కొన్నాళ్ళు

ఈ కీర్తనలో జీవుని స్థితిని రామదాసు భావించిన తీరు విశిష్టమైంది. జీవుడు ఉండే స్థితిని ఉండే ప్రాంతాలను వివరించడంలో 'అపూర్వత' ఉంది. తల్లి గర్భంలో జీవుడిని ఊహించడం ఈ కీర్తన ప్రత్యేకత. అందులో జీవుడు కొరుకునే వస్తువులు, ప్రకృతిలోకి రావాలన్న తహతహ అన్నిటిని రామదాసు ఈ కీర్తనలో చిత్రించాడు.

ఇంద్రియ నిగ్రహం లేకపోతే జీవుడు పరమాత్మను అర్చించలేడు. కామ,

క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను వదలితేనే భక్తి, ప్రపత్తి సిద్ధిస్తాయి.

నిజానికి ఏకాగ్రత కుదరక పోవడానికి భగ్నం కావడానికి ఇంద్రియాలే ప్రధాన కారణమన్న 'భావన'ను రామదాసు ఒక కీర్తనలో చిత్రించాడు.

సకలేంద్రియములార ఇపుడు సమయము గాదు
సద్దు సేయక యుండరే

అన్న కీర్తన పై స్థితిని చెప్పేది. ఇదే కీర్తనలో భగవంతునికి షోడశోపచార పూజను రామదాసు భావించాడు. ఇలా పూజించినది విగ్రహరూపుడైన రాముడిని కాదు. మానస రూపంలోని రాముడిని. మనసులో ఆయన ఉన్నాడని తెలియకుండా చేసేవే ఇంద్రియాలు. మనసును అధీనంలో ఉంచుకోనీయనివి కూడా అవే. అందుకే వాటినే సద్దు సేయకుండండని బ్రతిమాలుతున్నాడు. తన లోపలి వస్తువులకు, తన అధీనంలోని వస్తువులకు తానే చెప్పడం ఇక్కడి భావుకత. ఇది భక్తి, ఆర్తి నేపథ్యం నుంచీ మాత్రమే సాధ్యమవుతుంది.

వాగ్గేయకారులకు, తత్త్వాలు పాడే వారికీ ప్రధానమైన వస్తువు మనసు. మనసా! అని సంబోధిస్తూ ఎన్నో తాత్త్విక విషయాలను చెప్పడం వీరందరిలోను కనిపిస్తుంది. రామదాసు కూడా 'మనసు'ను ఆర్తి, భక్తి నేపథ్యంగా చేసుకుని భావించాడు. తాను కర్మగా చేయలేకపోయినవన్నిటిని మనసుతో, వాగ్గేయకారుడు కావడం చేత వాక్కుతో రామదాసు చేయాలనుకుంటాడు. తాను భగవత్ రూపుడైన శ్రీ రాముని కైంకర్యం చేయాలని, ఆరాధించాలని భావించాడు. అందుకు సరియైన శారీరక శక్తి లేదు. అందుకే

రామరామ శ్రీరామా రామా
రామాయనరాదా మనసా
కామిత ఫలదుండగు శ్రీ సీతా
కాంతుని గనరాదా మనసా

అన్న కీర్తనలో ధ్యానం, ఆవాహన, పాద్యం, అర్ఘ్యం, ఆచమనం, స్నానం, వస్త్రం, ఉపవీతం, గంధం, పుష్పం, భూషణం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, శయనం వరకు అన్ని క్రియలను తన 'మనసు'ను ఇవ్వమని వేడుకుంటాడు. మానసికంగా ఆయన అర్చన చేయడం ఇక్కడ ప్రధానంగా చెప్పాలి. భగవదారాధనలో పాంచరాత్రం భూతశుద్ధి, మానసయాగం అని రెండంశాలను నిర్దేశించింది. భూతశుద్ధి మనో శుద్ధి విధానాన్ని మానస యాగం మనసులోనున్న స్వామిని అర్చించే క్రమాన్ని

చెబుతుంది. అదే తత్త్వం ఇక్కడి కీర్తనలో రామదాసు భావించాడు.

ఇదే విధంగా పౌరాణిక విషయాలన్నిటిని రామావతారానికి అన్వయించి కీర్తించడం, ఆధ్యాత్మిక విషయాలను బోధించడం రామదాసు కీర్తనల్లో కనిపిస్తుంది. మోక్షం పొందానని భావించే రామదాసుకు మోక్షం దొరికే విధానం చెప్పడం శాస్త్రీయ విషయాన్ని చెప్పే భావుకతగా చెప్పాలి.

తర్లీ పోతాము చాలా - దయలుంచండి. ఇకను
మళ్ళీ జన్మాలకు రాము మదిలో నుంచండి అనే కీర్తనలో

"బార్లుగట్టి భక్తవరులు భజనలు సేయగా మూడు
ఏర్లు గలసినట్టి దారి నెరిగి వేగముగా
సోహ మనిమెడి కత్తి దీసి చేతనే పూనీ అట్టే
మోహ పాశముల నెల్ల మొదటికే త్రుంచీ
ఈషణ త్రయముల నెల్ల నిలలోనే డించీ'

ఇదంతా మోక్ష మార్గానికి జీవుడు ప్రయాణించేక్రమం. బార్లు గట్టి భక్త వరులు భజనలు చేయడం వైష్ణవ సంప్రదాయం కూడా చెబుతుంది. ఒక వైష్ణవ జీవాత్మ పరమాత్మను చేరడానికి వస్తుంటే దారిలో నిత్యసూరులు స్వాగతం చెబుతారని, జీవుడు విరజానదిని దాటి, అహాన్ని వదలి, మోహపాశాలను తెంచుకుని మోక్షం పొందుతాడని ఈ సంప్రదాయం భావిస్తుంది. ఇంతటి తాత్త్విక అర్థాన్ని ఈ కీర్తనలో చిత్రించడం శాస్త్ర విషయాలను భావనా ప్రపంచంలో దర్శించి చెప్పడంగా భావించాలి. ఇది భక్తుడు జ్ఞాన మార్గంలో విహరించి చెప్పిన తాత్త్విక భావుకత.

'ఝుమ్మను చీకటిలో వాన ఝురఝుర గురియగను' వంటి పాదాల్లో ధ్వన్యనుకరణ ద్వారా చీకటి దట్టంగా ఉండడాన్ని చెప్పడం వంటివి రామదాసు భావుకతను వివరించేవి. అయితే రామదాసు భావుకుడు కాదు, భక్తుడు. ఆయన కవితా గుణం ఆర్తి. అదీ స్పాంటినిటీ తో కూడి ఉండేది. ఆ లక్షణం వలన తన మనసులో కొన్ని భావాలు ఊహలుగా, కల్పనలుగా కనిపిస్తాయి. ఒక్కొక్కసారి స్ఫురణ వలన అపూర్వత గోచరిస్తుంది. అందువలన రామదాసు కీర్తనల్లో కవిత్వాంశను వెతుక్కోవలసిందే. అయితే అతని జీవితాన్ని, ఆర్తిని నేపథ్యంగా చేసుకుని కీర్తనలను గమనించినపుడు మాత్రం తన వేదనా ప్రసారమంతా భావుకతగా దర్శనమిస్తుంది.

# అన్నమయ్య, క్షేత్రయ్య - ఒక తులనాత్మక పరిశీలన

డా. అద్దేపల్లి రామమోహనరావు

**ఈ**నాడు అతి వేగంగా మారిపోతున్న సామాజిక కళారూపాల అసభ్యతా వ్యాపార నేపథ్యంలో, అన్నమయ్య, క్షేత్రయ్య - స్త్రీ మనశ్శరీర సౌందర్యాన్ని, 'పద' రూపంలో అపూర్వంగా రూపుగట్టిన విధానాల్ని గూర్చి, ఆలోచించవలసి ఉంది. స్వచ్ఛమైన స్త్రీ సౌందర్యం, అది ఆంగికంగాని, మానసికంగాని, వర్ణించడంలో, దానంతట అదిగా ఏ దోషమూ లేదు. ఏ అంగానికి ఆ అంగాన్ని వ్యాపారానుగుణంగా, విశృంఖలంగా వినిమయం చేస్తున్న నేటి చట్టబద్ధమైన కళారూపాల సందర్భంలో, కేవలం వర్ణన యిచ్చే అనుభూతి రోజు రోజుకూ కనుమరుగైపోతోంది. ఈనాటి కొత్త సంగీతాలు గానీ, కొత్త నాట్యాలుగానీ, ప్రధానమైన శృంగార వ్యాపారానికి అంగభూతాలు. కాని, ప్రాచీన కళల్లో శృంగారం, సంగీత నాట్యరీతులకి అనుబంధమైన సౌందర్యం, దృశ్యమాధ్యమం వ్యాపారమైన తర్వాత, అంగాంగ సౌందర్యం శారీరక స్పందనకి గమ్యస్థానం అయింది. ఆహార్యం చేత, భావానుగుణమైన కదలికల చేత, ప్రాచీన సంగీత నాట్యాలు కేవలం మానసిక సౌందర్య అనుభూతికి నిలయాలు. అందుకే ఈ వాతావరణంలో నిలబడి, పూర్వసాహిత్యంలో అంగాంగవర్ణన చేశారనడం, ఆత్మ వంచనే ఔతుంది. లేదా ఒక వ్యర్థ నినాదం ఔతుంది. ఈ పరిస్థితుల్లో అన్నమయ్య, క్షేత్రయ్యల స్త్రీ సౌందర్య వర్ణనల్ని ఉదాత్త సంస్కృతి ఆవిష్కరణలుగా విశ్లేషించుకోవడం ఆవశ్యకం. అంతేగాక, యిద్దరూ, స్త్రీ సౌందర్యాన్ని ఉపాసిస్తూనే, అందుకు అతీతమైన అన్వేషణలో భక్తిమార్గాన్ని అనుసరించినవారు. ఈ సౌందర్యాన్ని మార్గంలోనే వదిలేసి, ఆత్మానుభూతి లక్ష్యాన్ని చేరుకునే కృషిలో తీవ్రమైన ప్రయాసపడిన వారు. ఎంతవరకు కృతకృత్యులయ్యారో తెలియదుగాని, సాధన విషయంలో మాత్రం లోపం లేని వారు.

'వనజాక్ష! నీ విటకు వచ్చేదాక
తలవాకిలె యిల్లు సుమీ నా ప్రాణనాథ !
శరణు మువ్వగోపాల
ఈ రేయి గూడ జాగుసేయక రమ్మీ నా ప్రాణ నాథ !

అన్నాడు క్షేత్రయ్య. 'తలవాకిలి', వాసక సజ్జిక - కి గృహద్వారం కావచ్చు. క్షేత్రయ్యకి తలనిండా నిండిపోయిన 'వరదయ్య' ఆలోచనల వాకిలి కావచ్చు. 'ఈ రేయి గూడ జాగు సేయకర'మ్మనడం, స్త్రీ పరంగా విరహవేదన సూచకమైనా, కవి పరంగా, పగలూ రాత్రి గోపాలునిలో కలవాలనే ఆత్మవేదన కావచ్చు. 'ప్రాణనాథుడు' సరే, ఇద్దరికీ అన్వయించే పదమే.

'తగిలిన మునులే యీతని గందురంటా
మగువ ఎవ్వరితోడను మాటాడదిపుడు
అతుల నిరాహారులతనికి ప్రియులంటా
అతివ నిన్నటినుండి ఆరగించదు
తతినడవుల నుండే తపసు లేయతనికి
హితులంటూ వనములో నెడయదీతరుణి
తలకొన్న యతనిపై తలపే పరమంటా
చెలియ చెక్కిట నున్న చెయిదియ్యదు
వలనైన యతడు దేవతల కొడయడంటా
కలికి రేయి పగలు కనుముయ్యదిపుడు'

అంటాడు అన్నమయ్య. విరహోత్కంఠితయైన నాయిక, ఎవరితోను మాట్లాడక పోవడం, ఆహారం తీసుకోకపోవడం, వనాల్లోనే ఉండడం, చెక్కిలి మీద చెయ్యి తియ్యకుండా ఏకాగ్రంగా ఉండడం, కన్నులు ముయ్యకపోవడం, ఇవన్నీ విరహంలో సాధారణమైన చేష్టలే. అయితే, ఈ అన్ని విషయాల్లో, ఆమెకు, మునులతో, ఉపవాసులతో, తపస్వులతో, దేవతలతో పోటీ.

ఇలా యిద్దరిలోనూ స్త్రీ పరమైన, భావగత, శారీరక సౌందర్యవర్ణనకు, పరమాత్మ భావన అంచుగా ఉంటుంది. ఇది మోహావృతమైన సౌందర్యాన్నుండి తప్పించుకునే ప్రయత్నం. ఇది అన్నమయ్యలో క్షేత్రయ్యలో ఒక సమగ్ర రూపంలో ఉంది.

## 2

క్షేత్రయ్య 1595-1660ల మధ్య జీవించినవారు. కృష్ణాజిల్లాలోని 'మొవ్వ' అతని జన్మస్థలం. వరదయ్య అతని అసలు పేరు. మొవ్వ దగ్గరలోనే 'కూచిపూడి' ఉంది. 'కూచిపూడి' నాట్యానికి ప్రసిద్ధమైన గ్రామం. క్షేత్రయ్య, చిన్నప్పుడే అక్కడ నాట్యం నేర్చుకున్నాడు. అతని భార్య మేనమామ కూతురైన రుక్మిణి. కాని, నాట్యం నేర్చుకునే సమయంలో దేవదాసియైన మోహనాంగిపై అనురాగం పొందినాడు. ఆమె అతని ప్రేమను మువ్వగోపాలునిపై మళ్ళించడంలో విజయవంతమయింది. ఆయన భార్య కూడా అందుకు సహకరించింది. ఈ కథ ద్వారా, క్షేత్రయ్యకు కలిగిన కళాప్రేరణ వ్యక్తమౌతుంది. అతనికి మోహనాంగిపై మోహం ఉంది. కాని ఆ మోహం భౌతికంగా ఫలించలేదు. ఆ మనస్థితిలోనే, అతని భక్తి గోపాలునిపై మళ్ళింది. అది మధురభక్తికి దారి తీసింది. అతని అంతరాంతరాల్లో అణగి ఉన్న శృంగారమంతా గోపాలునిపరమైంది. అందుకే అతని పదాలన్నీ ఎక్కువ భాగం సంయోగ సౌందర్యాభిముఖంగా ఉంటై. తనను స్త్రీగా భావించుకుని, పరమాత్మను పురుషుడుగా భావించి, లీనమయ్యే వేదన ప్రకటించడమే మధురభక్తి. అందుకే ఆయన పాటలన్నీ ఆత్మాశ్రయంగా ఉండి, నాయికమిషతో తన వేదనను వ్యక్తీకరిస్తూ ఉంటై.

'నిను చూడగలిగే విన్నాళ్ళకి
నిన్ను చూచి నాలుగైదు నెలలయ్యె మువ్వగోపాల
నిన్న రేయి కలలోనా కన్నుల గట్టి నట్లుండ
వెన్నుడా! దిగ్గున లేచి వెదకి కానక
కన్నీరుచే పైట తడిసి, కరగి చింత నొందితి
నన్ను తలచిదోలేదో నా నోము ఫలము ॥ నిన్ను ॥

క్షేత్రయ్య, చిన్ననాటినుండి నాట్యం నేర్చుకుని ఉండడం, నాట్యకళా విశారదయై దేవదాసియైన మోహనాంగిని ప్రేమించి ఉండి, భౌతికంగా భంగపడడంచేత, అతని గీతాల ప్రేరణ నాట్యం నుండి వికసించింది. అతని పదంలోని పదవాక్య నిర్మాణాలూ, భావసంఘటనలూ - అన్నీ అభినయ కేంద్రం నుండి అమరికగా రూపొందినవే.

అన్నమయ్య **1424-1503** మధ్య జీవించిన వారు. పదరచనకి మార్గదర్శకుడు. క్షేత్రయ్యపై కూడా ప్రభావం చూపినవాడు. అన్నమయ్య కడపజిల్లా, తాళ్ళపాక గ్రామంలో జన్మించాడు. చిన్ననాటి నుండి, వెంకటేశ్వరునిపై భక్తి కలిగి, 16

ఏళ్ళప్పుడే ఒంటరిగా ఎవరికీ చెప్పకుండా తిరుపతి వెళ్ళి, వైష్ణవ దీక్ష గ్రహించినవాడు. అతని భక్తికి భయపడి, వైరాగ్యంలోకి వెళ్ళకుండా, తలిదండ్రులు, ఇద్దరు కన్యలతో వివాహం జరిపించారు. వాళ్ళు అక్కలమ్మ, తిరుమలమ్మ. గృహస్థాశ్రమంలో ఉన్నప్పటికీ భక్తి మార్గాన్నీ వదల్లేదు.

క్షేత్రయ్యకి శృంగారం కేంద్రబిందువై, దాన్ని భక్తి ప్రభావంతో జయించే ప్రయత్నం ప్రధానమైతే, అన్నమయ్యకి భక్తి కేంద్రబిందువై, తనకు అవరోధంగా వచ్చిన శృంగారాన్ని జయించే ప్రయత్నం ముఖ్యమైంది.

'ఇదిగో సంసారమెంత సుఖమోగాని
తుదిలేని దుఃఖమను తొడవు గడియించె'
'మాయల సంసారము మరిగి నీ కర్మము
యీ యెడ నిన్ను మరుగదేటికో హరి
కాయజు కేళిపై దమి గలిగిన మనసు
కాయజు తండ్రి నీ పై గలుగదేటికో!'

ఇది అన్నమయ్యకు సంబంధించిన వేదన.

క్షేత్రయ్యది మధురభక్తిగా ప్రఖ్యాతం. మనస్సులోని శృంగార భావనలు ఉపశమించకపోతే, ఆ భావాల్ని చెప్తూనే, దేవుడి పరం చేసి జయంచడానికి చేసే ప్రయత్నమే మధురభక్తి. తెలుగు పదకర్తల్లో క్షేత్రయ్య మధురభక్తి ఆవిష్కరణ అసమానమైనది. ప్రియుని తోడి విరహవేదన, ప్రియుడు రాకపోవడం చేత చెప్పరానంత బాధనుభవించడం, మొదలైన భావాలతో క్షేత్రయ్య పదాలన్నీ నిండి ఉన్నాయి. ఇవన్నీ ఆయనలోని భగవద్విరహవేదనా సూచకమైన ఆవిష్కరణలే. ప్రతిభావాన్నీ భగవద్విరహవేదన పరంగా అన్వయించుకొనే అవకాశం కూడా ఉంటుంది.

'పడతిరో! మువ్వగోపాలుడైన
కడప వెంకటేశుని గుడి
యెడబాయక యుందునని - యెంచుకుంటి
తడయ నేనొకటి తలచితే
దైవమొకటి తలచినందుకు
తొడబడనే తెగువ చేసెదనంటే
తొయ్యలి వాడేమి చేసుకొనునో '

'కూడి ఎడబాయక యుందునని యెంచుకుంటి' అనడంలో విరహబాధ ఉండదని భావించడం, లేదా 'ఎడ' అంటే హృదయమనుకుంటే, ఎప్పుడూ హృదయంలోనే ఉంటాడని ఆశించడం అనుకోవచ్చు. అద్వైత భావాన్ని తీవ్రంగా కాంక్షించిన కవి, ఆ భావన దూరం కావడానికి పడే బాధ అడుగడుగునా కనిపిస్తుంది. మనసులోని శృంగార భావాన్ని తీసివేసే ప్రయత్నమే యిది. అభినయ అనుగుణంగా పదాలన్నీ రాయడం, సంగీతజ్ఞానంలో తానే తన పాటలకు రాగాలు నిర్ణయించడం, క్షేత్రయ్య మధురభక్తికి తగిన సంగీత, నాట్యగాఢతకు నిదర్శనం.

## 3

అన్నమయ్య వ్యక్తిత్వం చాలా గొప్పది. చిన్ననాటి నుండి పాండిత్యంపై ఆసక్తితో, పెద్దల దగ్గిర అనంతమైన విజ్ఞానాన్ని ఆర్జించిన వ్యక్తి. అంతేగాక రామానుజాచార్యుల భావధారను ఆకళింపజేసుకుని, సామాజిక సంస్కరణ భావాల్ని గూడా అమలులో పెట్టిన సంస్కర్త. పోతనవలె స్వతంత్ర వ్యక్తిత్వం గల మనీషి. రాజు తనపైన పాట రాయమంటే తిరస్కరించిన ధీరత్వంగలవాడు. ఎంతో లోకజ్ఞానంతో, జానపద విజ్ఞానఖనియై, ప్రజాసంబంధమైన భాష, నుడికారాలు, సామెతలు అడుగడుగునా పాటల్లో నింపిన ప్రజా వాగ్గేయకారుడు. ముప్పై రెండు వేల పాటలలో శృంగార గీతాలు చాలా తక్కువ. ఆత్మాన్వేషణ, వేదాంతభావన మొదలైన మహోదాత్త భావధారతోపాటు గొప్ప భావుకతగల కవి అన్నమయ్య. అన్నమయ్య సంకీర్తనల్లో కనిపించే భావసంపదగాని, ఆవిష్కరణ శిల్పంగాని, గేయ రచయితలలో అపూర్వమైనవి.

ఒక ఆసక్తికరమైన విషయమేమిటంటే, ఉర్దూలో గజల్‌కున్న నిర్మాణానికి దగ్గరగా ఉన్న రచనా సంవిధానం అన్నమయ్యలో కనిపిస్తుంది. గజల్ నియమాలు సరిపోయినట్లుగా అన్నమయ్య రాస్తాడని చెప్పడం నా ఉద్దేశం కాదు. అన్నమయ్యకు ఏ విధంగానూ పరిచితమయ్యే అవకాశం ఉన్నది కాదు గజల్ ప్రక్రియ. కాని ముఖ్యమైన ఒకటి రెండంశాల్లో పోలిక ఉండడం కుతూహలం కలిగిస్తుంది. అన్నమయ్య అన్ని పాటల్లో ఇవి కనిపిస్తాయనీ నా అభిప్రాయం కాదు. చాలా పాటల్లో కనిపించడం, గమనించగలం. గజల్‌లో రెండేసి పాదాల షేర్లుంటై. ముందు చరణంలో రెండు పాదాల్లోనూ కనిపించే అంత్యప్రాసపదం, తర్వాతి చరణాల్లో రెండో పాదం చివర మాత్రం కనిపిస్తుంది. దీన్ని 'రదీఫ్' అంటారు. ఈ రదీఫ్ అనేది అన్ని చరణాల రెండో పాదాల్లో ఒక్కటే కావచ్చు, లేదా బాగా పోలిక

గల అంత్యప్రాసపదం కావచ్చు. ఈ 'రదీఫ్' పోలిక అన్నమయ్య పాటల్లో కనిపిస్తుంది. రదీఫ్‌కు వెనుక పదం 'ఖాఫియా' అనబడుతుంది. ఇది కూడా గజల్‌లోని చరణాంతాలలో పదాల పోలికతో కనిపిస్తుంది. ఈ పోలిక గూడ అన్నమయ్యలో కొన్ని పాటల్లో కనిపిస్తుంది.

ఉదాహరణకు :-

'వీధుల వీధుల విభుడేగెనిదె
మోదము తోడుత మొక్కరో జనులు!'

ఇది ఒక పాటలో మొదటి చరణం. దీనిలో రెండు పాదాలే ఉన్నై. రెండో పాదం చివర. 'మొక్కరో జనులు' అని ఉంది. సాధారణంగా పాటలన్నీ తెలుగులో నాలుగు పంక్తుల్లో ఉంటై. పై పాటలో మొదటి చరణం చివర 'పట్టరోజనులు'; రెండో చరణం చివర 'కొలువరోజనులు'; మూడో చరణం చివర 'తలచరోజనులు'. అలాగే 'కొండలలో నెలకొన్న' పాటను గమనిస్తే, పల్లవి రెండో పాదం చివర 'గుప్పెడువాడు'; మొదటి చరణం చివర 'నమ్మినవాడు'; రెండో చరణం చివర 'నచ్చినవాడు; మూడో చరణం చివర 'పాలించినవాడు'. ఇలాటివి ఖాఫియా, రదీఫ్‌లను గుర్తుకు తెస్తై. ఇవి పూర్తి నియమాలుగా పెట్టుకుని పాటలన్నీ రాశాడని చెప్పడం నా భావం కాదు గాని, ఎన్నో పాటల్లో ఈ స్పృహ స్పష్టంగా కనిపిస్తుంది. అంతవరకు పోల్చడమే నేను చేయదలచింది. ఇది అన్నమయ్య పాటలకు అమేయ సౌందర్యానిస్తుంది.

## 4

క్షేత్రయ్య, అన్నమయ్య ఇద్దరూ గొప్ప కవితాత్మ గలవారే. అయితే వస్తువు గురించీ, శిల్పం గురించీ ఆలోచించినప్పుడు అన్నమయ్య వస్తు విస్తృతి చాలా ఎక్కువ. ఇద్దరిలోనూ గొప్ప తెలుగు నుడికారం ఉంది. అయితే క్షేత్రయ్యలో భావసౌందర్యం, పదమాధుర్యం ఉన్నత స్థాయిలో మిళితమైతే, అన్నమయ్యలో భావుకత, పదప్రయోగవైచిత్రి, శిల్పపు పోకడలు అత్యధికం. ఇద్దరూ దాదాపుగా ఒకే వస్తువుతో రాసిన రెండు పాటలను పోల్చిచూడడం, ఇద్దరి కవితాత్మ ఆవిష్కరణలో కొన్ని కోణాల్ని స్పష్టంగా తెలుపుతూంది. క్షేత్రయ్యది 'మగువతన కేళికా మందిరము వెడలెన్' అన్నపాట; అన్నమయ్యది. 'ఏమొకొచిగురుటధరమున' అనే పాట. రెండుపాటల్లోనూ ప్రియాసంగమానంతర ప్రేయసీ సౌందర్యాన్ని వర్ణించడమే వస్తువు. క్షేత్రయ్య మూడు చరణాల్లోనూ, ప్రతి పంక్తిలో ఒక్కొక్క చిత్రాన్నిచ్చాడు.

'విడజారుగొజ్జంగి విరి దండజడతోను
కడుచిక్కువడిపెనగుకంటిసరితోను
నిడుద కన్నుల దేరు నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున తడబడెడు నడతోను' -

ఇలా చరణాల్లోని ॥ పాదాలూ ॥ వాస్తవిక చిత్రాల్ని గొప్ప తెలుగు నుడికారంతో అందిస్తై. చిత్రకారుడు అన్నింటినీ ప్రతిఫలింపజేస్తూ, అద్భుతమైన చిత్రాన్ని గీయవచ్చు. ప్రాసలక్షణాలూ, యతిస్ఫురణలూ కూడా పాదసౌందర్యాన్ని వ్యక్తం చేస్తై.

అన్నమయ్య పాటలోనూ ప్రాస, యతిస్ఫురణలున్నై: అంతేగాక తెలుగు పలుకుబడి అందాలున్నై. ఇంకా ఇందాక చెప్పిన ఖాఫియా, రదీఫ్‌ల పోలికలు బాగా ఉన్నై. అయితే, ఈ పాటలోని ప్రాణమంతా భావుకతలో ఉంది. బొమ్మ గియ్యడానికి అందని భావగాఢత పాట నిండా పరుచుకుని ఉంది. చిగురులాటి పెదవి మీద అక్కడక్కడ కనిపించే కస్తూరి తునకలు ప్రేమలేఖలోని అక్షరాల్లాగా ఉన్నై. కన్నుల చివరి ఎరుపు, ప్రాణేశ్వరునిపై నాటిన కడగంటి చూపుల్ని, ఉన్నట్లుండి పెరికేస్తే అంటుకున్న నెత్తురులా ఉంది. పయ్యెద లోపలి స్తనాల మెరుగులు పైకి వ్యాపించడం ఎందుకంటే, ప్రియుడు కల్పించిన నఖచంద్ర రేకలు బయటికి వెన్నెలల్ని ప్రసరిస్తున్నై. చెక్కుల అంచుల ముత్యపు 'జల్లులు', వేంకటపతి కారణంగా ఆమె ముఖం మీద పట్టి చెమటల అందంలా ఉన్నై. ఈ కవితలోని ఎన్నో కవితా సౌందర్య విశేషాల్ని అలా ఉంచి, అతి స్పష్టంగా వ్యక్తమయ్యే విషయం అన్నమయ్య తీవ్రమైన భావనాశక్తి సౌందర్యం. క్షేత్రయ్య పాటలో కనిపించినవి అద్భుతమైన చిత్రాలైతే, అన్నమయ్య పాటలో కనిపించినవి ఆశ్చర్యకరమైన భావచిత్రాలు. నిజమైన కవిత్వానికి కొలమానాల్లో ముఖ్యమైనవి భావచిత్రాలే. ఇప్పుడు వివరించబడింది, కవితా విషయకమైన తులనాత్మక పరిశీలన.

## 5

అన్నమయ్య, క్షేత్రయ్య - యిద్దరూ తెలుగు జాతి గర్వించదగిన అసమాన వాగ్గేయకారులు. తెలుగు భాషను తెలుగుజాతి కాపాడుకోగలిగితే, ఈ యిద్దరూ ఎప్పటికీ, గొప్ప స్ఫూర్తిని కలిగించే మహావ్యక్తులు.

# "క్షేత్రయ్య పదాలలో సాంఘికాంశాలు"

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

క్షేత్రయ్య పదాలు సంగీత-సాహిత్య-అభినయాలకు త్రివేణి సంగమం. క్షేత్రయ్య తరువాత సారంగపాణి వంటి పదకర్తలు పదాలు సృష్టించినా, పదవాఙ్మయ ప్రపంచ చక్రవర్తి, క్షేత్రయ్యమే. కవిత్రయయుగం తరువాత వచ్చిన శ్రీనాథయుగం లోనూ, శ్రీనాథయుగం కంటె ప్రబంధయుగంలోనూ, ప్రబంధయుగం తరువాత వచ్చి దక్షిణాంధ్రయుగంలోనూ, ఉత్తరోత్తరం బలీయంగా, సాహిత్య ప్రక్రియలలో శృంగార రస ప్రాధాన్యం హెచ్చుతూ వచ్చింది. విజయనగర సామ్రాజ్య పతనానంతరం - దక్షిణాంధ్రంలోని తంజావూరు, మధుర, మైసూరు, పుదుచ్చేరి - ప్రాంతాలకు చెందిన నాయకరాజులు, కళాభిమానులై, కళా సాహిత్యాల పట్ల, ఆదర భావాన్ని ప్రదర్శించారు. విద్యా పోషకులై వారు గాయకులనూ నాట్య కర్తలనూ ఆహ్వానించారు; అనేక విధాలుగా సత్కరించారు. ఆనాటి కవిత్వానికి ముఖ్య ప్రయోజనం ఆనందప్రదానం మాత్రమే. ఈ దృష్టితో, నాటి వాఙ్మయ ప్రక్రియలలో శృంగారం విచ్చలవిడిగా వర్ణితమైంది. సుభిక్షంగా, సుఖసంతోషాలతో జీవించే ఆనాటి ప్రజలు శృంగారమంటే ఉవ్విళ్లూరుతుండేవారు. తారా శశాంకవిజయం, సారంగధర చరిత్రం, అహల్యాసంక్రందనం మొదలైన ప్రబంధాలు విశృంఖలశృంగార వర్ణనకూ నీతి దూరమైన ఇతి వృత్త పరిగ్రహణానికీ నిదర్శనాలు. అసభ్య శృంగారానికి ఆలవాలమైన ఇలాంటి కావ్యాలను గమనించియే, కొందరు విమర్శకులు ఆయుగాన్ని 'క్షీణయుగం'గా పరిగణించారు. అప్పటి కవులు శృంగార ప్రియులు కావడానికి కారణం ఆనాటి సమాజం; నాటి కాలప్రభావం, అంతే. అందువల్లనే, క్షేత్రయ్య, వేణుగోపాలస్వామికి పరమ భక్తుడైనా, ఆ కాల ప్రభావం నుంచి తప్పించుకోలేక పోయాడు. ఆతని పదాలన్నీ శృంగారరసప్రధానాలై, కొన్ని కొన్ని సందర్భాలలో, సభ్యతామర్యాదను కూడా అతిక్రమించడానికి హేతువు, ఆనాటి సాంఘిక పరిస్థితులే. పదిహేడవ శతాబ్దానికి చెందిన క్షేత్రయ్య పదాలన్నింటిలోనూ రసం శృంగారమే.

శృంగారరసభేదాలన్నీ ఆతని పదాలలో గోచరిస్తాయి. సంభోగ-విప్రలంభ శృంగారంలో ఉన్న ప్రభేదాలన్నిటికీ క్షేత్రయ్య పదాలు లక్ష్యంగా నిలుస్తున్నాయి; చౌశీతి బంధాలూ, ఉపరతులూ, సమరతులూ ఆతని పదాలలో ప్రత్యక్షమవుతాయి.

క్షేత్రయ్య దర్శించిన దైవాలలో వైష్ణవాంశ సంభూతులే ఎక్కువ. ఆ దైవాలన్నిటి లోనూ, ఆతడు, తన ఇలువేల్పు అయిన మువ్వగోపాలుణ్నే దర్శించాడు. ఆతడు కొలిచిన దేవతలలో శ్రీశైలమల్లికార్జునుడు, శివకంచి ఈశ్వరుడూ ఉన్నారు. ఆ విధంగా క్షేత్రయ్య శివకేశవాద్వైతభావాన్నీ సమ దర్శిత్వాన్నీ ప్రదర్శించాడు. ఆతని జీవితంలోని ఈ సన్నివేశం ఆనాటి సంఘంలో ఉన్న శివ కేశవ అభేద భావనను ప్రకటిస్తున్నది.

క్షేత్రయ్య కాలంలో తమ కోర్కెలు తీరడానికి స్త్రీ పురుషులు కలువ పువ్వుల పూజలు, నాగులచవితివ్రతాలు, లక్ష్మీ కల్యాణం, పున్న మొక్క ప్రొద్దు, వసంతచతుర్దశి, గౌరీపూజ మొదలైన పండుగులను నిర్వహిస్తుండేవారు. ఆరతు లివ్వడం, నిత్యాభిషేకాలు చేయడం జాగరాలు చేయడం ఉండేవి.

"ఇన్ని విధముల బూజించేర సామి!-యింతనను గూర్చుమీ" అనే పదంలోని-

"కన్నెమోము నేను గనుగొన గలిగిన
**పున్న మొక్క ప్రొద్దుండేర**! సామి!
కన్నులు ముద్దాడ గలిగిన **నేజంట**
**కలువపువ్వుల** పూజించే! సామి!
సన్న నూగారంట గలిగిన - **నాగుల**
**చౌతి వ్రతము** లుండేర సామి"

"శయ్యపై దాని నన్నెనయ జేసిన **వసంత**
**చతుర్దశి** చెల్లించేర! సామి!"

"మేలుగ రతులను మెలగిన నీకు **ల**
**క్ష్మికి గల్యాణము** చేసేర! సామి!"

"ఎల మావి తోటలో - నింపొంద నొకనాడు
యెలమి **గౌరిపూజ** - సలుపుచుండగా"

('పిలువనంపెనన్నీవేళ' అనే పదంలో)

అనే చరణాలు అందుకు ఉదాహరణాలు.

ఆనాడు స్త్రీలు, పురుషులతో చదరంగమాడే వారని ఈ క్రింది చరణాల వల్ల తెలుస్తున్నది-

"పదము బాడగ వినేవో! చదరంగ మే చూచేవో?
సదయుడ! కౌగిలించేవో! చక్కెర కెమ్మోవే నొక్కేవో"
("ఏమనేవానతీరా" - పదం)

"శృంగారవనములో చెలువుడు నేను
రంగు మీరగ చదరంగ మాడగను"
("తరుణిరో నా ప్రాణేశుని" అనే పదంలో)

ఆనాటి ప్రజలలో సంగీతాభిరుచి అధికంగా అగుపిస్తున్నది. ఒక విధంగా ఆ కళ సమాజంలో సర్వసాధారణ మనే చెప్పాలి. ఆనాటి స్త్రీలు, ప్రధానంగా, కళా ప్రియలుగా కనిపిస్తారు. వీణ మీటుతూ పదం పాడడం, తంబురా శ్రుతి చేసి సంచుపాట (శృంగారపదం) పాడడం, కిన్నెర మీటడం, పిల్లనగ్రోవి ఊదడం, సొగసు పాటలు (శృంగారపదాలు) పాడడం, ఏల పదాలు ఆలపించడం, మదనుని మీద పదాలు గానం చేయడం - ఇవన్నీ ఆనాటి స్త్రీ సమాజంలో సామాన్యం. "ఇంత మోహ మేమిరా" - అనే పదంలోని -

"సంతోషముగ నాడు నా తంబుర మీట-సంచు పాట పాడునా?"
"దాని నన్ను సాటి సేయ తగునా యేమోయి జాణ!" అనే పదంలోని -
"అందమైన వీణచేత బూని - అనురాగములే మీటి
పొందుగాను పదకవిత్వముల - పలుక నేర్చునా?"

అనే నాయిక మాటలు ఇందుకు నిదర్శనం. పాటలన్నీ వాద్య సహకారంతోనే సాగేవి -

"సామాన్యము గాదె! వాని పొందు" అనే పదంలోని-
"పాయపు హంతకారి కావలె వాని పదపద్య రచన
సేయ నుత్తర మీయ వలె వాని ముద్దు కవిత తా
వ్రాయ చదువ నేరవలె ఆ వగలయందు
గాయకురాలుగా వలె ఓ చెలియరో!

ఆటకు మేటిగా వలె తంబుర
గోట మీట రాగ మనవలె వానిపై సొగసు
పాటలు వినుపించవలె"

- వంటి చరణాలు అందుకు తార్కాణాలు. శృంగార సన్నివేశాలలో పురుషులు కూడా 'ఏల పదములు' పాడేవారు- "ఎచ్చోట నున్నాడో! చెలియ! వాడే మనుచున్నాడో?" అనే పదంలోని

- "వాలాయముగాను - వాతెర యానుచు
ఏలపదము బాడుచు - నెలమి సొక్కించుచు"

అనే చరణాలు ఇందుకు దృష్టాంతాలుగా నిలుస్తునాయి.

ఆనాడు మగువలేకాక మగవాళ్లు కూడా పూలు ముడుచుకునే వాళ్లు ముత్యాలసరాలు ధరించేవాళ్లు -

"ఇటువంటి వాడని నే దెలియనైతిని" - అనే పదంలోని

"మరుకేళి నెనసిన - మందె మేలము చేత
తరళాక్షి! ముత్యాలసరులు తా ధరియించి
విరులహారమని - విడువకయిచ్చుట
మరపున వచ్చెనే - మగువ మువ్వగోపాలుడు" అనే పంక్తులూ

"కోడి కూసెనయ్యయ్యో" అనే పదంలోని -

"విరులు శిఖ నిండ జుట్టి - వింతగా సొమ్ముల బెట్టి" - వంటి చరణాలూ అందుకు నిదర్శనాలు.

ఆనాటి అతివలు అలంకరించుకున్న ఆభరణాలలో - ముక్కెర, వజ్రాల కమ్మలు, ఉంగరాలు, కంటసరులు, ముత్యాలసరాలు, సరిపెనలూ, చీనా సరి పెనలూ, నాగ సరాలు, తాటంకాలు, బంగారు గాజులు, బన్న సరములు, రత్న రసములు, మొగ్గ మట్టెలు వంటివి కొన్ని మాత్రమే

"ఎన్నటికో నా కొమ్మను జూచేది" - అనే పదంలోని -

"వన్నలాడి **బన్నసరులు** నాయురముపై యూగాడ";

"కలికిరో! యింకొకసారి యుపరతి - కలియక నే తాళజాలనే"

- అనే పదంలోని -

"**తాటంకము**లిరుగడ గులుక - తళుక్కుమని నా చెక్కిలి బెళుక";

"చాలు చాలు యీ చిన్నెలతో" - అనే పదంలోని -

"కన్నియగుంపుల - **గాజుల**నొక్కులతోను";

"తెలియవచ్చెనురా నీ వగలెల్ల" - అనే పదంలోని -

"సందిటి **బంగారు గాజుల** దద్దు -
సకియ దిద్దిన నుదుటి తిలకముముద్దు";
"పుట్టు భోగీంద్రుడలుకల కోర్వజాలడో?" అనే పదంలోని -

"చలమేల **మొగ్గమట్టెల** పోట్లగంట్లచే
అల రమణు మేను పులి పులి యైనది";
" మగువ తన కేళికా మందిరము వెడలెన్" - అనే పదంలోని -

"కడు చిక్కు బడి పెనగు - **కంటసరితోను**";
"మనసు నిన్నెడబాయదు ప్రాణేశ!" అనే పదంలోని -

"సిస్తుగ వీణమీటి - విస్తారముగా **రత్నసరములు** నాకొసగి";
"మేలుమేలురా - నిన్ను-మెచ్చవచ్చురా!" అనే పదంలోని -

"అల దానికి **చీనా సరిపెనలా** - ఔరా! పాలతా తోనే సరి పనులా!"
"రమణికి బిరుదు **నాగసరాలా?**" - వంటి పంక్తులు

అందుకు ఆదర్శంగా చూపించవచ్చు.

ఇక ఆనాటి వనితలు ధరించే వస్త్రాలలో పట్టుపటాని, రవసెల్లా, 'మేటి చందురు కావి పావడపై పసిడి పట్టు చేలము', 'చందురు కావి పసిండి సరిగంచు పయ్యెద', పసుపు దుప్పటి వల్లెవాటు, సరిగ కోకలు, మేటి పై ఠాణి కొంగు, చలువ చీరెలు, సన్న వలువలు, చెంగలు రవికలు వంటివి కనిపిస్తాయి.

"తెలియ వచ్చెనురా! నీవగలెల్ల" - అనే పదంలోని -

"అల దాని పసుపు దుప్పటి **వల్లెవాటు**";

"నీకెదయ రావలె గాక" - అనే పదంలోని -

- "క్రొన్నన వంటి మేను చిక్కిన
**సన్న వలువలు** గట్టక యున్న"

"మగువ యింత దుడుకు తగునే వానికి" - అనే పదంలోని -

**"పట్టు పటాని పూల - పావడ** సరి గల
బుట్టాల **రవశల్లా** - గట్టిగా వచ్చి;"

"ఎన్నటికో నా కొమ్మను జూచేది" అనే పదంలోని -

**"మేటి చందురు కావి పావడపై పసిడి**
**పట్టు చేలము** చాల పను మీర గట్టి;

"మనసు నిన్నెడ బాయదు ప్రాణేశ!" అనే పదంలోని -

"**మేటి పైఠాణి కొంగు** జారగదీసి-గోట గుబ్బల జెనకి" - వంటి చరణాలను ఉపపత్తులుగా ఉద్ధరించి చూపవచ్చు.

ఇక పురుషులు ధరించే వస్త్రాలలో - బంగారు దుప్పటి, బురుసు రుమాలు, తురాయి, చలువదుప్పటి, బిగియుదట్టి, వలెవాటు - వంటివి ప్రత్యక్షమవుతాయి. "ఇంత మేలు దానవా ఓ చెలియ!" అనే పదంలోని -

"వాని **బంగారు దుప్పటి** - వాసన జూచి";
"కోడికూసె నయ్యయ్యో" - అనే పదంలోని -

"**బురుసురుమాలు** జుట్టి - పొందుగా తురాయి చెక్కి";
"కోపము రాదా? - యెవ్వరికైన" - అనే పదంలోని -

"సరసిజాక్షిరో! వాడ - **చలువ దుప్పటి** తోడ";
"చేత కాసులేదె కాని - చేసైగలే" - అనే పదంలోని

"వల్లె వాటు వేసి యిందు - వచ్చి మెల్లనే"; - వంటి పంక్తులు ఇందుకు ప్రామాణ్యాలు. ఇక స్త్రీల అలంకార విశేషాలలో - కస్తూరికామకరికలు చెక్కిళ్లపై దిద్దుకోవడం, వక్షః స్థలాలపై జవ్వాజిని అద్దుకోవడం, తిలకాన్నీ, కస్తూరినామాన్నీ పెట్టుకోవడం చెప్పుకోదగ్గవి. పురుషులు గీరుగామం పెట్టుకునేవారు. "అయ్యలూ! నీ విట్ల- అలగి యుందుర!" అనే పదంలోని-

"కలికిరో! రమ్మని **కస్తూరి మకరికల్**
వలచు చెక్కిళ్లపై - వ్రాయునపుడు" -;

"ఇన్నాళ్ల వలెగాదమ్మా!" - అనే పదంలోని -

"మిసమిసలాడునా - నొసలిపై **తిలకము**
పొసగ దిద్దుచువాడు - బొందుగ నలదాని"

"కోడి గూసె నయ్యయ్యో!" అనే పదంలోని -

"చెలువుని యెదురేగి చెలగించి తోడిదెచ్చి
గళము పైని గందమలది - **కస్తూరి నామమే** దిద్ది";

"చాలుచాలు యీ చిన్నెలతో" - అనే పదంలోని -
"అలదాని కుచముల - నలదిన **జవ్వాజి**";
"చేతకాసులేదెకాని - చేసైగలే" - అనే పదంలోని -
"**గీరునామము** బెట్టి - గిలుకు పావాలు మెట్టి" - వంటి
పంక్తులను ఇందుకు ప్రయోగాలుగా చూపవచ్చు.

ఆనాటి సంఘం వాడుకున్న విలాస భోగ్య వస్తువులలో కస్తూరి, కర్పూర విడెము, చలువ గంధం, జాజి విరులసరాలు, గొజ్జంగి విరులదండలు, పన్నీరు, జవ్వాజి వంటివి ప్రధానంగా గోచరిస్తాయి.

"తెలిసె నీ నెనరులేని జాడలు" - అనే పదంలోని -

"తనివిదీర మో విచ్చి **కర్పూర-తావిమడుపులీవా?**"

"ఇంత విరహము-పలుక వెరపగు-యింతి దాయెటుసైచెనో" అనేపదంలోని-

"**గంధ** మెండిన గంధవతి కుచకలశమున - కన్నీటి వెల్లువచింది";

"ఇక్కడ లేదే మనసు - ఇంతిరో వానికి" - అనే పదంలోని -

"వచ్చినప్పుడు ప్రేమచే- వాని నెమ్మేని నిండ
**పచ్చి కస్తూరి** యలదియే - పాటి దంటేను" -;

"పుట్టు భోగీంద్రు డలుకల కోర్వజాలడో?" - అనే పదంలోని -

"అల మువ్వ గోపాలు నలమి కౌగిట జేర్చి
పొలుపు కెమ్మోవి **కప్పుర** విడె మీయవే";

"ఏటి మమత, యెక్కడియాస-యెవ్వరికెవ్వరే?" - అనే పదంలోని -

"కురులు దువ్వి ముడువ లేద - **విరిసరులు** జుట్టలేద?";

"అవునమ్మ! మీకేమి-అందరు బోధించేరు" - అనే పదంలోని -

"పదముల మీద కడుగ - **పన్నీరు** చేబూని"
సుదతి నంపినా రాక - చులకనగా జూచేగాని";

"చాల యిందుకే నా మనసు - జాలి బొందెరా" - అనే పదంలోని

"సదయుడ! పడకింటిలో - **జవ్వాజి** దెచ్చునంతలో
ఎదురెదురే జూచే - వింక నేలాగో!";

"ఈ రీతి మదన సామ్రాజ్య-మిచ్చిన చెలి-నేరీతి మది నెడసియుందు" - అనే పదంలోని -

"విడిచిపోలేకనడ-వడిగొన్నసరులతో"
ముడిగొన్న చన్నుగవ సొరు కొప్పు నను
సడలి యాడెడు విరులచేరు........." -
వంటి పంక్తులు లక్ష్యాలు.

ఆనాటి సమాజంలో శ్రీమంతులు తమ పడకటిండ్లల్లో చిలుకలను గోరువంకలను పెంచుతుండేవారు. ఇందుకు ఉదాహృతులు ఈ చరణాలు -

"ఇంత మేలుదానవా! ఓ చెలియ" అనే పదంలోని -

"చెలులొక్కరును లేరు - **చిలుక** పంజరమున
బలుక కున్నది యల్ల - భావమేమో";

"ఈ లాగటవే! బుద్ధి యిందు బింబాననా" - అనే పదంలోని -

"విద్దెలు చదువక - పెంచిన చిలుకకు
సుద్దులు తెలుపక -సుదతిరో నీవు";

"మోస బోదునా వానికి నేడు" - అనే పదంలోని -
"కోరిక మీర వాని వేడుక కొంకక - **గోరువంక** దెమ్మన్ననేగి

కూరిమి నాచెలి గోరువంక తెచ్చి" - వంటి చరణాలను ఇందుకు నిరూపణంగా చెప్పవచ్చును.

ఆనాటి ప్రజలు పట్టె మంచాలను, బంగారు మంచాలను, పూల పాన్పులను, మేడలపై తూగుటుయ్యాలలను, చలువ చప్పరాలను కొల్లలుగా వాడుతుండేవారు. అందుకు లక్ష్యాలు ఈ క్రింది పంక్తులు -

"ఇంతలోనే అల్ల వాని నన్ను గూర్చి-యెడ బాయ జేసెగా దైవము" - అనే పదంలోని -

"బాల నెనరున ముచ్చట లాడుచు, **విరుల-పానుపు**పై నుంటిమా"?
"ఇన్నాళ్లవలెగాదమ్మా!" అనే పదంలోని-

"**చలువచప్పరములో** - సవతి నేనుండగ
బలిమి నాదుకొంగు - బట్టుక చాటున";

"ఎవరి వల్ల దుడుకు మా-యిద్దరిలో సఖియా" - అనే పదంలోని

"రమణి! **బంగారు మంచము**పై నిద్దరు చాల
మమతతో సరసంపు మాటలాడే వేళ";

"చక్కనయ్య! యేమి యుప-చారములే సేయింతును" - అనే పదంలోని -

"**మల్లెపూల పాన్పు** పైని - చల్లని మొల్లలే పరతునో?";

"ఎన్నటికో నా కొమ్మను జూచేది?" - అనే పదంలోని

"జోడుగూడి తోడి రాగము బాడుచు
మేడపై నుండి మేల్మేలనుచు
వేడుకతో దాని విడువకనెప్పుడు
తోడ **బంగారు తూగుటుయ్యాల** లూగేది"

"ఇటువంటి వాడు రానేలే?" - అనే పదంలోని -
"పలు మారు గిలుకలు కోళ్ల **పట్టెమంచము**
ఘలుఘలు మంటేను".

శృంగార రసానురక్తమైన ఆనాటి సమాజంలో వేశ్యలు ఎక్కువగా ఉండేవారు. వారికి ప్రేమాదరణలుండేవి. నాటి వేశ్యలు రూపసంపద చేతనే గాక, విద్యలచే విజ్ఞానంచే సుశిక్షితలై అధికలై యుండేవారు. వారు దేవదాసులై, దేవ దాసీత్వాన్ని పొంది, భక్తురాండ్రై దేవాలయాలలో అభినయించేవారు. వేశ్యలలో చాలా మంది, డబ్బుకే ప్రాధాన్య మిచ్చినా, క్షేత్రయ్యకు మనసిచ్చిన మోహనాంగి వంటి దేవదాసులు కూడా ఆనాడు ఉండేవారు; దేవాలయాలలోనూ రాజాస్థానాలోనూ చతుర్విధ అభినయాలను ప్రదర్శించేవారు; సర్వ విధ శృంగారాను భావాలను ప్రకటించేవారు. రక్తీ భక్తీ రెండూ వారిలో కుసుమించి పరిమళించేవి. మోహనాంగి వంటి ఒక విశిష్ట పదకర్తృత్వ వ్యక్తిత్వ నిర్మాణానికి ప్రేరణగా నిలువడం, ఆనాటి సంఘ వృక్షానికి పండిన ఒక దివ్య ఫలంగా భావించవచ్చు.

"ఇంటి వెచ్చానికై పది **రూకల** మర్చినావా"
"**కాసువీసము** లేటికే - ఘనుని పొందే చాలునని
ఆస చెంది యుంటి గాని - అతివరో! వినవే"

"ఈ రేయి నన్ను గూడితే - ఇన్నూరు **ఘట్లి**చ్చేనని
సారెసారెకు వేడెనే ఓ యమ్మ! వాడు" -

మున్నగు పంక్తులను బట్టి ప్రజలు ఆనాడు వాడుకున్న నాణెములలో రూకలు, కాసు వీసములు, ఘట్లు వంటివి కనిపిస్తున్నాయి. ఇంకా వరహాలు, దుగ్గాని, మాడ వంటి విశేషమైన నాణెములు కూడా ఉండేవని ఆనాటి గ్రంథాల వల్ల తెలుస్తున్నది. వరహా అంటే బంగారు నాణెం.

క్షేత్రయ్య నాటి సమాజంలో కూడా లంచం ఉండిందని తెలుస్తున్నది. "అడుగరమ్మా! యతనిపై నూరక - అలగినానటరే?"- అనే పదంలోని -

"పూని దానింటికి పోగాను మా- పాలతి చూచి బెదరించిన
దానికి **లంచ**మిచ్చెద నన్నది - తానో? నేనో?"

"ఇంటికి రానిచ్చేనా? యీ మేనితో - నింతి వాని దలచేనా?" అనే పదంలోని

"ఇతనికి వెరచి నే-నిక **లంచ**మిచ్చేనా
ఇన్నాళ్ల వలె ననుస-రించేనా? " -

వంటి చరణాలను అందుకు తార్కాణాలుగా పేర్కొనవచ్చు.

ఆనాటి సంఘంలో వశీకరణ-ఔషధాలకు ప్రచారం ఎక్కువగా ఉండేది. పెట్టు మందులుండేవి. శకునాల మీద విశ్వాసం, దృష్టి దోషాల పట్ల నమ్మకం ఉండేవి. "అయ్యయ్యో! నా వంటి తొయ్యలి నేచేది?" అనే పదంలోని -

"కలనైన నాయిల్లు - కదలని వానికి
చెలియ **పెట్టిన మందు** తలకెక్కెనో";

"ఇందుకేమిసేతునమ్మ- యెవరు తోడి తెచ్చెదరమ్మా" అనే పదంలోని-
"తెలియనైతి మా యిద్దరి వలపు - **దృష్టిదాకె** నమ్మ లార"-;
"ఊరికి పోక నేడిం - దుండేది మేర" అనే పదంలోని -

"తొలుత నేనొచ్చేటప్పుడు - తోచీని మనసుకెంతైనా
యెలనాగ! నా **కన్నద**రె - యేమి సేతునే?
పలుమారు నన్ను పేరను పలుకరించడేమో తెలియదే
చలమేల నన్నం పరె - **శకునము** మళ్లించవలెను",

"ఎంతలేదని యెంచకురా!" - అనే పదంలోని -

"ఇక్కడ నుండ మనసాయ - నిదియేమో తెలియ నీ మాయ
**చొక్కు** **పొడి** చల్లి నట్లాయ - సుగుణవిధేయ!" -
"ఎలమి **నీవామ** **భుజ** - మిపుడదిగో యదరీనే"

వంటి చరణాలు అందుకు ఉదాహరణాలు.

ఆనాటి రసిక సంఘంలో మగువలలో కూడా మదన శాస్త్రానికీ కొక్కోక శాస్త్రానికీ సమధిక ప్రాచుర్య మున్నట్లు తెలుస్తున్నది.

"ఎంత లేదు నాతో-నీడు సేతుర!" - అనే పదంలోని -

"**కొక్కోక** **శాస్త్రము** జదువ నేర్చుగ
కుచముల నీ రొమ్ము గుమ్మ నేర్చున";

"ఏమిసే తునే? కొమ్మ!నే నెటుల సైతునే?" - అనే పదంలోని-

"ఒద్దిక తొడ చిక్కిట గోరు - లుంచనైతినో?
దిద్ది **మదనశాస్త్ర**మెల్ల - దెలుపనైతినో?

వంటి చరణాలు ఇందుకు నిదర్శనాలు.

ఆనాటి సమాజంలో ప్రియాప్రియులు చిలుకలతో ప్రేమ లేఖలు పంపించడం, విరహబాధతో చిత్రాలు గీయడం చేసేవారు.

ఉదాహరణకు- "ఏలాగు నే వేగింతునే? ఓ ముద్దు గుమ్మా!" -అనే పదంలోని-

"**చిలుక** **నంపిన** రాడాయనే నాతోనె ముద్దు
చిలుక మాటాడక పోయనే వానికిపుడు";

ఏమిసేయుదు? మోహ-మెటువలె దీరును?" - అనే పదంలోని-

"వెలయనీదు **ముఖార** - **విందంబు** **లిఖియించి**
యలరు వాసనలు వ్రా-యగ నేరనైతి";

"వచ్చే మనసో? రాని మనసో - వనిత నీవే దెలుసుకోవే?" - అనే పదంలోని-

"తొలుతటి మమతలు-చెలిమి లాలనవగలు
వలపులు వక్కణ **జాబు** - వ్రాసినదని" -

అనే చరణాలను గురిగా చూపవచ్చు.

ఇంకా - ఆనాటి సంఘంలో కవులకూ గాయకులకూ అసూయ లుండేవనీ, ఆనాటి కళా మూర్తులు నానారాజ సందర్శనం చేసి, నానా క్షేత్ర దైవతాలను దర్శించి, ఇహ పరాలను సాధించే వారనీ, ప్రతిభావంతులైన కళాకారులను నాటి సమాజం సత్కరించి, తన సామాజిక సాంస్కృతిక బాధ్యతనూ కర్తవ్యాన్ని నిర్వహించిందనీ క్షేత్రయ్య జీవితం చాటుతున్నది. ఆతడు రచించిన పదాలు అందుకు అక్షర సాక్ష్యాలుగా నిలుస్తున్నాయి.

# క్షేత్రయ్య పదాల్లో భక్తి భావచిత్రణ

డా. ముదిగంటి సుజాతారెడ్డి

**భ**క్తి తత్వంలో రెండు మార్గాలున్నాయి. ఒకటి: వైరాగ్యమార్గం. రెండు: రాగమార్గం. వైరాగ్యమార్గంలో భక్తులు కుటుంబజీవితాన్ని పరిత్యజించి సాంసారిక సుఖాలన్నిటికి దూరంగా వుంటారు. వైరాగ్యమార్గంలో ఎక్కువగా యోగ ఆధ్యాత్మిక జ్ఞానయుక్తమైన భక్తి వుంటుంది. ధ్యానం చింతనలలో భగవంతుని ఆరాధిస్తారు. పూజలు మొదలైన కర్మకాండలకు మూఢవిశ్వాసాలకు దూరంగా వుంటారు. ఆ మార్గంలో నిర్గుణ బ్రహ్మోపాసన వుంటుంది. వైరాగ్య భక్తులకు స్త్రీల పొడ గిట్టదు. సంసారమోహానికంతటికి స్త్రీలే కారణమని స్త్రీలను నిందిస్తారు. ద్వేషిస్తారు. కబీరు, రైదాసు, మన వేమనవంటి భక్తి కవులు ఈ మార్గంలో కన్పిస్తారు. కబీరు రామభక్తి సంప్రదాయానికి చెందినా రామనామజపమే గాని రాముని విగ్రహ పూజనంగీకరించ లేదు. రామదాసు త్యాగయ్యలు రామున్ని భక్తితో ఆరాధించారు. కబీరులాగా కాక వీళ్ళిద్దరూ సంసారులైవుండి భక్తిని అనుష్ఠించారు. అట్లా రామభక్తి సంప్రదాయంలో నిర్గుణ సగుణ మార్గాలున్నాయి. రామభక్తి సంప్రదాయంలోని సగుణ మార్గంలో కృష్ణభక్తి మార్గంలో లాగా భక్తి శృంగారం చోటు చేసుకోలేదు. ప్రభుధర్మం ఆదర్శ జీవితం నీతి సత్యధర్మ నిర్వహణలకు ఆదర్శంగా ప్రస్తుతిస్తు భక్తులు రామున్ని ఆరాధించారు.

రాగమార్గంలో భక్తులు విరక్తులు కారు. సాంసారిక సుఖాలకు దూరంగా వుండరు. ఈ మార్గంలో ఎక్కువగా కృష్ణభక్తి సంప్రదాయాలే కన్పిస్తాయి. కృష్ణుని లేదా విష్ణువు విగ్రహారాధనలు పూజాది కార్యక్రమాలు వైభవోపేతంగా జరుగుతాయి. కృష్ణభక్తిలో అనురాగం ప్రేమ శృంగారాలు బాగా చోటు చేసుకున్నాయి. వైరాగ్యభక్తి మార్గాలు ధ్యానం యోగం నిష్ఠలు ఎక్కువ చోటు చేసుకున్న నివృత్తి మార్గాలైతే కృష్ణ లేక విష్ణుభక్తి సంప్రదాయాలు భజన పూజలు కర్మకాండలు ఎక్కువ చోటు చేసుకున్న ప్రవృత్తి మార్గాలు. రాగమార్గంలో స్త్రీని ద్వేషించటం వుండదు. పైగా

ఆత్మ స్త్రీగా పరమాత్మ పురుషునిగా భావింపబడి స్త్రీ పురుషుల మధ్య వుండే శృంగార క్రీడల సంయోగాన్ని ఆత్మపరమాత్మల కలయికకు ప్రతీకగా గ్రహింపబడుతుంది. దీన్నే మధురభక్తి అంటారు.

క్షేత్రయ్య మధురభక్తి సంప్రదాయానికి చెందినవాడు. ఆంధ్రదేశంలో యోగజ్ఞానభక్తి మార్గాలే ఎక్కువగా ప్రచారంలో వున్నాయి. వైరాగ్యభక్తిమార్గాన్ని అనుసరించిన భక్తకవులే ఎక్కువ కన్పిస్తారు. కృష్ణ లేదా విష్ణుభక్తిలో కూడా మధురభక్తి సంప్రదాయం ఆంధ్రదేశంలో చాల తక్కువ. ఒక్క క్షేత్రయ్య మనకు మధురకవిగా భక్తుడుగా కన్పిస్తున్నాడు. అన్నమయ్య వైరాగ్య ఆధ్యాత్మిక సంకీర్తనలతోపాటు శృంగార సంకీర్తనలు వ్రాసాడు. కాని అతన్ని పూర్తిగా మధురభక్తి సంప్రదాయంలో చేర్చలేము. క్షేత్రయ్య ఒక్కడే పూర్తిగా మధురభక్తికి చెందినకవిగా కన్పిస్తున్నాడు. క్షేత్రయ్య కృష్ణభక్తుడు. తన గ్రామంలో వెలసిన మువ్వగోపాలున్ని ఆరాధించాడు. కాని అతడు కృష్ణభక్తిలో ఏ సంప్రదాయానికి చెందినవాడో చెప్పలేము. (మధుర భక్తిలో కూడా వేరు వేరు సంప్రదాయా లున్నాయి). కృష్ణ భక్తి సంప్రదాయంలో ప్రేమ శృంగారం ఆరాధనమార్గాలుగా కన్పిస్తాయి. తమిళదేశంలో ఆళ్వారుల భక్తి సంప్రదాయంలోనే మనకు ప్రేమశృంగారంతో కూడిన కృష్ణ లేదా విష్ణుభక్తి కన్పిస్తున్నది. పూజలు ఆరాధనలతో కూడిన ఆళ్వారుల వైష్ణవభక్తి సంప్రదాయంలో ఆళ్వారుల్లో ఒకతె అయిన గోదాదేవి రంగనాథున్ని కృష్ణుని రూపంలో ఆరాధించింది. ప్రేమతో రంగనాథున్ని భర్తగా భావించి వివాహం చేసుకుంది. ఇటువంటి ప్రేమశృంగారాలతో కూడి కృష్ణభక్తి సంప్రదాయం క్రమంగా దక్షిణ భారతం నుంచి ఉత్తర భారతానికి క్రీ.శ. 11, 15 శతాబ్దాల మధ్య వ్యాపించింది. అంతకు ముందు ఉత్తర భారతంలో వాసుదేవ భక్తి సంప్రదాయం వుంది. తర్వాత కృష్ణుని బాల్యక్రీడలను గానం చేయటం వుంది. కాని వాటిల్లో ప్రేమ శృంగారాలు లేవు.

ఉత్తరభారత దేశంలో నింబార్కుడు (క్రీ.శ. 11వ శ.) వల్లభాచార్యుడు (క్రీ.శ.15వ శ.) కృష్ణభక్తి సంప్రదాయాలను రూపుదిద్ది ప్రచారం చేసారు. ఇద్దరూ తెలుగువాళ్ళే. ఆంధ్రదేశం నుంచి పోయిన వాళ్ళే. నింబార్కుని కృష్ణభక్తి సంప్రదాయం మధురప్రాంతంలో బెంగాల్‌లో వ్యాపించింది. వల్లభాచార్యుల కృష్ణభక్తి సంప్రదాయం రాజస్థాన్ గుజరాతుల్లో వ్యాపించింది. ఇప్పటికీ ఈ సంప్రదాయం ఆ ప్రాంతాల్లో అధిక ప్రచారంలో వుంది. ఈ ఇద్దరు ఆచార్యులు కూడా కృష్ణున్ని ప్రధాన దేవతగా చెప్పారు. గోపికలకు, గోపికల భక్తికి, కృష్ణుని లీలలకు ప్రాధాన్యం ఇచ్చారు. రామభక్తితో భక్తులు రామున్ని ప్రభువుగా స్వామిగా భావించి "బ్రోవరా, కావరా"

అని భక్తి కీర్తనలు వ్రాసారు. కృష్ణభక్తిలో భక్తులు తమను తాము గోపికలుగా భావించుకుని కృష్ణున్ని నాయకునిగా భావించి ప్రేయసీరూపంగా సఖీరూపంగా ఆరాధించారు. ఆ తర్వాత క్రీ.శ. 15వ.శ. లో చైతన్యప్రభువు కూడా సఖీభక్తిని ప్రచారం చేసాడు. కృష్ణనామ స్మరణం ప్రేమ శృంగారమూర్తి అయిన కృష్ణున్ని ప్రేమశృంగార భావాలతో ఆరాధించటం చైతన్యమార్గంలో వుంది. నింబార్క వల్లభాచార్యులు, చైతన్యప్రభువు వివాహం చేసుకొని గృహస్థధర్మాన్ని నిర్వహించారు. వాళ్ళది ప్రవృత్తిమార్గం. క్షేత్రయ్య చైతన్యభక్తి మార్గం చేత ప్రభావితుడయ్యాడేమోనని అనిపిస్తుంది. చైతన్య ప్రభువుకు కొద్దికాలం తర్వాతనే క్రీ.శ. 17వ శతాబ్దారంభంలో క్షేత్రయ్య నివసించాడు. క్షేత్రయ్య వివాహం చేసుకొని గృహస్థుడైనట్లు తెలియటం లేదు. లోకంలో ప్రచారంలో వున్న ఒక కథను బట్టి క్షేత్రయ్య చదువురాని పామరుడు, గొడ్లను కాచుకునేవాడట. క్షేత్రయ్య ఒక్కొక్కసారి భక్తి పారవశ్యంతో తన గ్రామంలోని మువ్వగోపాలుని ఆలయంలో కూర్చునేవాడట. అటువంటి సందర్భంలో ఒక గొల్లపడుచు లేదా దేవదాసియో అక్కడికి రాగా ఆమెను చూసి క్షేత్రయ్య మోహించాడట. అప్పుడామె "మూర్ఖునివి నీతో నాకు పొందేమిటి" -అని నిరసించిందట. ఆ సుందరి వెళ్ళిపోగానే క్షేత్రయ్య నిష్ఠతో ఉపవాసం చేసి భగవద్ధ్యానం చేయగా మువ్వగోపాలుడు అనుగ్రహించాడట. అప్పుడు క్షేత్రయ్య అలౌకికానుభూతితో ధారగా గోపాలుని మీద పదాలు చెప్పాడట. వైరాగ్యం పూని తంబురను చేతపట్టి మువ్వగోపాలుని మీద పదాలు పాడుకుంటూ నానా పుణ్యక్షేత్రాలను సందర్శించాడట. దర్శించిన దేవుండ్ల మీద కూడా శృంగారపదాలను రచించాడు. ఆ విధంగా అసలు పేరు వరదయ్య నుంచి క్షేత్రయ్యగా క్షేత్రజ్ఞునిగా మారింది. ఈ కథ కన్న కొంచెం భిన్నంగా మరో కథ కూడా క్షేత్రయ్యను గురించి ప్రచారంలో వుంది. క్షేత్రయ్య తంజావూరు మధుర రాజుల ఆస్థానాలల్లో చేరి రాజుల మీద పదాలు చెప్తూ గౌరవసత్కారాలు పొందుతూ ఒకసారి స్వగ్రామం మొవ్వ వచ్చి గోపాలస్వామి దర్శనం కోసం దేవాలయానికి పోయి అక్కడ ఒక సౌందర్యవతి అయిన దేవదాసీని చూసి మోహించాడట. అప్పుడామె నువ్వు రాజులెందరి మీదనో పదాలు వ్రాసావు. భగవంతుని మీద పదాలు వ్రాయలేదు. నాకు మువ్వగోపాలుడే సర్వస్వం. ఆ దేవుని మీద పదాలు వ్రాసి నన్ను మెప్పించుమని షరతు పెట్టిందట. అప్పుడు క్షేత్రయ్య భగవద్ధ్యానం చేసి ధారగా మువ్వగోపాలుని మీద పదాలు వ్రాసాడట. ఈ రెండు కథలను బట్టి క్షేత్రయ్య అంతగా చదువుకోని సహజ ప్రతిభగల పదకర్త అని చాలా మంది భక్తకవులలాగా మొదట భోగాలనుభవిస్తు రాజుల నాశ్రయించి బతికి ఒక స్త్రీ ప్రేరణతో పదాలు వ్రాసాడని, గృహస్థుడు

కాకుండా నానా పుణ్యక్షేత్రాలను సందర్శిస్తూ సంచరిస్తూ పదాలు వ్రాసాడని తెలుస్తున్నది. కాని క్షేత్రయ్య పదాలను పరిశీలిస్తే అతనికి సంగీతం, నాట్యం, అలంకార శాస్త్రాదుల్లో మంచి పాండిత్యం వున్నట్లుగా తెలుస్తున్నది. కాని పామరుడుగా కన్పించడు. అదంతా అతనికి మువ్వసమీపంలోనే వున్న కూచిపూడిలోని, దేవదాసీల, నటుల, భాగవతుల పరిచయంతో కలిగింది కూడా కావచ్చును.

క్షేత్రయ్యది మధురభక్తి, సఖీభక్తి. భక్తుడు తనను తాను సఖిగా గోపికగా భావించుకుని కృష్ణుని పొందును కోరుతాడు. కృష్ణుడు రాలేదని విరహం చెందటం, అతని కోసం దూతికను పంపటం, రాకపోతే అలగటం, పరస్త్రీ గమనం చేసాడని ఈర్ష్యను ప్రకటించటం వంటి లౌకిక శృంగారంలో వుండే అవస్థలనన్నింటిని క్షేత్రయ్య తన పదాలల్లో వర్ణించాడు. అక్కడ క్షేత్రయ్య గోపికగా మారి పరమాత్మ కృష్ణుని పొందుకోసం ఆరాటపడుతాడు. ఆత్మపరమాత్మను చేరాలనే తపనే అతని పదాలల్లో చిత్రింపబడింది. పైకి అంతా శృంగారంలాగా కన్పించినా అంతటా భక్తితత్త్వచిత్రణే వుంది!

క్రీ.శ. 11వ శ॥లో నింబార్కుని కృష్ణభక్తి ప్రచారంతోనే కావచ్చును. క్రీ.శ. 12వ శ॥ వాడైన జయదేవుడు ఇంకా చండీదాసు, విద్యాపతి రాధాకృష్ణుల ప్రేమభక్తిని పదాల్లో వర్ణించారు. జయదేవుడు సంస్కృతంలో "గీత గోవిందం" పేరుతో వ్రాసిన అష్టపదులు ప్రజల్లో బాగా వ్యాపించాయి. సఖీభక్తి మార్గాన్ని ప్రచారం చేసాయి. చైతన్యప్రభువు బోధనలతో శృంగారరూపుడైన కృష్ణుని లీలలు గోపికల ప్రేమ రాసలీలలుగా ప్రచారం పొందాయి. భక్తులు ఆ రాసలీలలను అనుకరిస్తూ భక్త్యానందానుభవాన్ని పొందేవాళ్ళు. గోపికీ గోపికి మధ్య ఓ కృష్ణుడు వెలసి నాట్యంలో భక్తులు పాల్గొనే వాళ్ళు. మైమరచి భక్తులు కృష్ణుని లీలలను గానం చేసే వాళ్ళు. ఈ చైతన్య భక్తి మార్గ ప్రభావంలోనే క్షేత్రయ్య కృష్ణభక్తుడై పదాలు వ్రాసాడేమో. ఆంధ్రదేశంలో శివభక్తి, వేమన వంటి వాళ్ళ యోగభక్తి, మొల్ల పోతన రామదాసు త్యాగయ్యల రామభక్తి, అన్నమయ్య ఆధ్యాత్మిక భక్తి ప్రచారంలో వున్నాయిగాని కృష్ణభక్తి సంప్రదాయం మధురభక్తి ప్రచారంలో లేదు. క్షేత్రయ్య స్వగ్రామం మొవ్వపక్కన కూచిపూడి గ్రామం వుంది. క్రీ.శ. 1502 నాటికి సంగీత సాహిత్యం నాట్యం అలంకార శాస్త్రాదుల్లో నిపుణులైన భాగవతులు అక్కడ స్థిరపడినారు. కృష్ణుని లీలలను ముఖ్యంగా సత్యభామ వేషం కట్టటం, పారిజాతాప హరణ వృత్తాంతాన్ని వాళ్ళు నృత్యనాటకంగా ప్రదర్శించటం వుంది. అప్పట్నుంచే "ప్రేమగర్విత" అంటే "కృష్ణుడు తనను తప్ప ఇతరులను ప్రేమించటం" లేదని

గర్వించే నాయికగా సత్యభామపాత్రకు కూచిపూడి నాట్యంలో ప్రాధాన్యముంది. మొత్తం మీద క్షేత్రయ్య తన ఊరిలో వున్న దేవదాసీల నృత్యం చేతనే కాక కూచిపూడి భాగవతుల నృత్యాభినయాల చేత ప్రభావితుడై వుంటాడు. క్షేత్రయ్య సంగీతంలో ఒక బాణీని సృష్టించటమే కాక అభినయానికి అనుకూలమైన భావాలుగల శృంగారపదాలను రచించాడు. నాట్యంలో శృంగార భావాభినయానికి క్షేత్రయ్య పదాలు ఎంతో అనుకూలంగా వున్నాయి. రసస్ఫోరకంగా వున్నాయి.

క్షేత్రయ్య దాదాపుగా రామదాసుకు సమకాలికుడు. త్యాగయ్యకు కొంచెం ముందున్నవాడు. అప్పటికే అన్నమయ్య వెంకటేశుని ఆరాధిస్తూ పదాలు వ్రాసాడు. పదలక్షణాలను ఏర్పరిచాడు. 'పదం' అనేది తెలుగులో పామరులైన జానపదులు పాడుకునే పదాలు భక్తిపాటల నుంచే శాస్త్రీయమైన సంగీతం, రాగాల్లోకి ఎక్కిన ప్రక్రియ. క్షేత్రయ్య సంగీతాభినయాలు తెలిసినవాడు కాబట్టి తన భక్తి భావాల ప్రకటనకు 'పద' ప్రక్రియనే ఎన్నుకున్నాడు. క్షేత్రయ్య అన్నమయ్య పదప్రక్రియ చేత కూడా ప్రభావితుడై వుంటాడు. అన్నమయ్య రామదాసు త్యాగయ్యల పదాలు కీర్తనలు, సంకీర్తనలు అని పిలువబడుతున్నాయి. కాని క్షేత్రయ్య పదాలను 'పదం' అనే అంటారు. నాట్యంలో క్షేత్రయ్య పదాలను 'జావళీ'లని కూడా అంటారు.

ఆంధ్రదేశంలో కృష్ణభక్తుడు మధురభక్తి సంప్రదాయాన్ని అనుసరించినవాడు క్షేత్రయ్య ఒక్కడే కన్పిస్తున్నాడు. క్రీ.శ. 18వ శతాబ్దారంభంలో తూర్పుగోదావరి జిల్లాలోని కూచిమంచి అగ్రహారంలో జన్మించిన నారాయణ తీర్థులు తమిళదేశానికి వలసపోయి అక్కడ "కృష్ణలీలా తరంగిణి" పేరుతో కృష్ణుని చరిత్రను బాల్యక్రీడలను అభినయానికి అనుకూలంగా వుండేటట్లుగా సంగీతాత్మకమైన పదాలను సంస్కృతంలో రచించాడు. దక్షిణదేశాన్ని పాలించిన తెలుగు నాయకరాజుల్లో తంజావూరు నేలిన విజయరాఘవ నాయకుడు, మధురనేలిన ముద్దళగిరి కృష్ణభక్తిని అనుసరించారు. వాళ్ళిద్దరూ తమను తాము కృష్ణుని అవతారంగా భావించుకున్నారు కూడా. తంజావూరు సమీపంలోని మన్నారుగుడిలోని కృష్ణునికి రాజగోపాలుడనిపేరు. విజయరాఘవుడు మన్నారుదాసుగా, రాజగోపాలుడుగా ప్రస్తుతింపబడినాడు. ఆ రాజులను కృష్ణునిగా చేసి కవులు, కవయిత్రులు పదాలు కావ్యాలు వ్రాసారు. క్రీ.శ. 17,18 శతాబ్దాలు చాలా మంది రాజులు - లక్నో (అవధ్ రాజ్యం) లో వాజిద్ అలీషా, పుణేలో బాజీరావు పేష్వా మొదలైన పాలకులు కూడా తమను తాము కృష్ణుని అవతారంగా భావించుకొని రాసలీల నృత్యంలో పాల్గొనే వారలు. ఆ కాలంలో బ్రిటీషు ఈస్టిండియా కంపెనీ పాలన ఉచ్చులు బిగుసుకుంటున్నాయి.

రాజుల పాతకాలం నాటి కత్తులు యుద్ధవ్యూహాలు బ్రిటిషువాళ్ళ ఆధునిక పద్ధతుల ముందు వాళ్ళ కూటనీతి ముందు పనిచేయలేకపోయాయి. బ్రిటీషు కంపెనీ వాళ్ళ వ్యాపారదౌత్యాలు క్రమక్రమంగా చాపకింద నీళ్ళ లాగా విస్తరించాయి. వేడిలేని శౌర్యపరాక్రమాలతో జాతి నిర్వీర్యమైన పరిస్థితులు. అటువంటప్పుడు వాళ్ళకు రాజనీతి నిర్వహణలో పరిపాలనలో చేసేదేం లేదు. తీరిక సమయం ఎక్కువ. ప్రజలు కరువుకాటకాల వల్ల బాధపడ్తున్నా లెక్కచేయకుండా పన్నులు వసూలు చేసేవాళ్ళు. దాంతో రాజులు సంపన్నమైన శృంగార జీవితాన్ని గడిపే వాళ్ళు. కృష్ణుడు వాళ్ళకు ఆదర్శంగా నిలిచాడు.

క్షేత్రయ్య కృష్ణుని ఆరాధించిన విజయరాఘవుని, ముద్దళగిరి ఆస్థానాలలో వుండి వాళ్ళ మీద పదాలు వ్రాసాడు. అంతేగాక చెంజిలో సేనాపతి తుపాకుల కృష్ణప్ప నాయకుని ఆదరణను కూడా సంపాదించాడు. అట్లా క్షేత్రయ్య ఆంధ్రదేశంలోని మువ్వగ్రామ నివాసి అయినా దక్షిణ దేశంలోనే సంచరించాడు. రాజాదరణను పొందాడు. కాని పుణ్యక్షేత్ర సందర్శనలో తమిళదేశాన్నే కాక ఆంధ్రదేశంలోని కడప, తిరుపతి వేంకటేశ్వర్లను కూడా సందర్శించాడు. సందర్శించిన దేవుండ్ల మీద పదాలు చెప్పాడు. కాని అతని ఇష్టదైవం మాత్రం మువ్వగ్రామంలోని గోపాలుడే!

అన్నమయ్య ఆధ్యాత్మిక పదాలతోపాటు శృంగారపదాలను కూడా రచించాడు. కాని ఆయన శృంగారం అంత మితిమీర లేదు. కన్నడంలో అదే కాలం వాడైన పురందరదాసు తన రచనలో వాత్సల్యభక్తితోపాటు శృంగారాన్ని కూడా వర్ణించాడు. కాని ఆయన పదాల్లో కూడా శృంగారం మితిమీరలేదు. క్షేత్రయ్య పదాలు శృంగార పదాలు అనే పేరు పొందాయి. క్షేత్రయ్య పదాల్లో రాధ కన్పించదు. అతనిది గోపికాభక్తి శృంగారమే. క్రీ.శ. 16వ శ॥ వాడైన రూపగోస్వామి చైతన్య మహాప్రభువు శిష్యుడు. మొదటిసారి భక్తిని ఒక రసంగా నిలబెట్టే ప్రయత్నం చేసిన ఆలంకారికుడు! రూపగోస్వామి గోపిక కృష్ణుల మధ్య వుండే శృంగారమే "భక్తి" అని నిరూపించి చెప్పాడు. ఆ శృంగారమే "భక్తిరసం" అని స్థాపించాడు. దాన్ని బట్టి 16, 17 శతాబ్దాల్లో భక్తిశృంగారాలు ఎంతగా ఏకమయ్యామో మనకు తెలుస్తున్నది. బెంగాల్ నుంచి ఒరిస్సా వరకు వ్యాపించిన భక్తి తత్త్వం ఆంధ్రదేశంలోనూ ప్రవేశించింది. చైతన్య ప్రభు అనుయాయులే మన దగ్గర కన్పించే హరిదాసులు. వాళ్ళు "చాత్తాని - సాతాని" అని పిలువబడుతున్నారు. చైతన్య పదమే చ్చేతన్య-చ్చోత్తన - చాత్తాన - సాతాన గా మారింది. 16వ శతాబ్దారంభంలో వున్న క్షేత్రయ్యకు రూపగోస్వామి

శృంగార భక్తి రసం గురించి బాగానే తెలిసి వుంటుంది. ఆ మార్గంలోనే భక్తిశృంగారాన్నే క్షేత్రయ్య తన పదాల్లో చిత్రించాడు. గోపికా కృష్ణుల ప్రేమ విరహం సంయోగ శృంగారాలను వర్ణించాడు. క్షేత్రయ్య అలంకారశాస్త్రాన్ని బాగా తెలిసినవాడు కాబట్టి ఒక్కొక్క పదంలో గోపికను ఒక్కొక్క శృంగారావస్థకు ప్రతినిధిగా నాయికా భేదాలను పాటిస్తూ చిత్రించాడు. అయితే క్షేత్రయ్య వర్ణనల్లో పైకి లౌకిక శృంగారం కన్పించినా అంతరార్థరూపంలో, ప్రతీకల రూపంలో భక్తిభావచిత్రణలు నిక్షిప్తమై వున్నాయి. భాగవతంలో గోపికా కృష్ణుల ప్రేమ, రాసలీలల వర్ణనల్లో గోపికలు శ్రీకృష్ణున్ని చేరుకోవాలని అతనితో సంగమించాలని అతనితో ఐక్యం కావాలని కోరుకుంటారు. శ్రీకృష్ణుని రాక కోసం తపించటం, విరహం చెందటం వుంటుంది. ఇదంతా కూడా జీవాత్మ పరమాత్మను చేరుకోవాలనే భక్తి భావనకు ప్రతీకయే. జీవాత్మ పరమాత్మలో లీనం కావాలనే మోక్ష భావన చిత్రణయే. జీవాత్మ పరమాత్మలో చేరిపోవాలనుకోవటమే గోపిక కృష్ణుని కోసం విరహం చెందటం, సంగమించాలని కోరుకోవటంలోని పరమార్థం. శ్రీకృష్ణుని తోడి తెమ్మని లేదా తనను శ్రీకృష్ణుని దగ్గరికి తీసుకుపొమ్మని గోపికతన సఖిని అర్థిస్తుంది. కృష్ణున్ని రమ్మని ఆ సఖిని దూతగా పంపుతుంది. జీవాత్మ పరమాత్మను తెలుసుకోవటానికి గురువు అవసరం. ఈ సఖి ఆ గురువుకు ప్రతీకయే! గోపిక శ్రీకృష్ణుడు మరో గోపిక దగ్గరికి పోయాడని కోపగిస్తుంది, అలక చెందుతుంది. కుపితయై అతన్ని నిందిస్తుంది. కృష్ణుని శృంగారచేష్టలను తలచుకొని ఆనందిస్తుంది. ఇదంతా మనకు పైకి లౌకిక శృంగారం వలె గోచరిస్తుంది. కాని నిజానికిదంతా ప్రతీకాత్మకంగా జీవాత్మ పరమాత్మను తెలుసుకోవటమే! క్షేత్రయ్య పదాల్లో మనకిటువంటి ప్రతీకాత్మకమైన గోపికా కృష్ణుల ప్రేమ శృంగార వర్ణనలే కన్పిస్తాయి.

క్షేత్రయ్య పదాల్లో మనకు గోపికయే కన్పిస్తుంది. రాధ లేదు. క్రీ.శ. 10వ శ॥లో రచింపబడిందని నిర్ణయింపబడిన సంస్కృత భాగవతంలో గోపికలే గాని రాధ లేదు. క్రీ.శ. 12వ శ॥ వాడైన జయదేవుడు రాధాకృష్ణుల ప్రేమ శృంగారాలను చిత్రించాడు. అంతకన్నా పూర్వం అమరుక, గోవర్ధనాచార్యులవంటి కవులు వివిధ శృంగారావస్థలతో కూడిన లౌకిక నాయికా నాయకుల ప్రేమ విరహ సంయోగ శృంగారాలను లౌకికరూపంగానే వర్ణించారు. కాని కృష్ణభక్తి సంప్రదాయం వ్యాపించిన తరువాత జయదేవాది కవులు కేవలం లౌకిక నాయికల ప్రేమశృంగారాలను కాక గోపికా కృష్ణుల, రాధాకృష్ణుల ప్రేమశృంగారాలను వర్ణించటం ప్రారంభించారు. ప్రేమశృంగారాలను ప్రతీకలుగా చేసి భక్తి భావనలను చిత్రించటం మధురభక్తిలో భాగమైంది. మధురభక్తిలో రాధగోపికలు ఆత్మలకు ప్రతీకలు అయితే శ్రీకృష్ణుడు

పరమాత్మకు ప్రతీక. ఆత్మ పరమాత్మను ఆరాధించటం ప్రేమించటం, ఆత్మ పరమాత్మలో లీనం కావటం అంతా ప్రేమశృంగారాలుగా మధురభక్తిలో చిత్రింపబడుతుంది.

క్షేత్రయ్య పదాల్లో గోపికకు కృష్ణుని మీద వున్న ప్రేమశృంగారాలు ఆర్తి ఆర్ద్రతలతో వర్ణింపబడినాయి. సంయోగశృంగారం మర్యాదని అతిక్రమించి లౌకికశృంగారం వలె పచ్చి శృంగారంగా అశ్లీలంగా వర్ణింపబడిందని కొందరు విమర్శకులు తలంచారు. క్రీ.శ. 17,18 శ॥ల్లో అటువంటి పచ్చి శృంగార వర్ణనలున్న కావ్యప్రబంధాలను కవులు కోకొల్లలుగా వ్రాసారు. కావాలనే అటువంటి వర్ణనలకు అవకాశం కల్పించే తారాశశాంకం, అహల్యా సంక్రందనం, శుకసప్తతి వంటి ఇతివృత్తాలను ఎన్నుకొని కావ్యాలను రచించారు. అంటె ధార్మికంగానూ ప్రేమశృంగారంగల కృష్ణభక్తి వ్యాపించటం సమాజంలో భోగజీవితానికి ప్రాధాన్యం పెరగటం వల్లనే కవులు అటువంటి వర్ణనలున్న కావ్యాలను వ్రాసారు. భక్తిమార్గంలోనూ "శృంగారమే భక్తి" అని నిరూపింపబడిన కాలమది. కాబట్టి క్షేత్రయ్య మధురభక్తిని అనుష్ఠించినవాడు శృంగారానికి ప్రాధాన్యం ఇచ్చి భక్తి శృంగార పదాలను రచించాడు. క్షేత్రయ్య పదాలను "ప్రాచీన గ్రంథావళి" సీరిస్‌లో "సరస్వతీ పవర్ ప్రెస్" రాజమండ్రివారు 1950లో ప్రచురిస్తూ కొన్ని పదాల్లోకొన్ని చోట్ల భావాలు మరీ పచ్చి శృంగారంగా వున్నాయని భావించి వాటిని తొలగించి చుక్కలు వేసి అచ్చువేసారు. భక్తి ముసుగు చాటున శృంగార జీవితానికి అలవాటు పడిన కాలమది. కాల ధర్మాన్ననుసరించి క్షేత్రయ్య మితిమించిన శృంగారవర్ణనలను కొన్ని చోట్ల చేసాడు. కాని వాటిని భక్తి శృంగారంగా, ఆధ్యాత్మిక భావనలుగా తీసుకుంటే క్షేత్రయ్య శృంగారవర్ణనలు మనల్ని అలరిస్తూనే వున్నాయి. మధురభక్తిలో కృష్ణుడు పరమాత్మ ఒక్కడే పురుషుడు. భక్తులంతా గోపికలు. స్త్రీ పురుషులే కాదు. ఆఖరికి పశుపక్ష్యాదులు జీవం లేని పదార్థాలు అన్నీ స్త్రీలే! - "గోవింద ఏవ పురుషో బ్రహ్మాద్యాః స్త్రియ ఏవచ", "వాసుదేవ పుమానేకోః నార్యశ్చ సకలం జగత్" - వాసుదేవుడొక్కడే పురుషుడు. మిగిలిన చరాచర ప్రపంచమంతా స్త్రీలే అంటారు కృష్ణభక్తులు. అందుకే కృష్ణభక్తిలో సఖీభావం శృంగారానికి ప్రాధాన్యం. కృష్ణున్ని చేరుకోవటానికి భక్తుడు తనను తాను గోపికగా రాధగా భావించుకోవటమే కాదు స్త్రీలలాగా అలంకరించుకునే సంప్రదాయం కూడా ఒకటి ఉత్తర భారతంలో వచ్చింది. ఒకసారి భక్తురాలు మీరా మధురలో ఒక స్వామీజీని ఆశ్రమంలో దర్శించుకోవటానికి పోయిందట. నేను స్త్రీల దర్శనం చేసుకోనని ఆయన మీరాను చూడటానికి నిరాకరించాడట. అప్పుడు మీరా "ఈ లోకంలో శ్రీకృష్ణుడొక్కడే

పురుషుడనుకున్నాను!" అని అన్నదట. అప్పుడు స్వామీజీ భక్తిపరమార్థం తెలుసుకొని సిగ్గుపడి మీరాకు దర్శనమిచ్చాడట. అట్లా లోకంలో జీవాత్మలన్నీ పరమాత్మ కృష్ణుని పొందుకోరి అతనిలో ఐక్యం కావాలని విరహం చెందే గోపికలే! జీవాత్మతో పరమాత్మ చేసే లీలలే రాసలీలలు! సంగీతం అభినయాలతో ఆ రాసలీలలను అనుకరిస్తూ ఆనందం పొందటమే భక్తి. అటువంటి జీవాత్మ పరమాత్మల సంయోగాన్ని ప్రతిబింబించే శృంగార వర్ణనలే మనకు క్షేత్రయ్య పదాల్లో కన్పిస్తాయి. గోపికలు భర్తా సంసారమున్న వాళ్ళు పరపురుషగమనం చేసే వాళ్ళుగా కన్పిస్తారు. ఇదంతా భక్తి మార్మికత. కన్నె పిల్లల కృష్ణ ప్రేమ స్వచ్ఛమైన భక్తికి చిహ్నం కాగా సాంసారిక స్త్రీలు సంసార మోహంలో పడిపోయిన ఐహిక సుఖాలనాశించే జీవాత్మలకు ప్రతీకలు. ఆ స్త్రీల హృదయం పరమాత్మవైపు ఆకర్షింపబడటం, పరమాత్మ వాళ్ళ నాకర్షించటం, తన సాన్నిధ్యంలోకి రమ్మనటం, పరమాత్మ సాన్నిధ్యం కలుగనందుకు జీవాత్మవేదన చెందటం, జీవాత్మ మాయకులోనయి పరమాత్మను అనుమానించటం, నిందించటం వీటన్నిటినీ క్షేత్రయ్య గోపికలో లౌకిక శృంగారంగా చిత్రించి గొప్ప ప్రతీకాత్మకతలతో, ధ్వన్యర్థాలతో రచించాడు. కృష్ణభక్తి తత్వాన్ని అర్థం చేసుకున్న వాళ్ళు అతని పదాల్లోని పరమార్థం తెలుసుకొని ఆనందాన్ని అనుభవిస్తారు. శ్రీకృష్ణుడు వివాహితులైన సంసారమోహంలో పడిపోయిన గోపికలను ఆ సంసారమోహం నుంచి బయటికి లాగాలని చూస్తాడు. కాని గోపిక ఆ బంధంలో పడిపోయి నేను రానంటుంది. లోకమేమంటుంది అంటుంది. కాని కృష్ణుడు ప్రేమతో భక్తులనలరించి సంసారమోహంలో పడకుండా రక్షిస్తాడు. తన సాన్నిధ్యాన్ని ఇస్తాడు అంటే మోక్షప్రదానం చేస్తాడు. ఇక్కడంతా గోపిక సంసార బంధంలో కూరుకునిపోయిన జీవాత్మకు ప్రతీక! ఒక వివాహిత గోపిక భవబంధాల నుంచి బయటికి రాలేకపోవటాన్ని అసమర్థతను క్షేత్రయ్య ఒక పదంలో ఇట్లా చిత్రించాడు-

" వేళగాదుర గడియ తాళుర సామి
చాలు చాలు పదివేలకైన నిది
ఊరక నాపైని నేరమెంచకపోరుచుమా
బావగారున్నారోయి!
కూరిమి నా తోడికోడలి పడకింట
చేరిక యందుండ మేరగాదోయి
ఒద్దికతో మన మిద్దరము కూడి సుద్దులాడుట
కిది పొద్దుకాదోయి... "

పై పదంలో గోపిక వివాహిత అయివుండి కృష్ణుని పొందుకోరటం అశ్లీలంగా అనిపించవచ్చును. కాని లౌకికార్థాన్ని విడిచి పెట్టి అలౌకికార్థాన్ని తీసుకున్నట్లయితే ఒక భక్తుడు సంసారమోహబంధాన్ని విడిచిపెట్టటం నాతరం కాదనే వేదన కన్పిస్తుంది. క్షేత్రయ్య పైపదంలో చిత్రించిన భక్తిభావచిత్రణలోని చమత్కారం పాఠకులను, శ్రోతలను భక్తి తన్మయంలో ముంచేస్తుంది. అదేవిధంగా ఒక వివాహిత గోపిక ఇట్లా అంటుంది -

" నీ పొందు సేయక మాన మువ్వగోపాల ! నీ పాదమాన
నా పొందు నీ వెడ బాయకురా! చాలా
నమ్మితిరా! నిన్ను నా ప్రాణనాథ!
ఎవ్వరాడిననాడనీ మగడేమి చేసిన చేయనీ
నవ్వే వారెల్ల నవ్వనీ, యత్త
నన్ను దూరితె దూరనీ సామీ!
నీ పొందు సేయక మాన మువ్వగోపాల!"

ఇక్కడ భర్త అత్తను లోకరీతిని లెక్క చేయకుండ "పరకీయ" నాయికగా మారి శ్రీకృష్ణుని పొందును ఆశిస్తున్నది. ఇదికూడా అశ్లీలంగా అనిపిస్తుంది! కాని ఆధ్యాత్మికార్థాన్ని, ప్రతీకార్థాన్ని గ్రహించినట్లయితే సంసారజాలంలో పడిపోయిన జీవాత్మ ఆ జాలం నుంచి విముక్తిని కోరుతుంది. పరమాత్మ పొందును కోరుతున్నది. ఆ పరమాత్మలో లీనం కావాలని కోరుతున్నది, అనే భక్తి భావ చిత్రణ పాఠకులకు అర్థమవుతుంది!

కృష్ణునికి పదహారు వేలమంది గోపికలున్నారు. వాళ్ళంతా జీవాత్మలే! అందరూ అతని పొందు సాన్నిధ్యాన్ని కోరుకుంటున్నారు. లోకంలో ఒక ప్రియురాలి మీద మరో ప్రియురాలు ఈర్ష్యను చూపినట్లుగా పరసమాగమం చేసివచ్చిన ప్రియుని మీద అలిగినట్లుగా కోపగించునట్లుగా గోపిక నిందించటం క్షేత్రయ్య పదాల్లో చాలా చోట్ల కన్పిస్తుంది -

"ఇందెందు వచ్చితివిరా అలదాని ఇల్లు
ఈ వీధిగాదు పో పోరా
మందరగిరిధరుడైన మా మువ్వగోపాల
కుందరదన మదిగోరి ఇందు వచ్చితివా!"

వ్యంగ్యోక్తితో గోపిక శ్రీకృష్ణున్ని నిందిస్తుంది. ఆ విధంగా జీవాత్మ పరమాత్మతో

ఎన్నో విధాలుగా రమించటం అలగటం, ఈర్ష్య చూపటం, మళ్ళీ రమించటం అన్నిటినీ లౌకిక శృంగారంలో వలెనే వర్ణించి అలౌకిక పరమాత్మను సంధానాన్ని భక్తి భావాల చిత్రణను క్షేత్రయ్య చాలా కౌశలతతో ధ్వనింపజేసాడు.

ఒక గోపిక సఖితో ఇట్లా అంటుంది -

"వదరక పో పోలే వాడేలా వచ్చేను - వద్దు రావద్దనవే
అది యొక్క యుగము వేరే జన్మమిపుడు
అతడెవ్వరో నేనెవ్వరో ఓ చెలియా ! ...
వదరక పో పోలే వాడేల వచ్చేను... వద్దు రావద్దనవే ! ..."

సఖి ప్రియురాలికి ప్రియునికి మధ్య రాయబారం నడిపేది, పొందు కూర్చేది. ఆత్మకు పరమాత్మకు అనుసంధానం చేసే గురువె సఖి! ఇన్నాళ్ళు మరచిపోయిన ప్రియుని మీద గోపిక పైపదంలో కోపం ప్రకటిస్తున్నది. అంటె పరమాత్మ సాన్నిధ్యం ఆలస్యమైనందుకు ఈ అలక! జీవాత్మ వేదన!

"ఎవ్వడే ఎవ్వడే ఓ భామ! వీడెవ్వడే
ఎవ్వడే నేను పవ్వళించినవేళ
పువ్వుబాణము వేసి రవ్వజేసిపోయె
పట్టపగలు వాడు వచ్చి బలుదిట్టడై నా యిల్లు జొచ్చి నా
డటె! నన్ను చెట్టబట్టి కౌగిలించి
గట్టిగా నా మోవిగంటు జేసిపాయె!..."

అతడు నీలమేఘశ్యాముడు! స్త్రీల నేలిన మువ్వగోపాలుడని తెలుసు కుంటుంది. గోపిక చివరకు! జీవాత్మను ఆ ఎరుక పరమాత్మతో కలిపే భక్తి భావ చిత్రణ!

గోపిక మువ్వగోపాలుడు ఇద్దరూ పవ్వళించి కేళి జరిపేటప్పుడు వాళ్ళిద్దరి మధ్య మరో యువతి వచ్చి నడుమ చేరుతుంది! గోపిక మనిద్దరి మధ్య ఇది ఎవతెయని అడుగుతుంది -

"ఇద్దరి సందున పవ్వళించి యున్న యింతి పేరేమిరా
గద్దరి వగల మా మువ్వగోపాల! గాజుల చప్పుడు నేవింటిగదరా!
అప్పటప్పటికి నీదు కెమ్మోవి యానిన యలవాటు చేత
కప్పురగంది మోవి నా పంట గలయ నొక్కితిరా
అప్పళించి దాని మోవి తేనె అనుభవించితివేమో కాని

చప్పరించబోతే నమలిన చెరకు
పిప్పివలనే చప్పనై యుండె గదరా!
ఇద్దరి సందున పవ్వళించి యున్నయింతి పేరేమిరా?"

ఇద్దరి నడుమ అంటె జీవాత్మ పరమాత్మలను కలియకుండ మధ్య చేరిన స్త్రీ "మాయ"! జీవాత్మ 'మాయ' నే పరమాత్మగా భావిస్తుంది. కాని తర్వాత జీవాత్మ మాయను గుర్తిస్తుంది. మధురమైన కృష్ణ పరమాత్మ వంటిది కాదు మాయ! మాయ చప్పరించి నమలిన చెరుకు పిప్పివలె చప్పనై యుందన్న సత్యాన్ని జీవాత్మ తెలుసుకుంటుంది! ఒకొకసారి జీవాత్మ పరమాత్మను వేరు చేసే 'మాయ'ను తెలుసుకోలేక పరమాత్మను నిందిస్తుంది -

" నిను నమ్మరాదుర మువ్వగోపాల !
నీ వగలెల్లను తెలిసె గదరా ! . . . " అంటుంది.

మాయను గుర్తించి దాన్నుంచి విముక్తిని పొందిననాడే స్వచ్ఛమైన నమ్మకమైన అనుమానాలు లేని ప్రేమ కలిగిననాడే జీవాత్మ పరమాత్మల కలయిక సాధ్యమౌతుందనే భక్తితత్త్వాన్ని క్షేత్రయ్య పై పదంలో చిత్రించాడు.

ఇస్లాం మతంలోని సూఫీ సంప్రదాయంలోనూ జీవాత్మ పరమాత్మల ప్రేమ చెప్పబడింది. వైష్ణవభక్తి, కృష్ణ భక్తి సంప్రదాయం మీద సూఫీజం ప్రభావం కూడా చాలా వుంది. ఉర్దూభాషలోని గజళ్ళలో ఇటువంటి ప్రేమతత్త్వం కన్పిస్తుంది క్షేత్రయ్య పదాలల్లోనూ అటువంటి ప్రేమతత్త్వం భావన ప్రభావం కన్పిస్తుంది. ఎన్నో చోట్ల క్షేత్రయ్య మువ్వగోపాలున్ని ప్రేమతో తాను గోపికయై ఆర్తితో ఈ విధంగా వేడుకుంటాడు -

"ఏలా దయనేలరా నేనీకు పగదాననా
చాలా వలచినానురా గోపాలా - "

" ఏమిర వరద ! నీ మోము చిన్న బోయినది
నా మనసు నీ మనసు ప్రేమ నిండియుండగ..."

"నిను జూడగలిగినే యిన్నాళ్ళకు
నిన్ను జూచి నాలుగైదు నెలలాయె మువ్వగోపాలా"...

ఇట్లా ఎన్నో చోట్ల క్షేత్రయ్య తానే గోపికయై విరహంతో ప్రేమతో ఆర్తితో భగవంతుని దర్శనాన్ని కోరుతాడు.

పరమాత్మ కూడా జీవాత్మకు దూరమై వుండలేదు.

భక్తాధీనుడైన శ్రీకృష్ణుడు భక్తుల పరాధీనుడు. వాళ్ళ ఆనందాన్ని సాన్నిధ్యాన్ని కోరుకుంటాడు. తపన పడ్తాడు. అందుకే క్షేత్రయ్య మువ్వగోపాలున్ని గోపికల పొందుగోరే నాయకునిగా చిత్రిస్తూ పదాలు వ్రాసాడు. ఉదా॥

" వలచిన వాడనే నీ మీద - చాల
కులుకులాడి! మువ్వగోపాలుడనె భామ
నిను బాసి కంటికి నిద్దుర రాదు
నిమిషమైన గాని ప్రొద్దు బోదు
యెనసిన మరుబారి కోర్వగరాదు
ఇక నాతమి నిలుపవశము గాదు.... "

" వలచిన వాడనే నీ మీద - చాల
కులుకులాడి! మువ్వగోపాలుడనె భామ..."

క్షేత్రయ్య పదాలల్లో రమ్యమైన శృంగారం, పచ్చిశృంగారం రెండూ వున్నాయి. అయితే అటువంటి పచ్చి శృంగారవర్ణనలు సంస్కృత కవుల్లోనూ వున్నాయి. తెలుగు ప్రబంధాలల్లో కూడా వున్నాయి. జయదేవుని అష్టపదులను చాలా మధురంగా వున్నాయని మనం వింటుంటాం. పాడుతుంటాం. వాటిల్లో ఎన్నో చోట్ల పచ్చి శృంగారం వుంది. సంస్కృతంలో వుండటం చేత మనకు అర్థం కాక పచ్చి శృంగారమని గుర్తించటం లేదు. "గోపీ పీనపయోధర మర్దన చంచల కరయుగశాలీ..." వంటి భావాలెన్నో జయదేవుని భక్తి పదుల్లో వున్నాయి. అంతేకాదు ఎన్నో దేవీదేవతల స్తోత్రాల్లో కూడా అతి శృంగారవర్ణనలున్నాయి.

క్షేత్రయ్య క్రీ.శ. 1600 ప్రాంతంలో జన్మించి క్రీ.శ. 1630 ప్రాంతంలో తంజావూరు మధుర గోలకొండ రాజాస్థానాలను సందర్శించాడు. ఆ రాజుల మీద కొన్ని పదాలు రచించాడు. తర్వాత ఆయన పూర్తిగా భక్తిలో పడిపోయి క్షేత్రాలు తిరుగుతూ కృష్ణ భక్తుడై కృష్ణుని మీద పదాలు రచించినట్లుగా కన్పిస్తున్నది. చాలా భక్తకవులు మొదట భోగజీవితాలను గడిపి స్త్రీ లోలురై వుండి ఏదో ఒక ప్రేరణతో ఐహిక సుఖాలకు దూరమైనట్లుగా చూస్తుంటాం. క్షేత్రయ్య కూడా మొదట రాజాస్థానాల్లో వుండి రాజుల పోషణలో వున్నా భోగాలనుభవించినా తర్వాత ఐహిక సుఖాలకు దూరమై పుణ్యక్షేత్రాలను సందర్శిస్తూ భక్తి శృంగార పదాలను చెప్పినట్లుగా ప్రచారంలో వున్న కథలను బట్టి కూడా తెలుస్తున్నది.

క్షేత్రయ్య 4500 పదాలు రచించాడని తెలుస్తున్నది. కాని ఇప్పుడు 330 పదాలు మాత్రమే ముద్రితమై లభిస్తున్నాయి. క్షేత్రయ్య ఒక్కొక్క పదంలో ఒక్కొక్క శృంగార నాయికా భేదాన్ని చిత్రించాడు. దీన్ని ఒక అలంకారశాస్త్ర పండితుడు అధ్యయనం చేసి 200 పదాలను ఉదాహరణాలుగా చూపిస్తూ క్షేత్రయ్య 150 నాయికానాయకభేదాలను చిత్రించాడని చెప్తూ "శృంగార రసమంజరి" అనే గ్రంథాన్ని రచించాడు. ఆ పండితుని పేరు ఏమిటో మనకు తెలియటం లేదు. ఆ గ్రంథం ముద్రితమై దొరుకుతున్నది. క్రీ.శ. 15 శ॥ వాడైన భానుదత్తుని "రసమంజరి" ఆధారంగా ఆ పండితుడు క్షేత్రయ్య చిత్రించిన నాయికా నాయకభేదాలను గుర్తించి వివరించి చెప్పాడు. దీన్ని బట్టి క్షేత్రయ్య పదాలు పండిత లోకంలోకూడా ఎంత ఆదరణను పొందాయో తెలుస్తున్నది. క్షేత్రయ్య సంగీతంలోనూ గొప్ప పండితుడు కాబట్టి సంగీతంలో తనదైన బాణీని సృష్టించగలిగాడు.

క్షేత్రయ్య మంచికవి. పండితుడు. మృదువైన భావాలను మృదువైన భాష. శైలిలో వ్యక్తం చేసి రక్తి కట్టించాడు. భక్తకవులు ప్రజలభాషలో, అందరికీ సులభంగా అర్థమయ్యే భాషలో వ్రాసారు. అన్నమయ్య వాడుక పదాలను ప్రయోగించటం అందరికీ తెలిసిన విషయమే. అసలు దక్షిణదేశంలో శైవ వైష్ణవ భక్తి ఉద్యమాలు క్షీణిస్తున్న బౌద్ధ జైనమతాలను పారదోలటానికి తోడ్పడినాయి. తమ సందేశం ప్రజలకు చేరాలంటే పదాలు పాటలు ప్రజల భాషలోనే వుండాలన్నది - భక్త కవులకు తెలుసును. క్షేత్రయ్య భాష చక్కని నుడికారంతో ప్రతినిత్యం మాట్లాడుకునే ప్రజలభాషకు దగ్గరగా వుంది. క్షేత్రయ్య పదాలు అభినయానికి చాలా అనువుగా వున్నాయి. ఒక్కొక్క శృంగారావస్థను చక్కగా నాట్యంలో చూపగలిగేటట్లుగా క్షేత్రయ్య తన పదాల్లో భావాలను పొదిగాడు. అందుకే ఇప్పటికీ క్షేత్రయ్య పదాలను భరతనాట్యంలో కూచిపూడి నాట్యంలోనూ అభినయానికి గ్రహిస్తూ వుంటారు. క్షేత్రయ్య భావాలే కాదు తాళలయలు కూడా అభినయానికి సుందరంగా వున్నాయి. క్షేత్రయ్య పదాలను అభినయరూపంగా విన్నప్పుడు చూచినప్పుడు అద్భుతానందం కలిగిస్తాయి. లౌకికార్థంతోపాటు అలౌకికార్థం అవగతమై భక్తి ప్రేమ శృంగార భావాలు దివ్యరసానందాన్ని ఆస్వాదింపజేస్తాయి.

# "క్షేత్రయ్య పదాలలో శృంగారనాయికలు"

డా. మసన చెన్నప్ప

**అ**న్నమయ్య తన పదాలలో శృంగారాన్ని వర్ణించినప్పటికీ భక్తికే ప్రథమ తాంబూలం. కాని క్షేత్రయ్య పదాలలో అడుగడుగునా శృంగారమే అనుభవానికి వస్తుంది. ఆయనది మధురభక్తి.

ఆనందానుభూతిని కల్గించే పదాలను పండితులు ఆధ్యాత్మ శృంగార పదాలని రెండు విధాలుగా వింగడించారు. అన్నమయ్య మొదటి విభాగానికి చెందితే క్షేత్రయ్య రెండవదానికి చెందుతాడు.

క్షేత్రయ పదాలలో గేయాంశతోపాటు అభినయాంశ ఎక్కువ. కేవలం చదువుతుంటేనే ఆడుతున్నట్లుంటాయి ఆయన పదాలు. మరి పాడుతూ అభినయిస్తే ఆనందాబ్ధిలో ఓలలాడవలసిందే. రసానందమే ప్రధానమైందని చెప్పవలసివచ్చినప్పుడు అన్నమయ్య తర్వాత క్షేత్రయ్య కృతులకే ఆ గౌరవం లభిస్తుంది.

ఆధ్యాత్మ కీర్తనలు సామాన్యులకంతగా పట్టవు. అవే శృంగార కీర్తనలైతే వారి హృదయాలను వెంటనే ఆకర్షిస్తాయి. బహుశా ఈ దృష్టితోనే క్షేత్రయ్య శృంగార పదాలవైపు మొగ్గాడు.

ఈ పదాలలో క్షేత్రయ్య పరమాత్మ గుణగణాలను కేవలం ప్రస్తుతించే ఒక భక్తునిగా కాక, ఆ పరమాత్మను గాయకునిగా చేసుకొని తాను స్వయంగా నాయికగా మారిపోవడం విశేషం.

నాయకుడు మువ్వగోపాలుడు. నాయిక క్షేత్రయ్య. నాయకునితో నాయిక అయోగ, విప్రయోగావస్థలను అనుభవిస్తూ, అతని సాన్నిధ్య సాహచర్యాలను ఆకాంక్షిస్తూ, ఏకాంతంలో సాయుజ్యాన్ని కోరుకోవడం, ఇంకా దర్శనస్పర్శనాలింగనాది సౌఖ్యాలతోపాటు, ఎడబాటు చేత దుఃఖాన్ని అనుభవించడం క్షేత్రయ్య పదాలలో కనిపిస్తుంది.

అలంకార శాస్త్రాన్ని బట్టి శృంగార నాయికలు ఎనిమిది మంది. 1. స్వాధీనపతిక, 2. వాసక సజ్జిక, 3. విరహోత్కంఠిత, 4. విప్రలబ్ధ, 5. ఖండిత, 6. కలహాంతరిత, 7. ప్రోషిత భర్తృక, 8. అభిసారిక

క్షేత్రయ్య పదాలలో విప్రలంభ శృంగారమే వర్ణింపబడింది. నాయికా నాయకులు వివిధ భావపరంపరలను వశం చేసుకోవడానికి మంచి అవకాశం ఇస్తుంది. విప్రలంభ శృంగారం. దీన్ని ఎంత వర్ణించినా అశ్లీలం దొర్లదు. కనుకనే క్షేత్రయ్య పదాలు నిసర్గ రమణీయ శృంగార పదాలుగా సాహిత్యచరిత్రలో వన్నెకెక్కాయి.

అష్టవిధ శృంగార నాయికలకు క్షేత్రయ్య పదాలు పరమలక్ష్యాలు.

**(1) స్వాధీనపతిక:**

తనయందే అనురక్తుడైన పతిగలది స్వాధీనపతిక. క్షేత్రయ్య దృష్టిలో మువ్వగోపాలుడు పరమాత్మకు, నాయిక జీవాత్మకు సంకేతాలు. పరమాత్మను వశంలో ఉంచుకొన్న తనకు అడ్డుగా ప్రకృతి స్త్రీ మూర్తియై వచ్చిందట. ఈ ప్రకృతినే మాయ అని పిలుస్తాము. జీవాత్మ పరమాత్మలను వేరు చేసేది ప్రకృతే. నిజానికి జీవపరమాత్ములు అనాదిగా కలిసే ఉంటారు. "ద్వాసుపర్ణాసయుజాసఖాయా" అని వేదం చెబుతుంది.

"ఇద్దరి సందున పవ్వళించియున్న యింతి పేరేమిరా?" అనే పదం నాయికా నాయకుల పూర్వానుబంధాన్ని అపూర్వంగా చిత్రిస్తుంది.

ఇట్లే మరొక పదం,

"మ్రొక్కదగిన వాని, ముద్దు మాటలవాని
మువ్వగోపాల స్వామిని ఎవరైనా గాని" అని కొనసాగుతుంది.

ఓర్వనివారు నా నాయకుణ్ణి సరసుడు గాడని ఆడుకుంటే ఆడుకునేరు. నేను మాత్రం పట్టించుకోను. నాకు నాయకుడు మాత్రం స్వాధీనుడేనని నాయిక చెలికత్తెతో పలికిన పలుకులు ఉదాత్తమైనవి.

**(2) వాసక సజ్జిక:**

భర్త వచ్చే సమయానికి తననూ, తన గృహాన్నీ అలంకరించుకునేది వాసక సజ్జిక.

ప. ఇంత ప్రొద్దాయెనిక వాడేమి వచ్చునే
ఏ యింతిని గూడియున్నాడో

అ.ప. చింతింప పని లేదు - చెలియా! మువ్వగోపాలుడు

చ. చేరి నాతో నేస్తము - చేసిన పాపమా
కీరవాణిరో ! ఏలవేగించేవే నీవు!
నూరిన గంధకస్తూరి - పారవేసి పవ్వళించు
ఏ రమణియింటనున్నాడో - యూరెల్ల మాటు మణిగె.

చ. భాసురాంగిరో! వినవో - పక్షులు మొదలుగాను
వాసములు జేరి తమ - వనితల గూడెనె
ఆశించిన ఫలించే - దరుదుగాదటవే - నే
జేసిన పాపమెవ్వరు - జేసినారే చెలియ

చ. పమ్మిన వేడుకలతోను - పడకటిల్లు శృంగారించి
యెమ్మెకాడు వచ్చునని - యెదురుచూచితి
సొమ్ములేలే! విరులేలె? సొగసెవ్వరు చూచెదరే
కొమ్మా! నన్నేలిన మువ్వగోపాలుని నమ్మరాదే"

ఇదెంతో మనోజ్ఞమైన పదం.

మువ్వగోపాలుని కోసం సిద్ధం చేసిన గంధాన్ని, కస్తూరిని పారెయ్యమంటూంది నాయిక. పక్షులు కూడా సుఖించే సమయంలో పతి రాకపోతే సతికెంత బాధ? ఆశించిన ఫలం అందరికి దక్కదు. పడకటింటిని ఎంత సుందరంగా అలంకరించు కున్నా లాభం లేదని, మేనధరించిన సొమ్ములను, పూలను తీసిపారేయడానికి సిద్ధపడిన నాయిక నిజంగా వాసక సజ్జికే.

**(3) విరహోత్కంఠిత:**

భర్త చెప్పిన సమయానికి రానప్పుడు విరహంలో మునిగిపోయేది విరహోత్కంఠిత.

"మరచెనేమో చెలియ - మాయలో తగిలి
పరమాత్మ మువ్వగో - పాలుడిందు రాడాయె"

ఏదో మాయలో పడిపోవడం వల్లనే మువ్వగోపాలుడు రాలేదని బాధపడ్డ నాయిక, నాయకుడంతకు ముందు తనకిచ్చిన చిలుక తాళిని మాత్రం మరిచిపోలేదు.

"మొలకప్రాయమున - మోహమునను గూడి
చిలుక తాళిచ్చినది - చిత్రాన లేద?"

అని నాయకుణ్ణి స్మరించి విరహాన్ని అనుభవించింది. ఆమె అతనితో కలిసి అనుభవించిన సుఖాన్ని కూడా నెమరేసుకుంది.

"అలిగిన నేనొక వేళ - ఆవలిమోమైనప్పుడే
చెలియరో కౌగిటను - చేర్చుకొనె చాల"

పూర్వస్మృతులు గుర్తుకు వస్తే దుఃఖం రాకుండా ఉంటుందా?

మరొక పదంలో "చందమామ యీరేయి - చల్లనుండడే దైవమా?" అని వాపోయింది. ఇంకొక పదంలో "దయ గోరంతైనా లేదాయె" "బతిమాలినా రాడాయె" అని విరహంలో మునిగిపోతుంది.

**(4) విప్రలబ్ధ:**

సంకేత స్థలంలో ప్రియుడు కనిపించకపోగా దుఃఖించేది విప్రలబ్ధ.

ఏకాంతంలో పతికౌగిట్లో సుఖించాలనుకున్న నాయిక ఆశ అత్యాశే అయింది. నాయకుని కరస్పర్శచే పునీతమవుదామనుకుంటే అతడు కనిపించకుండాపోయాడు. నాయిక అంటుంది -

"భామా ! మా ముప్వగోపాలు కౌగిటలేని
ఈ మేను జీవునకు ఎంత ప్రియమాయన్." అని

ఈ శరీరం ద్వారా జరిగే కర్మలు జీవునికి సుఖమో, దుఃఖమో కల్గిస్తాయి. కాని ఈ శరీరం భగవదర్పితమైతే ఇంక కావలసిందేముంది. ఈ శరీరంలో ఉండగానే కైవల్యాన్ని పొందే అర్హతను సంపాదించుకోవాలి. కాని అందుకు విరుద్ధంగా స్వామి సేవకు అర్పింపబడని దేహం మీద కోరిక ఉన్నా ప్రయోజనం లేదనే విషయాన్ని ప్రబోధిస్తున్నది ఈ పదం.

"ఇంతిరో విభుసేమమీ వరకు విననైతి
ఎంత వ్రాత వ్రాసి యున్నదో"

అని పలికిన పలుకుల్లో కర్మఫలం అనుభవించక తప్పదనే విషయం తేటతెల్లమవుతుంది.

విరహంతో బాధపడుతున్న తన దగ్గరికి నాయకుడు ఒక వేళ వస్తే చెలులేమైనా అతనికి చెప్పి పొమ్మంటారేమోనని నాయిక అనుమానం. కనుకనే ఆమె "వన్నెకాడిందురాగానే - వద్దనేరమ్మా" అని చెలికత్తెల్ని ప్రాధేయపడుతుంది.

**(5) ఖండిత:**

భర్త రాత్రి పరస్త్రీతో గడిపి ఉదయాన ఇంటికి రాగానే బాధపడేది ఖండిత.

నాయిక నాయకుని తప్పులను చెలికత్తెలకు చెప్పి, అతడిలా ఎందుకు చేశాడో అడగండని వారిని పురికొల్పే సన్నివేశం గల పదాన్ని గమనించండి.

ప. 'అడగరమ్మా!, అతనిపై ఊరక - అలిగినానటరే'

అ.ప. 'పడుచుతనము మాని మువ్వగోపాలరాయని ఆనబెట్టి మీరు'

చ. 'పూనిదానింటికి పోగానే మా - పాలతిజూచి బెదిరించితే దానికి లంచమిచ్చెదనన్నది తానో? నేనో?'

ఈ పంక్తులను చదువుతుంటే ముక్కు తిమ్మనగారి పారిజాతాపహరణం గుర్తుకు వస్తుంది.

ఇంత బాధతో ఉన్నప్పటికీ మువ్వగోపాలుడంటే తనకెంత ప్రేమో నాయిక ప్రకటించుకోవడం విశేషం. "వానిపై లేనివి కల్పింపరాదు" అంటుంది. పారిజాతాపహరణంలో సత్యభామ కృష్ణున్ని నిందిస్తుంది. కాని ఇందులో నాయిక మువ్వగోపాలుణ్ణి వెనకేసుకొస్తుంది.

ఇంకా "నిలిచి వీధిలో నన్ను జూచి - తలుపు మూలదాగియున్నది" అని నాయిక పర స్త్రీని తప్పు బట్టిందేగాని గోపాలునిపై తన భక్తి నే మాత్రం చెక్కుచెదరనీయలేదు.

దీనికి మరొక పదాన్ని కూడా లక్ష్యంగా చూపవచ్చు.

చ. 'నిన్నెవ్వతోగిల్లి - యున్న యురముజూచి
నన్ను వేదనచేయుచున్నది గదరా
నిన్న రాతిరి నీకు నిదురలేకున్న నా
కన్ను లెర్రగా - గలిగెను గదరా!'

రాత్రి ప్రియుడు పరస్త్రీతో గడపడం వల్ల అతనికి నిదురలేదు సరికదా - అతని కోసం ఎదురుచూడడం వల్ల కళ్ళుకాయలుగాచి తనకూ నిదుర లేకుండా పోయింది. ఇక కళ్లెర్రగా మారడానికి కారణం ఒకటి నిద్రలేమి కావచ్చు. మరొకటి కోపం కూడా కావచ్చు. ఏమైనా తన పతి వక్షస్థలం మీద గోటిగాటుకు తల్లడిల్లిపోయిన నాయిక నిజంగా ఖండితే.

నాయికానాయకుల అభేదాన్ని చెప్పడానికి పదకర్త ప్రయత్నించాడీ పదంలో.

**(6) కలహాంతరిత:**

భర్తను కోపంతో వెళ్లగొట్టి అతడు వెళ్లిపోయిన తర్వాత బాధపడేది కలహాంతరిత.

"ఆశతో నే కౌగిలించుకోబోతే - అక్కడుండుమనెను
ఈసులేక మోవితేనె లీరా! అంటే - ఎంగిలయ్యాననెను"

అక్కడుండమంటే ఎక్కడో అనికాదు తనకు దూరంగా ఉండమని అర్థం. అనురాగం ఉన్నప్పుడు ఎంగిలికాని మోవి కోపం రాగానే ఎంగిలైపోతుందనడంలో వక్రోక్తి అనే అలంకారం ఉంది.

భర్తను వెళ్ల గొట్టింది తానే కనుక
"నా కోపమే నన్నింత చేసెనమ్మా"

అని పశ్చాత్తాపాన్ని పొందిన నాయిక "ఈ నేరములు గాచి యిప్పుడింటికి రమ్మనవే" అని చెలికత్తెను వేడుకుంటుంది.

"ఏ డాయెనొక్క నిముషం" అని అనడంలో
విరహం భరింప శక్యం కాని దన్న విషయం స్పష్టమౌతుంది
"నిలుపరాని మోహ మాయె నీ వైనా తోడితేవె"

అన్న మాటల్లో నూటికి నూరు శాతం ప్రేమ, అనురాగం నిక్షిప్తమై ఉన్నాయి.

ఈ పదాన్నివిన్నప్పుడు "తన కోపమె తన శత్రువు" అన్న సుమతీ శతకకారుని పద్యం గుర్తుకు వస్తుంది.

**7. ప్రోషిత భర్తృక:-**

భర్త పరదేశానికి వెళ్లినప్పుడు కృశించిపోయేది ప్రోషితభర్తృక.

ప. తాళరాదమ్మా! ఓ యమ్మా!
అప. తాళరాదుగదమ్మ తరుణి నా సామిని బాసి

చ. వన్నె చిగురు పగడమువంటి - వాని పాదము
లెన్నడు కన్నుల కత్తు కొందునో!

మురుపైన వాని ముద్దు మోము కన్నుల జూడగ
పరితాపమెల్ల తీరు మరుబారిచేతను

వట్టి పగడం కాదు, చిగురు పగడం! ఎంత చక్కని దేశీయ పదప్రయోగం. చిగురుపగడం లాంటి మువ్వగోపాలుని పాదాల మీద నాయికకు ఎంత భక్తి! ఆ

పాదాలను ఒక్క నిముషం చూడకపోతే తాళలేదు కనుకనే నాయకుడు ఎప్పుడు వస్తాడా? అతని పాదాలను ఎప్పుడు ముద్దు పెట్టు కుంటానా అని ఎదురుచూస్తున్న నాయిక నిజంగా ప్రోషిత భర్తృకే.

ఐతే వెంటనే వస్తానని కాంతుడు చెప్పిన మాటలను ఆమె మళ్లీ మళ్లీ స్మరించుకుంటుంది.

"ఏమని తెలుపుదు - నెలాగు తాళుదు - నేమి చేతునే"

అన్న పదం ఒక మంచి సన్ని వేశాన్ని మనముందుంచుతున్నది. నాయకుడు దేశాంతరం పోతాననగానే నాయిక బిక్క మొగం వేసింది. నాయకు డామెను "కన్నీరు నింపకు" అని ధైర్యం చెప్పాడు. కాని ఆమెకు కన్నీరాగలేదు. అతడు చేతితో కన్నీటిని తుడిచాడు. ఈ సంఘటన మళ్లీ మళ్లీ గుర్తుకు వచ్చి నాయికను ఎంతో కృశింపజేసింది.

**8. అభిసారిక:-**

భర్త దగ్గరికి స్వయంగా వెళ్లేది, లేదా అతణ్ణే తన దగ్గరికి రప్పించుకునేది అభిసారిక.

ప. రేపు వత్తువుగానివోర నేటికి తాళి-రేపు వత్తువు గాని
అప. రాపు చేయుట మేలా?

చ. రాతిరి పగలొక్క తీరు నిన్ను-రమ్మంటే మా యింటి వారు-
మూతులు త్రిప్పేరు-మొన్న వచ్చితివని
వాదేల తడవాయె-వద్దు నేటికి తాళి

చ. మరునాడె నను గూడితివి నన్ను-మరుకేళి గెలిచి మెప్పించితివి
మరియాద గలిగిన దొర బిడ్డడ వైతె
తెరచి చూడర తలుపు-తెల్లవారె తూరుపు
కోపగించి పోయేవు-కొన్ని నాళ్లయ్యె నీవు
తాపమణచలేరా? - దయతో కలిసిపోరా

ఇందులో నాయిక నాయకుణ్ణి స్వయంగా తన దగ్గరికి రప్పించుకున్న విధానాన్ని గమనించవచ్చు ఐతే ఒకసారి రప్పించుకుంటే ఎవరూ ఏమనరు రాత్రింబవళ్లు ఒకే తీరుగా రమ్మంటే ఎవరికైనా ఇబ్బందే. మూతులు తిప్పేరు అనే ప్రయోగంలో ఎంతో అర్థముంది.

మువ్వగోపాలున్ని తన దగ్గరికి రప్పించుకున్న నాయిక - తెల్లవారు తుందనగా ఎవరూ చూడకుండా వెళ్లిపొమ్మంటుంది. అలా చేస్తే మర్యాదగా ఉంటుందని అంటుంది.

అలంకార శాస్త్రంలో చెప్పబడిన అష్టవిధ శృంగార నాయికలకు లక్ష్యభూతమైన పదాలను క్షేత్రయ్యలో గుర్తించవచ్చు. ఆయన ఎంత శృంగారియో అంత వేదాంతి. పైకి శృంగారాత్మకాలుగా గోచరించే ఆయన పదాలు, తరచి చూస్తే అంతర్గతంగా ఎన్నో ఆధ్యాత్మిక భావనలకు ఆలవాలమై కనిపిస్తాయి. ఐతే ఇప్పటికి మాత్రం ఆయన పదాల్లో కొలువు దీరిన శృంగారనాయికలను మాత్రమే మీ ముందుంచు తున్నాను.

# శ్రీ త్యాగరాజ కృతులు - సంగీతాంశాలు

మహాభాష్యం చిత్తరంజన్

**అ**పారమైన విద్యాసంపద మనకు వుంది. కళలు కూడా వేదకాలం నాడే వెల్లివిరిశాయి. సామవేద సారమే సంగీతశాస్త్రం. భగవద్గీతలో 'వేదానాం సామవేదోహం' అని శ్రీ కృష్ణ పరమాత్మ చెప్పాడంటే సంగీతం ఎంత గొప్పదో మనకు తెలుస్తోంది. నాదో పాసన చేయడమంటే సాక్షాత్తూ దైవోపాసన చేయటమే అని అర్థం. అన్ని కళలు, శాస్త్రాలు మూడు పురుషార్థాలనే యిస్తాయి. కాని 'ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గఫల ప్రదం' అన్నారు విజ్ఞులు. అలా నాదోపాసనతో తాను తరించడమే కాక, మనల్ని తరింపజేయడానికి అపూర్వమైన, అమేయమైన, అద్భుతమైన సంగీత సంపదను మనకు వారసత్వపు పెన్నిధిగా అందించారు రామభక్తాగ్రేసరుడైన శ్రీ త్యాగరాజ స్వామివారు. పూర్వం 'ఆంధ్రత్వం ఆంధ్రభాషాచ న అల్పస్య తపసః ఫలం' అన్నారు. అందుకేనేమో శ్రీ త్యాగయ్య ఆంధ్రుడై ఆంధ్రభాషలో మనకు సంగీతాన్ని అందించారు.

త్యాగరాజస్వామికి పూర్వముండిన వాగ్గేయకారుల సాహిత్యం మాత్రమే లభ్యమయి వారి సంగీతరీతులు మాత్రం మన వరకూ రాలేదు. అనగా వాటిని స్వరయుక్తంగా అందించడం జరుగలేదు. అంతవరకూ కీర్తనలో సాహిత్యం ఎక్కువగానే వుంటూ ధాతువు మాత్రం సరళమైన రీతిలో పది మంది కలిసి పాడుకొనేందుకు వీలుగా వుండేది. చరణాల మట్లు ఒకే విధంగా వుంటూ వుండేవి. అన్నమయ్య, రామదాసు కీర్తనలు ఆ విధంగానే విద్వాంసులు గానం చేస్తూ వుండడం మనకు తెలిసిన విషయమే.

కాని త్యాగరాజు రచించిన కృతులలో సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చి రాగవిస్తారానికి అవకాశం కల్పించారు. తద్వారా రాగపోషణతో పాటు సాహిత్యంలోని భావాలను వివిధ సంగతులలో ద్విగుణీకృతం చేసే విధంగా రూపొందించడంలో ఆయన చూపిన ప్రత్యేకత, విశిష్టత మనకు తెలుస్తోంది.

ఆయన సృజించిన కీర్తన లెన్నోవున్నాయి. వాటిలోని సంగీత విశేషాలు కూడా అపారమైనవి. వాటిలోని విశిష్టతలను గానం చేస్తూ విశదీకరించడం సమంజసంగా వుంటుంది. గేయం పాడడానికి ఉద్దేశించబడిన ప్రక్రియ గనుక దానికి గానం చేయడం ద్వారానే న్యాయం చేకూర్చబడుతుంది. అయితే ఇది వ్యాస రచన కావడం చేత కొంతవరకూ విశేషాలను గురించి ప్రస్తావించ ప్రయత్నిస్తాను.

కర్ణాటక సంగీతంలో వాడుకలో వున్న రాగాలలో ఆయన పలు కీర్తనలను రూపొందించి రాగాలలో ఎంతో వైవిధ్యాన్ని చూపించారు. ప్రతి కీర్తనలోనూ పల్లవి, చరణాలను వివిధ సంగతులతో అలంకరించి రాగవిస్తృతితో బాటు ఆయా భావాలను అతిసుందరంగా వ్యక్తం చేయడంలో ఆయన ఘనత అద్వితీయం, అసామాన్యం. ప్రతి కీర్తనలోని పల్లవి, చరణాలకు వుండే సంగతులన్నిటితో పాటు స్వరయుక్తంగా నేను యిక్కడ ఉదహరించడం అంటే అది ఒక పెద్ద గ్రంథమే అవుతుంది. కనుక స్థూలంగా కొన్ని విషయాలను ప్రస్తావిస్తాను.

తోడి, కల్యాణి, మోహన, అభేరి, శంకరాభరణం మొదలగు రాగాలలో ఎన్నో కీర్తనలు త్యాగయ్య రచించారు. ఒక్కొక్క రాగంలో మచ్చుకు కొన్ని-

**తోడి రాగం :**

1. ప ః వెడలెను కోదండపాణి అనుజ సౌమిత్రి గూడి
   - రూపక తాళం

2. ప ః కద్దనువారికి కద్దు కద్దని మొరలనిడు
   పెద్దల మాటలు నేడ బద్ధ మౌనా
   - ఆది తాళం

3. ప ః ఆరగింపవే పాలార గింపవే
   - రూపక తాళం

4. ప ః ఎందుకు దయరాదురా -ఓ రామచంద్రా నీ ః కెందుకుః
   - మిశ్రచాపు తాళం

5. ప ః కోటి నదులు ధనుష్కోటిలో నుండగ
   ఏటికి తిరిగేవు ఓ మనసా
   - ఆది తాళం

**కళ్యాణి రాగం :**

1. ప :: ఏ తావున రా నిలకడ నీకు
ఎంచి చూడ నగ పడవు ఓ రామ
- ఆది తాళం

2. ప :: వాసుదేవ యని వెడలిన యీ దౌ
వారికుని గనరే
- ఆది తాళం

3. ప :: నిన్న నవలసిన దేమి రామా
నన్నన వలె గాకః
అ.పః కన్న తండ్రి నీ కన్న వేల్పులెవ
రున్నారురా ఆపన్న రక్షకనే :: నిన్నన వలసిన దేమి ::
- మిశ్ర చాపు తాళం

4. ప :: భజన సేయవే మనసా - పరమ భక్తి తో
అ.పః అజరుద్రాదులకు భూసురాదుల కరుదైన రామ : భజన :
- రూపక తాళం

**శంకరా భరణ రాగం :**

1. ప :: మనసు స్వాధీనమైన ఆ ఘనునికి
మరి మంత్ర తంత్రము లేల
అ.పః తనువు తాను కాదని ఎంచువానికి
తపసు చేయగ నేల దశరథ బాల :: మనసు ::
- త్రిపుట తాళం

ఈ కీర్తన బాణీయే యథాతథంగా ముద్దు స్వామి దీక్షితుల వారి

ప :: అక్షయ లింగ విభో - స్వయం భో
అక్షయ లింగ విభో

అనే కీర్తనలో కనిపిస్తుంది

అదే విధంగా నారాయణ తీర్థుల వారి
శ్రీ వాసు దేవ ప్రభో పాలయ మాం
శ్రీ వాసు దేవ ప్రభో

అనే తరంగానికి కూడా అదే బాణీ వుండడం విశేషం

2. ప :: ఏమి నేరమో నన్ను బ్రోవ
ఎంత భారమో - నా వల్ల :: ఏమి నేరమో ::
అ.ప: సామజరాజ వరదుడని మునుపే
సత్కీర్తి కల్గలేదా - నావల్ల :: ఏమి నేరమో ::
- ఆది తాళం

3. ప :: స్వర రాగ సుధా రసయుత భక్తి
స్వర్గాపవర్గమురా ఓ మనసా :
- ఆది తాళం

చాలా కీర్తనలలో వాడుక భాషను వినియోగించి అద్భుతమైన స్వర రచనను జోడించి రాగపోషణను బహు సుందరంగా రూపొందించారు త్యాగయ్య.

**ఖర హర ప్రియ రాగం :**

1. ప : చక్కని రాజ మార్గమే యుండగ
సందుల దూర నేల ఓ మనసా : చక్కని :
అ.ప: చిక్కని పాలు మీగడ యుండగ
ఛీయను గంగాసాగర మేలే : చక్కని :
- ఆది తాళం

2. ప :: ప్రక్కల నిలబడి కొలిచే ముచ్చట
బాగా తెల్పగరాదా
అ.ప: చుక్కల రాయని గేరు మోము గల
సుదతి సీతమ్మ సౌమిత్రి రాముల కిరు :: ప్రక్కల ::
- త్రిపుట తాళం

3. ప :: రామ నీ సమాన మెవరు
రఘు వంశోద్ధారకా : రామ :
అ.ప: భామ మరువంపు మొలక
భక్తి యను పంజరపు చిలుక : రామ :
- రూపక తాళం

మోహన రాగం :

1. ప :: నను పాలింప నడచి వచ్చితివో
నా ప్రాణ నాథా నడచి వచ్చితివో :

2. ప :: రామా నిను నమ్మిన వారము
రామా సకలలోకాభిరామ
- ఆది తాళం

అఖేరి రాగం :

1. ప :: నగుమోము గనలేని నాజాలి తెలిసి
నను బ్రోవగ రాదా శ్రీ రఘువర నీ : నగు మోము :
- ఆది తాళం

పైన ఉదహరించబడిన కీర్తనలన్నిటిలోను వివిధ సంగతులతో ప్రతి రాగమూ అనేక విధాలుగా పోషింపబడుతూ ఎంతో రమణీయంగా భాసిస్తున్నది. ప్రతి కీర్తనలోనూ రాగస్వరూపం సంపూర్ణంగా మూర్తీభవించి వుంటుంది. అలా రాగ స్వరూపాన్ని పోషించుకుంటూ ఎంతో భావయుక్తంగా కీర్తనని కడుసుందరంగా రూపొందించడం ఆయనకే చెల్లింది. ఒకే రాగంలో ఎన్ని కీర్తనలు కూర్చినా, ప్రతి కీర్తనలోనూ ఒక ప్రత్యేకత, నవ్యత కనబడుతుంది. కనుకనే రాగస్వరూపం మీద పట్టు సాధించాలంటే విద్యార్థులు తప్పనిసరిగా త్యాగరాజస్వామి కీర్తనలు అభ్యసించాలి.

## ఘన రాగ పంచరత్న కీర్తనలు

నాట, గౌళ, ఆరభి, వరాళి, శ్రీ రాగాలు ఘనరాగాలుగా వ్యవహరించబడుతవి. ఆరాగాలలో శ్రీ త్యాగరాజు రూపొందించిన కీర్తనలు పంచరత్నాలుగా ప్రసిద్ధి గాంచినవి. ఆ రాగాలలో క్లిష్టమైన రాగ ప్రయోగాలతోను, జటిలమైన సంస్కృత పదజాలం తోను, అపారమైన పాండిత్య ప్రకర్షతోను ఆయన రూపొందించిన కీర్తనలు అజరామరమైనవి. మొదటి కీర్తన నాట రాగంలో 'జగదానందకారక' అనే శ్రీరామస్తుతి, రెండవది 'దుడుకుగల నన్నే దొర కొడుకు బ్రోచురా' అనేది పశ్చాత్తాప ప్రకటన గౌళ రాగంలో. మూడవది ఆరభి రాగంలో 'సాధించెనే ఓ మనసా'. ఇది నిందాస్తుతి - ఇందులో వుండేది వ్యాజనింద - భగవంతుని లీలల వర్ణన. వరాళిరాగంలోని నాల్గవ దానిలో 'కనకన రుచిరా - కనక వసన నిను' అనే కీర్తనలో శ్రీ రామ సాక్షాత్కారం వలన కలిగిన ఆనందానుభూతి, ఐదవదైన

'ఎందరో మహానుభావులు అందరికీ వందనములు' అనే శ్రీ రాగకీర్తనలో సాక్షాత్కారం పొందిన భక్త శిఖామణులకు వందనం సమర్పించారు త్యాగయ్య. వీటన్నిటిలో అపారమైన రాగవిస్తృతిని కల్పించిన తీరు అసామాన్యము.

సరళమైన స్వర రచనతో పది మంది కలిసి పాడుకునే విధంగా సాహిత్యానికి ప్రాధాన్యత కల్పిస్తూ అన్నమాచార్య, రామదాసు వలె భజన సంప్రదాయ, ఉత్సవ సంప్రదాయ కీర్తనలను కూడా చాలా రచించారు త్యాగయ్య. వాటిలో మచ్చుకు కొన్ని -

1. యదుకుల కాంభోజి రాగం - ఝంపె తాళం
ప ః శ్రీరామ రఘురామ శృంగార రామయని
చింతించరాదె ఓ మనసా

1చః తళుకు చెక్కుల ముద్దు బెట్టు కౌసల్య మును
తపమేమి చేసెనో తెలియ

2చః దశరథుడు శ్రీరామ రారయని బిల్వమును
తపమేమి చేసెనో తెలియ

..........................................................

9చః త్యాగరాజాప్తయని పొగడ నారదమౌని
తపమేమి చేసెనో తెలియ

పల్లవి, చరణాలకు ఒకటే బాణితో కీర్తన కూర్చుబడింది.

2. శంకరాభరణ రాగం - ఖండ చాపు తాళం
పః సీతాకల్యాణ వైభోగమే
రామ కల్యాణ వైభోగమే ః

1చః పవనజ స్తుతి పాత్ర - పావన చరిత్ర
రవి సోమవరనేత్ర - రమణీయ గాత్ర ః సీతా ః

2చః భక్త జన పరిపాల - భరిత శరజాల
భుక్తి ముక్తిద లీల - భూదేవి పాల ః సీతా ః

..........................................................

5చః పరమేశను గీత - భవజలధి పోత
తరణి కుల సంజాత - త్యాగరాజనుత : సీతా :

ఇందులో చరణాల మట్లన్నీ ఒకే తీరుగా వుంటాయి

3. మధ్యమావతి రాగం - ఆది తాళం
పః నగుమోము కలవాని నా మనోహరుని
జగమేలు శూరుని జానకీ వరుని

1చః దేవాధి దేవుని దివ్యసుందరుని
శ్రీవాసుదేవుని సీతారాఘవుని : నగుమోము :

..........................................................

4చః బోధతో పలుమారు పూజించి నే నా
రాధింతు శ్రీ త్యాగరాజ సన్నుతుని : నగుమోము :

ఇందులో పల్లవి, చరణాల బాణీ ఒకే విధంగా వుంటుంది

ఇలా సమతుల్యమౌ పదాలతోను, సముచితమౌభావాలతోను, సుమనోహరమైన సంగీతరచనతోను నిరంతరం భాసించే కీర్తనలు శ్రీ త్యాగయ్యవి.

త్యాగరాజ స్వామి లోని మరియొక విశిష్టత. రాగంలోని ఆరోహణ, అవరోహణ క్రమంలో కీర్తన యొక్క పల్లవికి బాణీ కూర్చడం, ఆ మూర్ఛనాక్రమానికి సరితూగే విధంగా సాహిత్యాన్ని సృజించడం

- ఉదాహరణః

1. గౌరీ మనోహరి రాగం : 23వ మేళకర్త
ఆ : సరిగమ పదనిస - జంపెతాళం
అ : సనిదప మగరిస
స స ని ద ప మగ పమగారిస రి ని స రిగ మ ప దా ని ॥

పః గు రు లే. క ఎటు వ ం .. టి. గు ణి కి తెలి య గ బో దు ॥
అవరోహణ క్రమం ఆరోహణ క్రమం

2. గరుడధ్వని - శంకరాభరణ రాగ జన్యం
ఆ : స రి గ మ ప ద ని స రూపక తాళం

అ : స ద ప గ రి స

ప: స ద ప గ రి స    రి గ మ ప ద ని ::

త.త్త్వమెరుగ    త ర మా . ప ర :: తత్త్వ మెరుగ :
అవరోహణ క్రమం    ఆరోహణ క్రమం

ఇలా మూర్ఛనకు సరితూగే విధంగా బాణీని కూర్చడం, దానికి తగిన సాహిత్యాన్ని సృష్టించడం అసాధారణమైన ప్రజ్ఞ శ్రీ త్యాగయ్యలో.

ఇంతటి అద్వితీయమైన సంగీత, సాహిత్య సృష్టి అంతా ఆయన ఆశువుగా గానం చేసిందే. కాబట్టి మానవాతీతమైనది ఆయన శక్తి.

త్యాగయ్య వంశంలో ఐదు తరాల నుండి రామభక్తి నెలకొని వుండడం, ఆయనలో పుట్టుక నుండే అది రూపుదిద్దుకోవడం, 21 సంవత్సరాలలోనే 96 కోట్ల రామ నామ జపం పూర్తి చేయడం ఆయనలోని రామ భక్తి పరాకాష్ఠకు చేరుకొనేందుకు దోహదం చేశాయి. అందుకే 'పలికించెడు వాడు రామ భద్రుండుట' అని పోతన పలికి నట్లు, త్యాగయ్యను కూడా వాల్మీకి, పోతనల అంశ గల వాడని పండితులు చెబుతారు.

'నాదసుధా రసంబిలను
నరాకృతి ఆయె ప్రణవ : నాదసుధారసంబిలను :

అంటూ తన రామయ్యను నాదస్వరూపునిగా భావించి నాదోపాసనతో తరించిన మహనీయుడు శ్రీ త్యాగయ్య

**రాగమాలిక - ఆది తాళం**

రామ ప్రియ రాగం
ప: సరస సంగీత చక్రవర్తీ!
శ్రీ త్యాగరాజ సద్గురు మూర్తీ! : సరస :

అ.ప: పరమాత్ముడు రాముడె దైవమని
హరి సన్నిధి చేరుటె ధ్యేయమని
వరదుని సేవయే సన్మార్గమని
వరసంకీర్తనమే సాధనమని
నిరతము నమ్మి - నిజమర్మముల
నాదయోగివై నేర్పుతో పాడిన : సరస :

కనకాంగిరాగం

చః శుద్ధ స్వర సువర్ణ రాగముతో
సిద్ధి గణపతిని అనురాగముతో
ముద్దుగకొలిచి ధాతుమాతులను
ఒద్దికగ సిద్ధుడవై సమకూర్చిన

రసికప్రియ రాగం రామనామ గాన రసిక ప్రియ
స్వామి చిత్తరంజన సుగుణాలయ ॥సరసః
(నా స్వీయ రచన)

సంగీత సాహిత్యాలపై అపారమైన పాండిత్యం కలిగి వుండి కూడా శ్రీ త్యాగరాజు 'శోభిల్లు సప్తస్వర సుందరుల భజింపవె మనసా' అన్నాడు. కాని సంగీత శాస్త్రాన్ని గాని, తత్సంబంధమైన దేనినీ కూడా పూజించమనలేదు. కనుక స్వరం యొక్క రంగు, రుచి, సువాసన త్యాగయ్యకు మాత్రమే తెలుసును అంటే అది ఏ మాత్రమూ అతిశయోక్తి కాదనిపిస్తుంది. అజరామరమైన యీ సంగీత సంపదను ఆయన శిష్యులు స్వరయుక్తంగా వ్రాసి పెట్టి తరువాతి తరాలవారికి అందజేశారు. కనుకనే ఆయన శైలి మనవరకు వచ్చింది. నేడు సంగీత కళాకారులందరూ త్యాగయ్యగారి శిష్యులకు ఎంతో ఋణపడి వున్నారు. ఆ గురు పరంపరలో ఎంతో మంది సంగీతాన్ని అభ్యసించి ఉపాధిగా చేసుకొని భుక్తికి, ముక్తికి సాధనంగా ఎంచుకొని రాణిస్తున్నారు. ఆ సంగీత సద్గురువున కిదే నా నీరాజనం.

**సురటి రాగం - ఆది తాళం**

పః సద్గురు వునకి దె జయ మంగళం - సంగీత
సద్గురు వునకిదె జయ మంగళం

అ.పః సద్గుణ భూషణునికి
సద్భక్త శిఖామణికి
సామగాన కోవిదునికి
స్వామి త్యాగరాజునికి ॥ సద్గురు వునకిదే ॥

1చ రామతత్త్వ సారమును - రామ దివ్యచరితమును
రమ్యమైన రాగ సుధల - రక్తిగూర్చ గానము చేసిన
॥సద్గురు వునకిదేః

2చ వేదవేదాంగముల - వివిధమైన శాస్త్రముల
విలువైన కృతులలోన - విశదముగా తెలిపినయట్టి
:సద్గురు వునకిదేః

3చ సంగీత మర్మము లెల్ల - సంకీర్తన సౌరభమెల్ల
సంపూర్ణముగాను తెలిసి - శ్రీరామ చిత్తరంజనుడైన
:సద్గురు వునకిదేః

( నా స్వీయ రచన - మంగళ హారతి )

# త్యాగరాజు కృతులు - ఛందో విశేషాలు

ఆచార్య జి. చెన్నకేశవరెడ్డి

ప్రాచీన మానవుని గుండె గూటిలో రెక్క విప్పిన గేయం అన్నమయ్య ఆర్తిని శ్రీ వేంకటేశ్వరుని చరణసన్నిధికి మోసుకొని వెళ్ళి మోకరిల్లింది. బందీఖానాలోని భక్తరామదాసు బాధలను, గోదావరితీరంలో చల్లనివేళ విహరిస్తున్న సీతమ్మకూ, రామయ్యకూ విన్నవించింది. క్షేత్రయ్య మువ్వగోపాలుని పదస్వనాలకు పరవశించింది. త్యాగయ్య నాద సుధాధారలో తడిసి, తనిసి తరించింది.

పాటలో ఉన్న సాహిత్యాన్ని, సంగీతాన్ని రచిస్తూ గానం చేసేవాడు వాగ్గేయకారుడు. వాగ్గేయకారుణ్ణే ఉభయకారుడు, బయకారుడు అని కూడా అంటారు. వాగ్గేయకారులలో త్యాగరాజు మేరుపర్వతం వంటి వాడు. కర్ణాటక సంగీతం ఆ మూర్తికి పదే పదే ప్రదక్షిణం చేయనిదే ప్రకాశం కాదు. తెలుగుభాష మాధుర్యం దిగంతాలకు వ్యాపించిందంటే, దానికి ప్రథమకారకుడూ, ప్రధానకర్తా త్యాగరాజే. కర్ణాటక గాత్ర సంగీతజ్ఞులు ప్రపంచంలో ఏ వేదిక మీద పాడినా ఆయనకృతి ఒక్కటైనా తప్పక పాడవలసిందే. సంగీత ప్రపంచంలో ఆ ఆకృతికి, ఆయన కృతికి ఉన్న మహిమ అటువంటిది.

త్యాగరాజు అనేక కీర్తనలనే కాక, ప్రహ్లాదభక్తి విజయము, నౌకాచరిత్రము అనే యక్షగానాలు రచించారు. త్యాగరాజు 24,000 కీర్తనలు రచించారని ప్రతీతి. కాని వాటిలో సుమారు 692 మాత్రమే లభ్యమవుతున్నాయి. ప్రహ్లాదభక్తి విజయం, నౌకాచరితంలోని కృతులను కూడా కలుపుకొంటే. అన్ని కృతులలోను స్వీయ నామాంకిత ముద్ర (త్యాగరాజనుత) ఉంటుంది. ఇది శివుడికి కూడా వర్తిస్తుంది.

ప్రహ్లాదభక్తి విజయం ఐదంకాల సంగీతనాటకం. ఈ యక్షగానం 'సంగీత నాటక రచనా విధానానికి నాంది' అని ప్రొఫెసరు సాంబమూర్తిగారు పేర్కొన్నారు.

ఈ నాటకంలో దరువులు, ద్విపదలు, గద్యపద్యాలు, కొన్ని శ్లోకాలు, ఒక చూర్ణిక, ఒక దండకము ఉన్నాయి. దరువులు మాత్రం యక్షగానాలలోని దరువులకు కొద్దిగా భిన్నంగా ఉన్నాయి. ఇది నౌకాచరితంలోని దరువులకు కూడా వర్తిస్తుంది. అవి చక్కగా కృతులలాగా పాడుకోదగినవి. పద్య రచనలలో త్యాగరాజు పోతన్న పోకడ పోయినారు. ఇద్దరూ పరమ భాగవతోత్తములు కదా! శ్రీరాముణ్ణి ఒకరు పద్యరూపంలో ఎంతో పారవశ్యంలో కొలిస్తే, మరొకరు కృతులలో ఆ ఆకృతిని నిలుపుకొన్నారు. పోతన శబ్దాలంకార ప్రియత్వం త్యాగరాజు పద్యాలలోనే కాదు, కృతులలో కూడా కనిపిస్తుంది. 'నౌకాచరితం' అనే యక్షగానంలో కూడా గద్యపద్యాలు, కీర్తనలు, దరువులు, ఒక ఉత్సాహవృత్తం ఉన్నాయి. అయితే ఇందులో 'ప్రహ్లాద భక్తి విజయం'లో వలె అంక విభజన లేదు. కనుక ఇది యక్షగానమే.

లభ్యమైన త్యాగరాజు కీర్తనలలో ఐదు 'ఘనరాగ పంచరత్నాలు', 88 దివ్యనామ సంకీర్తనలు, 26 ఉత్సవ సంప్రదాయ కీర్తనలు, 573 కృతులు ఉన్నాయి. ఘనరాగాలైన నాట, గౌల, ఆరభి, వరాళి, శ్రీరాగం రాగాలలో ఉన్న కృతులను 'ఘనరాగ పంచరత్నకృతులు' అంటారు. కీర్తనలకు, కృతులకు పెద్దభేదమేమీ లేదు. పల్లవి, చరణాలు మాత్రమే ఉన్న వాటిని 'కీర్తనలు' అని, వాటిలో కూడా ఆయా ఉత్సవ సందర్భాలలో పాడే వాటిని 'ఉత్సవ సంప్రదాయ కీర్తనలు' అని, పల్లవి, అనుపల్లవి, చరణాలు మాత్రమే ఉన్న వాటిని కృతులని వింగడించినారు. త్యాగరాజు కృతులలో ఒక పాదచరణం నుంచి, ఎనిమిది పాదాల చరణాల వరకు కూడా ఉన్నాయి.

ఏ వాగ్గేయకారుని కృతులనైనా ఛందశ్శాస్త్ర లక్షణాన్ని అనుసరించి గీతుల నిర్ణయం చేయడం సాధ్యం కాని పని. త్యాగరాజు కృతులకు ఇది మరీ కష్టం. కృతుల (పాటల)లో తాళాన్ని అనుసరించి మాతువు (సాహిత్యం, మాటలు) ఉంటుంది. పాటలోని తాళానికనుగుణంగా మాటలలోని అక్షరాలను కుదించుకోవడమో, సాగదీయడమో తప్పనిసరి. తాళం అంటే స్థూలంగా లయే (గతి). సంస్కరించబడిన, అభివృద్ధి పరిచిన లయే తాళం.

త్యాగరాజు కృతులు తాళానుగుణంగా ఉన్నవైనా, ఆకృతులలో సగానికిపైగా గతులను సులభంగా గుర్తించవచ్చు. ఉదాహరణకు

త్రిశ్రగతి:-

మూడు మాత్రల ఆవృత్తి.

కనులు చల్లగాను నిన్ను గందు (నాదు)
తనువు పులకరించ మెచ్చుకొందు

ఇది హయ ప్రచారరగడ. నాలుగు సూర్యగణాలు (హగణం (గల) నగణం), తృతీయ గణాద్యక్షరం యతి, ప్రాస, అంత్యప్రాస, పాద మధ్య యతి రగడల సామాన్య లక్షణం.

సారమైన దివ్యాన్నము - షడ్ర సంయుత భక్షణములు
దార సోదరాదులతో - త్యాగరాజ వినుత

దివ్యాన్నము షణ్మాత్రగణం (తగణం మీద లఘువు) సూర్యగణం కాదు. రెండు త్రిమాత్రా గణాలుండవలసిన చోట ఒక షణ్మాత్రాగణం వేయడం వాగ్గేయకారులు, గేయకవులు అనుసరించే పద్ధతి. అట్లాగే రగడల్లో లాక్షణికులు నిషేధించిన విలోమగణమైన 'లగ' (లతో) ప్రయోగం కూడా పై కృతిలో కనిపిస్తుంది.

రాగరహిత రాగరసిక యాగ యోగ భోగ ఫలద
నాగ శయన నాగరిపు నుత త్యాగరాజ కలార్చిత

ఇది తురగవల్గన రగడ. ఎనిమిది త్రిమాత్రా గణాలు; పంచమ గణాద్యక్షరం యతి. ఇట్లే పది త్రిమాత్రా గణాలతోను, 12 త్రిమాత్రాగణాలతోను నడిచే పాదాలు గల చరణాలున్నాయి. (16 గణాలు ఉంటే విజయ మంగళ రగడ అవుతుంది.)

త్యాగరాజు కృతులలో 'సర్వలోక దయానిధే - సార్వభౌమ దాశరథే',

'పూల పాన్పు మీద బాగ పూర్ణ పవ్వళించు', 'అమ్మ ధర్మ సంవర్ధని ఆదుకోవమ్మ', 'అప్ప రామ భక్తి ఎంత గొప్పరా', 'ఎంత వేడుకొందు రాఘవ', 'ఓరచూపు చూచేది న్యాయమా', 'తెలిసి రామచింతనతో నామము సేయవే ఓ మనసా', 'దరిని తెలుసుకొంటి, త్రిపురసుందరిని శరణంటి' వంటి కృతులెన్నో త్రిశ్రగతిలో నడిచేవే.

**చతురస్రగతి: నాలుగు మాత్రలతో నడిచేవి.**

నీటో మెల్లని మాటో కన్నుల
తేటో మరివలె వాటో మనసా
కులుకో పావల గిలుకో కపురపు
బలుకో చెక్కుల తళుకో మనసా

పైది మధుర గతి రగడ - అంత్య ప్రాస మాత్రం లేదు. చరణంలో ప్రతి పదం చక్కగా నాలుగు మాత్రలకు తెగుతున్నది. చక్కటి తెలుగు మాటల పొందిక ఉన్నది. స్వరసామ్యం (ఓ), అనుప్రాస రమ్యత ఉన్నది. ప్రతి పాదంలోను ఒకటోగణం, మూడో గణం నియతంగా గగమో, సగణమో అయి ఉండటం వల్ల నడకకొక చక్కటి ఊపు వచ్చినది. ఈ కృతిలోని మిగతా చరణాలు కూడా ఇదే రచనా విన్యాసాన్ని అనుసరించినాయి. ఇటువంటి రచనను యక్షగానాలలో 'నడరేకు' లంటారు. దీనినే పద్ధడీ ఛందస్సు అని కూడా అంటారు. పద్ధడీలో పాదానికి పదహారు మాత్రలుంటాయి. మరొక ఉదాహరణ

"రఘునందన రఘునందన రఘునందన రామా
పాడుదు నిను వేడుదు కొనియాడుదు శ్రీరామా
కోరితి నిను జేరితి నను దూరకుమీ రామా
ఏమో యని నీ మనసున ఏమర కే రామా
గతి లేదని పతి నీవని మతినే శరణంటి
జాలము నీ కేలను నే దాళను శ్రీలోల

పైది చతురస్రగతిలో ఉన్న కృతి అయినా, రూపకతాళంలో తకిటకు - కిడ - తకిటకు **(4+2+4)** ఆవృత్తిలో చాలా వేగంగా నడుస్తుంది.

చతురస్రగతిలో నడిచే కృతులలో సాధారణంగా విలోమగణమైన జగణం ఉపయోగించరు. విలోమగణాలు ఎదురు నడకగలవి. అవి గతిని భంగింపజేస్తాయి. కాబట్టి లాక్షణికులు రగడలలో విలోమగణాలను నిషేధించారు. త్యాగరాజు త్రిశ్రగతిలో 'లగ'ను, చతురస్రగతిలో జగణాన్ని వాడినారు. ఉదాహరణకు

"తరాన దొరకని పరాకు నాయెడ
మరామ చేసితె సురాసురులు మె
త్తురా ఇ పుడు ఈ హరామి తనమే
లరాభ క్తత్యాగ రాజ నుత

'తరాన - పరాకు - మరామ - సురాసు - త్తురాఇ - హరామి - లరాభ' - అన్నీ జగణాలే విలోమగణాలే. ఈకృతి (ఎదుట నిలిచితే నీదు సొమ్ములేమి బోవురా) మిగతా చరణాలు కూడా ఇలాగే ఉన్నాయి. ఇది ఉద్దేశపూర్వకంగా చేసిన ప్రౌఢప్రయోగం. ఆధునిక కవులలో శ్రీశ్రీ మహాప్రస్థానంలో చతురస్రగతిలో 'జగణం' యథేచ్ఛగా ఉపయోగించారు. 'పొలాలలన్నీ - హలాలదున్నీ - ఇలా తలంలో హేమంపిండగ' వంటి పాదాలెన్నో ఉన్నాయి.

చతురస్రగతిలోనే 8 మాత్రలలో ఆదితాళంలో నడిచే కృతి.

సామజవరగమ / నా.. సాధు హృ.
త్ సా. ర సా. బ్జ పా. ల / కాలా . . తీ . త వి ఖ్యా తా "

అనే ప్రసిద్ధ కృతి ఇందుకు ఉదాహరణ.

త్యాగరాజ కృతులలో "కొలువై యున్నాడే కోదండపాణి", 'సుందర దశరథ నందన వందన మొనరించెదరా', 'హరిదాసులు వెడలే ముచ్చటగని ఆనందమాయె దయాళో', 'సారసనేత్రా సారగుణా సామజరక్షగోద్ధరణా', 'ఏమని పొగడుదురా శ్రీరామా', 'ఏమని మాట్లాడితివో రామా', 'కరుణ ఏలాగంటే నీ విధమే కల్యాణ సుందర రామా', 'కొలువమరె గదా కోదండపాణి', 'చక్కని రాజ మార్గములుండగ సందుగొందులు దూరనేల ఓ మనసా', 'చల్లగ నాతో బల్కు మీ రామ సారసవదనసాధు సంత్రాణ', 'నను పాలింపనడిచి వచ్చితివో నా ప్రాణనాథ', 'నా మొఖాలకింపవేమి శ్రీరామ', ' నాయెడ వంచన సేయకురా ఓ రాఘవా నలుగురికై నమ్మలేదురా శ్రీరామచంద్ర', 'పరాకు నీకేలరా రామ', 'ముచ్చట బ్రహ్మాదులకైన దొరకు నా ముదితలార చూతాము రారె', వంటి కృతులెన్నో చక్కగా చతురస్రగతిలో నడుస్తాయి.

**ఖండగీతి:**

ఐదు మాత్రల ఆవృత్తిలో నడిచేది. ద్విరదగతిరగడ, విజయభద్రరగడ.

'సరిగంచు శాలువట చౌకట్ల పోగులట
పరువంపు ప్రాయమట పరమాత్ము డట

పైది ద్విరదగతి రగడ ఛందానికి చెందినది. సరిగ్గా ఐదు మాత్రల పదబంధాలనే కూర్చడం జరిగింది. యతిప్రాస, అంత్యప్రాసలు ఉన్నాయి.

కండ చక్కెర వంటి పలుకులు విని మేము - కామించి - వచ్చితిమి
ఉండి యుండి బాలుని - గిల్లిమరి - తొట్ల నూచేదెరుగ - మైతిమి

ఇది విజయభద్రరగడకు దగ్గరగా ఉన్నది. విజయభద్ర రగడలో ఐదు మాత్రల గణాలు ఎనిమిది ఉంటాయి. పై కృతిలో పాదానికి ఆరు మాత్రమే ఉన్నాయి. యతి, ప్రాస, అంత్యప్రాసలతో లక్షణవంతంగా ఉన్నదీ కృతి.

త్యాగరాజు కృతులలో 'మేలుకొనయ్య - మమ్మేలుకో రామ.

మేలైన సీతా సమేత నా భాగ్యమా', 'అనుపమ గుణాంబుధీ యని నిన్ను - నెరనమ్మి యనుసరించవాడనైతి', 'అమ్మ రావమ్మ తులశమ్మమము పాలింప', 'ఓరంగశాయీయని బిలిచితే ఓ యనుచు రారాదా', 'గురు లేక ఎటువంటి గుణికి తెలియగబోదు', 'దాచుకోవలెనా దాశరథి నీ దయ', 'క్షీరసాగర శయన నన్ను చింతల బెట్టవలెనా రామా' వంటి కృతులెన్నో చక్కగా ఖండగతిలో నడుస్తాయి.

**మిశ్రగతి:**

ఏడు మాత్రలగణాలు (3+4) ఆవృత్తి. హరిణగతి, వృషభగతి రగడలు. ఉదాహరణ.

నీలగళ సుర జాల - నుత నత - పాల - గిరిశివి - శాల - ఫాలకృ
పాల - వాల సు - శీల - గౌరీ - లోల - శివమాం - పాల -యాద్భుత

ఇది వృషభగతి రగడ-నాలుగు సప్తమాత్రగణాలు. తృతీయ గణాద్యక్షరం యతి.

త్యాగరాజు కృతులలో స్పష్టంగా మిశ్రగతిలో నడిచేవి కనిపించవు. మిశ్రచాపు తాళంలో నడిచే కృతులున్నాయి. 7 అక్షరాల (మాత్రలు) ఆవృత్తిలో నడిచేవి. ఇవి మూడు నాలుగు మాత్రలుగా మిశ్రగతి నడకలో విభక్తం కావు. ఉదాహరణకు 'ఎందుకు దయరాదురా శ్రీరామచంద్రా' అనే పల్లవిని

' . ఎం - దూకూ । దయా - రా . దు (రెండు ఆవర్తాలు)
. రా - శ్రీ. . । రామ చంద్రా (రెండు ఆవర్తాలు)

ఈ రకంగా పాడతారు. కృతి చదవగానే మిశ్రగతి (3+4గా విరిగేవి) అని గుర్తించే కృతులు దాదాపు లేవనే చెప్పాలి. త్యాగరాజు కృతులలో 'అడిగి సుఖము లెవ్వరనుభవించిరిరా', ' అడుగు వరముల నిచ్చేను' 'ఇంతకన్న దెల్పతరమా జగదీశ్వరా', 'ఇంత తామసమైతే నేనెంతని సైరింతు' వంటి కృతులు మిశ్రచాపు తాళంలో నడుస్తాయి.

మొత్తం మీద త్యాగరాజు కృతులు ఎక్కువగా చతురస్రగతిలోను, ఆ తర్వాత ఖండగతి, త్రిశ్రగతుల్లోను నడుస్తాయి.

త్యాగరాజు కృతులలో కొన్ని కృతులు ద్విపద ఛందస్సులో ఉన్నాయి. ద్విపదకు ప్రతిపాదానికి 3 ఇంద్రగణాలు, ఒక సూర్యగణం ఉంటాయి. 3వ గణాద్యక్షరం యతి. ఉదాహరణకు 'సీతాకళ్యాణ వైభోగమే' అనే కీర్తనలో

పవనజ స్తుతిపాత్ర పావన చరిత్ర
రవి సోమ వర నేత్ర రమణీయ గాత్ర

అనే ద్విపదలో 'పావనచ' అనే చోట 'భల' పడింది. అట్లాగే

'భక్త జన పరి పాల భరిత శర జాల
భక్తి ముక్తి ద లీల భూదేవ పాల
... ... ... ... ... ...
... ... ... ... ... ...

అనే ద్విపదలో 'భరితశర' అనే చోట 'నలల' గణం పడింది. అట్లాగే 'శ్రీవాసుదేవుని సీతారాఘవుని' - అనే ద్విపదపాదంలో 'మగణం' పడింది. ద్విపదలో ఇంద్రగణాలు కాని వాటిని (మగణం, భల, నలల వంటి చంద్రగణాలు) సోమనాది శివకవులు కూడా వాడినారు. త్యాగరాజు కృతులు గణ దృష్టితో కంటె గాన దృష్టితో రచితమైన కృతులు. పైగా త్యాగరాజు కృతులలో కన్నడ వాగ్గేయకారుడైన పురందరదాసు ప్రభావం అమితంగా ఉన్నది. కన్నడ ఛందస్సు దృష్ట్యా ఇవి సమ్మతమే.

త్యాగరాజు కృతులలో మంగళహారతి సీసపద్య ఛందస్సులలో నడిచినది. సీస పద్యంలో 6 ఇం + 2 సూ. గణాలు ఉంటాయి.

" జయ మంగళం నిత్యశుభ మంగళం
కరుణా రసాక్షాయ కామారి వినుతాయ
నిరుపమ శరీరాయ నిఖిలాగమ చరాయ
సురవినుత చరితాయ సువ్రతాయ
మంగళం । మంగళం - మారామ - చంద్రునకు
మంగళం - మంగళం - మాధవునకు

ఈ పద్యంలో కూడా 'సురవినుత', 'చంద్రునకు' అనే చోట్ల చంద్రగణాలైన 'నలల', 'భల' అనే గణాలు పడ్డాయి.

**డోరా ఛందస్సు:-**

డోరా అనేది యక్షగానాలలో హరికథలలో కనిపించే ఛందో విశేషము. ఇందులో నాలుగు మాత్రల గణాలు నాలుగు, మూడు మాత్రల గణాలు నాలుగు, మూడు మాత్రల గణాలు వరసగా నడుస్తాయి ద్రుతగతిలో పాడుతారు.

వాసిగ నారద మౌని వరమడుగ - వనిత రూపుడాయె
ఆసించి దుర్వాసు డన్న మడుగా - అపుడె మందమాయె

**వెండిరేకు దరువు :**

"నవ్వుచు కులుకుచు నొకతె - కొప్పున -బువ్వులు -ముడుచుచు- నొకతె
దువ్వుచు - కురులును నొకతె - కృష్ణుని - రవ్వ జేయుచును నొకతె

పైది మధ్యాక్కర పద్యం. 2 ఇం+1సూ+ 2ఇం+1సూ. ఉంటాయి. మధ్యన తూగుకోసం 'కొప్పున - కృష్ణుని' అనే పదాలు చేర్చడం జరిగింది.

**కోలాటదరువు :**

"ఇసుక తిన్నెలు ఎంత తెలుపే - మేను - ఇంద్ర నీలము వంటి నలుపే
కోకిలములు మ్రోసెనే - మరుడు - కుసుమశరంబు లేసెనే"

మిశ్రగతిలో నడిచే ఈ పాదాలు మధ్యలో 'మేను, మరుడు' అనీ త్రిశ్రగతి పదాలు వేయడం వల్ల ఒక విధమైన తూగు వచ్చి 'కోలాటదరువు'లో నడిచింది.

'రామ రామ రామ మాం పాహి' అనే కృతిలో చరణాలు రెండింటిలోనూ అక్షరాలన్నీ దాదాపు లఘువులే ఉండటం విశేషం.

వనమున జని - మునిజన గణమును, గను
గొని నెనరున ఘనముగ బాలించిన
వనజ నయన నిను మనసున, దిన దిన
మును గనుగొన నను ననఘు ని సేయవే.

త్యాగరాజు కృతులు కొన్నిటిలో సంస్కృత వృత్తాల నడకలు గోచరిస్తాయి.

"గిరిరాజ సుత తనయ సదయ
సురనాథ ముఖార్చిత పాదయుగ
పరిపాలయ మాంఇభరాజ ముఖ" అనే పాదాలను

"గిరిరాజ సుతా తనయా సదయా
సురనాథ ముఖార్చిత పాదయుగా
పరిపాలయ మామిభరాజముఖా" అని రాస్తే అది తోటక వృత్తమవుతుంది. తోటకవృత్తంలో పాదానికి నాలుగు సగణాలుంటాయి.

ఘనరాగ పంచరత్నాలలో పాదనియతిగాని, పాద దైర్ఘ్యం గాని (అంటే గురు

లఘ్వక్షర క్రమతగాని, మాత్రా సమత గాని) ఉండవు. అవి వచన కవితలే అయినా అవి ఒక ప్రత్యేక పద్ధతి నవలంబించి సప్రయత్నంగా శాస్త్ర దృష్టితో రచించినవి. వాటిని పాడినప్పుడే వాటిలోని సౌందర్యం, గాంభీర్యం అవగతమవుతాయి, అనుభూతమవుతాయి.

**యతి:**

త్యాగరాజు తన కృతులలోయతిని అంతటా పాటించడం జరిగింది.

ఉదా:-

ఉండేది రాముడొకడే ఊరక చెడిపోకె మనసా
యతి తప్పిన సందర్భాలు కొన్ని లేకపోలేదు. ఉదాహరణకు
జనియింప జాలిజెంది మూర్ఛిల్ల
యతులకు సురలకు నెల్ల వారలకు

పై వాటిలో తమిళుల ఉచ్చారణను బట్టి జరిగిన యతిదోషం. అకారాది సంస్కృత పదాన్ని తమిళులు ఎకారాదిగా ఉచ్చరిస్తారు. కాబట్టి ఉచ్చారణ ప్రకారం యతికూర్చడం జరిగింది.

**ప్రాస:**

గేయ రచనలలో ద్వితీయాక్షర ప్రాస నియతం కాకపోయినా, త్యాగరాజు పద్యకవితా మర్యాదననుసరించి, తన కృతులలో ప్రాసను నియతంగా వాడటం జరిగింది. ప్రాసను నియతంగా పాటించడం వల్ల కొన్ని కృతులలో ఆశు కవితారీతితో పాటు లిఖిత కవితారీతి కూడా పడుగు పేకల్లా అల్లుకుపోయింది. ఉదాహరణకు

'ఎందుకీ చలము నేనెవరితో దెల్పుదు' అనే కృతిలో

కౌసల్య చెప్పెనో - నీకే సమ్మతి లేదో
అహల్య చెప్పెనో - నన్నాదరించలేవో
కబరీభారిణి సీతాకాంత చెప్పెనో లేక
శబరి చెప్పెనో - నీదు శాంతమెందుబోయె
బాలయౌ స్వయంప్రభ చెప్పెనో
తాళనా తరమా . . . .

మొదటి రెండు పాదాలు ఆశుకవితారీతికి చెందినవి. మూడోపాదం లిఖిత కవితారీతికి చెందినది. ఆశుకవితారీతి ననుసరించి 'సీతమ్మ చెప్పెనో' - అని

ఉండాలి. కాని తర్వాతి పాదంలోని 'శబరి' పదంలోని 'బ' ప్రాసాక్షరం కాబట్టి 'సీత' కబరీ భారిణి' అయింది. తర్వాత పాదాలు కూడా లిఖిత కవితారీతికి చెందినవే.

'అ - ర' లకు ప్రాస మైత్రి ఘటించడం జరిగింది.

ఉదాహరణకు

కఱకు సువర్ణపు సొమ్ము బెట్టి
సరిగ చీర ముద్దు గురియ గట్టి

కొన్ని కీర్తనలలో పల్లవి, అనుపల్లవిలోనే కాక చరణంలో కూడా అదే ప్రాసాక్షరాన్ని పాటించడం జరిగింది. ఉదాహరణకు 'కద్దను వారికె కద్దని మొరల నిడు, పెద్దల మాటలు నేడబద్ధమౌనో' అనే కీర్తనలో 'ద్ద' కార ప్రాసాక్షరాన్ని చరణంలో కూడా (నాలుగు పాదాలలోను) పాటించడం జరిగింది.

కొన్ని చరణాలలో నాలుగక్షరాల వరకు ప్రాసను పాటించడం జరిగింది. ఇది ప్రౌఢ కవితా పద్ధతి.

మార మారనుత నా మనవిని విను
మారమా రమణ మరువనురా సుకు
మార మారసనమున నీనామమ
మారు మారు బల్కను దయ సేయము

ఇట్లాగే ఈ కృతిలో మిగతా చరణాలలో కూడా 'వారి వారి', 'రాజరాజ' అనే నాలుగక్షరాల ప్రాసను పాటించడం జరిగింది.

**సంయుతా సంయుత ప్రాస:**

సంయుక్తం కాని అక్షరానికి సంయుక్తాక్షరానికి ప్రాసను ఘటించడం - ఉదాహరణకు

నీదు పుణ్యముల నా . . . .
స్వాద్వన్నములు . . .

చ, జ లకు ప్రాసమైత్రి ఘటించడం

'రాజీవ దళాక్షులంతరంగముసం
కోజములో వ్యథ జెందుచు

సంకోచము - సంకోజము. ఇది తమిళుల ఉచ్చారణ పద్ధతిననుసరించి పాటించడం జరిగింది.

## గణభంగం

నౌకాచరితంలో శార్దూలవృత్తంలో ఒకచోట గణభంగం జరిగింది.

'నౌకారంధ్రములో జలంబు చొరగా నత్యంత వ్యాలోలురై. 'వ్యా' సంయుక్తాక్షరము. దానికి ముందున్న 'త' సమాసగతం కావటం వల్ల గురువై గణభంగం జరిగింది.

## శబ్దాలంకారాలు

### ఛేకానుప్రాసం:

రెండుగాని, అంతకు మించిగాని అక్షరాలు తిరిగి తిరిగి రావడం, 'రాజరాజునికి చెలికాడైన రాజశేఖరుని గోపురనిలయుని రాజసగుణరహితుని శ్రీ త్యాగరాజ' -

### వృత్త్యనుప్రాస:

ఒకే అక్షరం తిరిగి తిరిగి రావడం. త్యాగయ్య పోతన వలె వృత్త్యను ప్రాసను తన కృతులలో అధికంగా ఉపయోగించినారు.

"కలకలమను ముఖ కళలను గని కలువల రాజు భువికి రాడాయె"

### ముక్తపదగ్రస్తం:

విడిచిపెట్టిన పదాన్ని పదబంధాన్ని వెంటనే ఎత్తుకోవడం

లాలి లాలీయని యూచేరా వన
మాలి మాలిమితో జూచేరా

అట్లాగే - మాయదారి - దారిజ సద్భుజన

### యమకం:

ఒకే పదం భిన్నార్థం స్ఫురించేలా వెంటవెంటనే ప్రయోగించడం.

ఉదాహరణకు:

మన సా మ న సామర్థ్యమేమి
జనకజామాత - జనక - జామాతవై
కనక పట ధర - నన్ను కన - కపటమేల

**అంత్యప్రాస:**

పాదాంతంలో సామ్యాక్షరాలను ప్రయోగించడం

నీవు లేకయే తనువులు నిరతముగా నడచును
నీవు లేక యే తనువులు నిక్కముగా మొలచును

ఒకే పాదంలో తాళం ముగిసినచోట అంత్యప్రాస ఘటించడం. ఉదాహరణకు

(1) వరమృదుభాష - విరహిత దోష - నరవరవేష
సరసిజనేత్ర - పరమపవిత్ర - సురపతిమిత్ర
నినుకోరితిరా - నిరుపమశూరా - నన్నేలుకోరా

(2) అనఘ సుపుణ్య అమరవరేణ్య - సనకశరణ్య-సత్కారుణ్య

ఇట్లా ఎన్నో శబ్దాలంకారాలు త్యాగరాజ కృతులలో లయ మాధుర్యాన్ని బహుగుణీకృతం చేశాయి. శ్రుతిసుభగత్వాన్ని సమున్నత స్థాయికి తీసుకొని వెళ్ళాయి.

**అజంతత్వనాదత:**

తెలుగు భాషలోని అజంతత్వనాదత త్యాగరాజ కృతులలో ఎంతో సువ్యక్తమై, సుస్పష్టమై నాదసుధాధారను నాన్యతో దర్శనీయంగా పెంచినది. 'దొరకునా ఇటువంటి సేవ' అనే కృతిలో

'తుంబురు నారదులు సుగుణ కీర్తనంబుల నాలాపము సేయగా'

ఈ పాదంలో స్వరాంత పదాల కూర్పువల్ల లయ శోభాతిశయంగా వ్యక్తమైనది. మొత్తం '9' ఉకారస్వరాలు, నాలుగు 'ఆ'కార స్వరాలు, 6 'అ' కారస్వరాల ఆవృత్తి వల్ల శ్రుతి సుభగత చెవులకు చవులూరిస్తున్నది.

అదే కీర్తనలో 'మరకతమణిసన్నిభ - దేహంబన - మెరుగు - కనక - చేలము - శోభిల్ల' అనే పాదంలో 'అ' కారాంత పదాల కూర్పు వల్ల మొత్తం '14' అకార స్వరాక్షరాల ఆవృత్తి వల్ల ఎనలేని నాదరమ్యత చోటు చేసుకొన్నది. మరో ఉదాహరణ.

'నీ జపము - నీ స్మరణ - నీ పాదపూజ - నీవారి చెలిమి యొసగె' దీర్ఘ 'ఈ' స్వరాలు 'నీ' అక్షరం ప్రతి పదం ముందుగా ఉండటం, చివర వరసగా 'ఇ' స్వరాంతపదాల ఆవృత్తి వల్లను నడక అందం అతిశయించింది. మరో ఉదాహరణ.

'నా జీవాధారా, నా నోము ఫలమా, నా చూపు ప్రకాశమా, నా నాసికాపరిమళమా, నాజపవర్ణరూపమా, నాదు పూజాసుమమా'

ఎత్తుకొన్న స్వరం (ఆ) తోనే పదాంతం కూడా ముగించడం వల్ల (మొత్తం 17 దీర్ఘ 'ఆ' స్వరాల కూర్పు వల్ల), ముఖ్యంగా 'నా' అనే అక్షరం అదే పనిగా ఆవృత్తం కావడం వల్లనూ కృతిలో ఎక్కడలేని ఆర్ద్రత, ఆర్తీ, వేడుకోలు మహోన్నత స్థాయిలో వ్యక్తమైనాయి.

ఇటువంటి ఎన్నెన్నో మరెన్నెన్నో రచనా విశేషాల వల్ల త్యాగరాజు కృతుల కంతటి నాదమాధుర్యమబ్బినది. ధాతు కల్పనలోనే కాక మాతుకల్పనలో కూడా త్యాగరాజు మహోన్నతుడు. ఆ సంగీత సాహిత్య సాగరానికి ఎంతగా నేతాములెత్తి తోడినా ఎన్నో విశేషాలు జాలువారుతూనే ఉంటాయి నిరంతరంగా, నిత్యనూతనంగా, పాలు మారేది మనమే. అలుపెరుగని సాగరుడు సాగరుడే కదా!

సరస్వతి దేవి స్తనద్వయాలలో ఒకటి ఆపాత మధురమూ అయిన సంగీతాన్ని, మరొకటి ఆలోచనామృతమూ అయిన సాహిత్యాన్ని సమానంగా గ్రోలిన గానచంద్రులు, జ్ఞానభాస్కరులు, త్యాగరాజు. ఆయన కావ్యరచన చేసి ఉంటే మళ్ళీ మరొక పోతన్న మనకు లభించే వాడేమో! బహుశః రామాయణం రచించి ఉండే వారేమో! ఆ కావ్యం మహాభారతం, భాగవతం సరసన నిలిచి ఉండేదేమో! రామాయణం కావ్యంగా రచించకపోయినా కొన్నివేల కీర్తనలలో ఆ రాముణ్ణి ఎంతో ఆర్ద్రతతో, ఆర్తితో, ఆత్మీయాభిమానాలతో, వేదనతో, వేడుకోలుతో మనసా, వాచా, కర్మణా పాడుకొన్నారు. ఆ నాదోపాసకుడు ఏనాటికీ తరగని సంగీతనిధిని ఇచ్చివెళ్ళినారు. ఆయన ఋణము దీర్పతరమా ఎన్ని వేల సెమినారులు జరిపినా, ఎన్ని కోట్ల గాయకగంధర్వులు ఆయన సమాధి సన్నిధిలో పాడినా . . . ఋణము దీర్పతరమా . . .

ఆ నాదోపాసకుని నాదు ఉపాసనే ఈ చిరు వ్యాసం.

## ఉపయుక్త గ్రంథాలు:

1. త్యాగరాజు సారస్వత సర్వస్వం - నూకల చినసత్యనారాయణ
2. సంగీతశాస్త్ర సుధార్ణవం - నూకల చినసత్యనారాయణ
3. త్యాగరాజు కవిత్వము - డా॥ ఎస్. శమంతకమణి
4. తెలుగులో పదకవిత - ఆంధ్ర సారస్వత పరిషత్తు
5. ఆధునికాంధ్ర గేయ కవిత్వం - డా॥ జి. చెన్న కేశవరెడ్డి

# అన్నమయ్య - త్యాగయ్య తులనాత్మక పరిశీలన

ఆచార్య ఎస్. శరత్‌జ్యోత్స్న రాణి

**వా**గ్గేయకారులుగా సుప్రసిద్ధులైన సంకీర్తనాచార్యులు అన్నమయ్య ధాతుకల్పనాధ్యక్షులుగా కీర్తి పొందిన త్యాగయ్యల జీవిత చరిత్రను వారి రచనలను గమనిస్తే చాలా వరకు పోలికలు కనిపిస్తాయి. వారిరువురి నడుమ శతాబ్దాల తేడా ఉన్నప్పటికి, వారిరువురు కారణజన్ములు కాబట్టి వారి రచనలు శుద్ధమైనవి, ఎందరికో మార్గదర్శకమైనవి.

## వారిరువురి జన్మ విశేషాలు (పుట్టుకకు సంబంధించిన విషయాలు)

తాళ్ళపాక అన్నమాచార్యులు క్రీ.శ. 1408 క్రోధినామ సంవత్సరం వైశాఖ శుద్ధపూర్ణిమనాడు, లక్కమాంబ నారాయణసూరి అనే పుణ్యాదంపతులకు కడప జిల్లా రాజంపేట తాలుకాలోని తాళ్ళపాక గ్రామంలో శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహం వల్ల జన్మించాడు. అన్నమయ్య పుట్టుకకు ఒక కారణం ఉంది. అన్నమయ్య, స్వామివారి వరప్రసాది. పుట్టుకతోనే ప్రతిభావంతుడయిన అన్నమయ్య వేదాలు పురాణాలు రామాయణ భారత భాగవతాది, సకల శాస్త్రాలను కూలంకషంగా అభ్యసించిన పండితుడు. అందువల్లనే 32 వేల శృంగార ఆధ్యాత్మిక సంకీర్తనలు రచించి, తెలుగు వారికి అందించాడు. సులభమయిన భక్తిమార్గాన్ని సంకీర్తనల ద్వారా అందించిన యోగి, అన్నమయ్య.

## త్యాగయ్య

త్యాగయ్య తల్లిదండ్రులయిన సీతమ్మ రాంబ్రహ్మంగార్లకు ఇద్దరు కుమారులున్నప్పటికి వారికి దైవభక్తి పితృభక్తి లేనందున ఆ దంపతులు దుఃఖించని రోజు లేదు. వారికి స్వప్నంలో తిరువారూరు త్యాగరాజస్వామి దర్శనమిచ్చి భక్తాగ్రేసరుడు అయిన వాగ్గేయకారుడు కాగల కుమారుడు నీకు కలుగునని దీవించాడు. ఆ

స్వామి దయవల్ల క్రీ.శ. 1767లో ఆ దంపతులకు వరప్రసాదిగా త్యాగయ్య జన్మించాడు. అతనికి త్యాగరాజు అని నామకరణం చేసారు. చిన్ననాటి నుంచి త్యాగయ్య తల్లి పూజ చేసే సమయంలో జయదేవుని అష్టపదులతో పాటు, అన్నమాచార్యుల సంకీర్తనలను కూడా నేర్పించేది. తండ్రి దగ్గర సంస్కృతాంధ్ర భాషలతోపాటు, పోతన భాగవతాన్ని శ్రద్ధగా చదువుకొనేవాడు. ఆ విధంగా దివ్యనామ సంకీర్తనలను రచించి, పాడుతూ ఉండేవాడు త్యాగయ్య. త్యాగయ్య తన భావాలను ఇంటి గోడల మీద వ్రాసేవాడట. అవి చూసిన తండ్రి, రామబ్రహ్మం, వాటిని జాగ్రత్తగా రాసి, విద్యాధికులకు చూపగా, వీటన్నింటిని గ్రంథరూపంలో తీసుకొని రావలసిందిగా వారు చెప్పారట. చిన్ననాటి నుంచే, శ్రీరాముని భక్తుడిగా, ఏకసంథాగ్రాహియై ఒక సంవత్సరంలోనే ఆస్థాన్ విద్వాన్ శొంఠి వెంకట రమణయ్య గారి వద్ద సంగీత పాఠాలు నేర్చుకున్నాడు. అయినప్పటికి త్యాగయ్యకు కొన్ని చిన్న సందేహాలుండేవి! ఆ సందేశాలను తీర్చుకోవాలని అనుకున్నాడు. రామకృష్ణానంద స్వామి - మరుదనల్లూరు మఠ సన్యాసి, త్యాగయ్యకు నారదోపాస్తి మంత్రాన్ని ఉపదేశించాడు. త్యాగయ్య ఆ మంత్రాన్ని జపించాడు. నారదుడే యతివేషంలో త్యాగయ్యకు దర్శనమిచ్చి ఆలయంలోకి, 'స్వరార్ణవ'మనే సంగీత గ్రంథాన్ని 'నారదీయ'మనే మరో సంగీత గ్రంథాన్ని ఇచ్చి సందేహాలను నివృత్తి చేసినట్టు తెలుస్తుంది!

అప్పటి నుంచి త్యాగయ్య నారదుడ్ని గురువుగా స్వీకరించి భైరవి రాగంలో "రాజిల్లు వీణ కలుగు రాయవిజయశ్రీ" ........ కృతిని

శ్రీ నారద నాద సరసీరుహభృంగశుభాంగ శ్రీ త్యాగరాజ నుత....

శ్రీరామం పాలయ" అని కీర్తించాడు. రాముడ్ని గుండెల్లో నిలుపుకున్న భక్తాగ్రేసరుడు త్యాగయ్య. వీరిరువురు భగవంతుని వరప్రసాదులుగానే జన్మించడం విశేషం.

అన్నమయ్య భాగవతంలో చెప్పబడిన నవవిధ భక్తి మార్గాలకు సంబంధించిన 32వేల కీర్తనలను రచించాడు. అలమేల్మంగా వేంకటేశ్వరుల అందచందాలతో పాటు వారి గుణవిశేషాలను, వారి ప్రణయలీలలను ఎంతో శృంగార పరంగా వర్ణించాడు. వీటితోపాటు గ్రామీణజనులకు అర్థమయ్యే రీతిలో సంకీర్తనలు రాయడం అన్నమయ్య ప్రతిభకు తార్కాణం. త్యాగయ్య ఐహిక సంపదలపట్ల మోజు లేనివాడు. నిరాడంబర జీవితాన్ని గడిపినవాడు. ఎప్పుడు భక్తిపారవశ్యస్థితిలోనే ఉండేవాడు. ఆ

స్థితిలోనే ఆయన నోటివెంట వెలువడిన కృతులను శిష్యులు పలకపై రాసేవారు. ఆయన రాసిన కీర్తనలను పాఠంగా నేర్చుకొని ఆ వెనుక గురువు గారికి వినిపించేవారట. అది త్యాగయ్యవారి ప్రత్యేకత. అన్నమాచార్యుల నుండి ప్రారంభమయిన కీర్తన రామదాసు, నారాయణతీర్థులు సుబ్రహ్మణ్య కవి వంటి వాగ్గేయకారుల చేత, భజనకీర్తనలుగాను ఆధ్యాత్మిక కీర్తనలుగాను ప్రసిద్ధి పొందినవే. త్యాగయ్య నాటికి, కృతి అనే పేరుతోనే పిలువబడ్డాయి. కృతిలో భావానికి ప్రధానసూత్రమైన వాక్యం, పల్లవి, అను పల్లవి - పల్లవిలోని సూత్రానికి వ్యాఖ్యగా గాని అనుబంధంగా గాని సాగుతుంది. పద్యకవిత్వం కంటే ఉదాత్తమైన గద్యమే కృతులకు యోగ్యమైనదని త్యాగయ్య రచనలవల్ల స్పష్టం అవుతుంది. త్యాగయ్య కృతులలో దాదాపు సగం రామయాణ కథాత్మకమైనవి. రాముడే ఆయన ఆరాధ్యనాయకుడు. అచ్చయిన పుస్తకాలలో 660 కృతులు కనిపిస్తున్నా 40 మాత్రమే ప్రచారంలో ఉన్నాయి.

## బాధకు సంబంధించినవి

భక్తి జ్ఞాన మోక్ష మార్గాలకు ఆధారభూతమైన రామాయణ భాగవత గ్రంథాలు యిప్పటికి, అవి పద్యగద్యచంపూ కావ్యాలు కావడం - విద్యావంతులకు మాత్రమే పరిమితం కావడం వల్ల భక్తి నీతి ధార్మిక విషయాలు కొందరికి అందుబాటులో లేకపోవడం విచారకరమైన అంశంగా భావించిన అన్నమయ్య ఆ గ్రంథాలలోని పరమార్థ తత్త్వాన్ని హృదయరంజకమైన పాటల రూపంలో రచించి, పండిత పామరులను ఆనందింపజేసాడు. వారికి పరమార్థసారాన్ని అందించాడు.

త్యాగయ్య కూడా తన కృతులలో గ్రామ్యాన్ని వీరగ్రంథికాన్ని వాడక శిష్ట వ్యవహారికాన్ని వాడారు. సంగీత విషయంలో కొద్దిగా స్వాతంత్ర్యం ఉండాలని అన్నాడు. త్యాగయ్య రచనలు -

| | | |
|---|---|---|
| ప్రహ్లాద భక్త విజయము | - | 45 కీర్తనలు |
| నౌకా చరిత్రం | - | ఏకాంకిక |
| సీతారామ విజయం | - | (అలభ్యం) |

## జాతీయాలు సామెతల ప్రయోగాలు

అన్నమయ్య సంకీర్తనలలో అనేక రకములైన జాతీయాలు సామెతలు కనిపిస్తాయి.

**నీటముంచు - పాలముంచు**

నీట ముంచు పాలముంచు నీచిత్తమికను
చాటిది నీకృప గురి సంసారమును - (16-224)

**జాతీయం:-**

నీ చిత్తం నా భాగ్యం
మనసిచ్చి యెప్పుడు నీ మాటలోని దాననై
చెనకగానిక నీ చిత్తము నా భాగ్యం

**సామెతలు:-**

**తప్పు లేని జీవితం తారమైనం చాలు**

ధర్మంగా సంపాదించిన సొమ్ము నాలుగు కాసులైన తృప్తిని కలిగిస్తుంది. వేమన కూడా ఇలాంటి అర్థాన్ని పోలిన సామెతను చెప్పారు. అది "గంగిగోవు పాలు గరిటడైనను చాలు కడివెడైన నేమి ఖరము పాలు"

అప్పులేని సంసారమైన పాటే చాలు
తప్పులేని జీతమొక్క తారమైనంజాలు (2-114)

**త్యాగయ్య :-**

రూకలు పదివేలున్న చేరెడు
నూకలు గతిగాని ఓ మనసా ! -
కోకలు వేయున్న కప్పుకొనుట ఒకటేగాని,
ఏరు నిండిపారిన పాత్రకు తగు నీరు వచ్చుగాని
పారమీ కవితల విని వెర్రివాడు సంతోషపడియేమి! పడక ఏమి?

## రచనలను దేవునికే అంకితమివ్వడం

అన్నమయ్య త్యాగయ్యలు తమ రచనలను రాజులకు అంకితమివ్వక పోవడమే కాకుండా తాము ఆరాధించే దైవాలకు అంకితం జెయ్యడం విశేషంగా చెప్పవచ్చు.

అన్నమయ్య సంకీర్తనలు విన్న సాళువనరసింహరాయలు తన మీద కూడా ఒక కీర్తన పాడవలసిందిగా కోరాడు. అన్నమయ్య హరీ! హరీ అని చెవులు మూసుకున్నాడే కాని గళంవిప్పి ఆ రాజుపై గానం చేయలేదు. అందుకు మండిపడిన సాళువనరసింహరాయలు, కారాగారంలో బంధించాడు. అయినప్పటికి అన్నమయ్య దుఃఖించలేదు. ప్రహ్లాదునిలా

ఆకటి వేళలనలపైన వేళను

వేకువ హరి నామమే దిక్కు మరి లేదు -
ఆపదవచ్చిన వేళ - ఆఱడి బడిన వేళ
పాపపు వేళల - భయపడిన వేళ
ఓపినంత హరినామ మొక్కటే
మాపు దాకా బొరలిన మఱిలేదు తెఱగు

సంకెల బట్టిన వేళ చంపబిలిచిన వేళ
అంకిలిగా నప్పుల వారాగిన వేళ
వెంకటేశు నామమే విడిపించగతిగాక
మంకు బుద్ధి పొరలిన మఱి లేదు తెరగు (5-100)

అని కీర్తించగానే సంకెల వీడి కింద పడిందట. ఆగ్రహించిన రాజు మరల రెండవసారి సంకెలను వేయించాడు. అన్నమయ్య స్వామిని ప్రార్థించాడు. చివరకు బంధవిముక్తుడయ్యాడు. అతని భక్తిని గమనించిన రాజు అన్నమయ్యను క్షమాపణలను వేడుకున్నాడు.

త్యాగయ్యను మహారాజు రెండవ శరభోజి, తన మీద పాడితే, 10 ఎకరాల భూమిని పారితోషికంగా ఇస్తానని తన సేవకులతో కబురుపెట్టాడు. త్యాగయ్య అందుకు నిరాకరించాడు. అంతేకాదు.

"నిధి చాల సుఖమా రాముని
సన్నిధి సేవ సుఖమా నిజము తెల్పుము మనసా!"

అని ప్రశ్నించుకొని రాజు పంపిన కానుకలను స్వీకరించలేదు.

రాజు కోపంతో త్యాగయ్యను బంధించి తీసుకొని రమ్మని సేవకులను పంపాడట. సేవకులు కొంత దూరం వెళ్ళేరో లేదో - శరభోజి రాజుకు భరించరాని కడుపు నొప్పి ప్రారంభమయిందట. రాజు వైద్యులను పిలిపించగా వారు భక్తులను అవమానించి హింసించదలచుకున్నందుకే ఇలా జరిగి ఉండవచ్చు నేమోనని అన్నారట. దైవజ్ఞులు రాజు జాతకం పరిశీలించి భక్తుని పట్ల రాజు చేసిన అపచారం తెలుసుకున్నారు వెంటనే రాజు అరళా అయ్యంగార్ అనే మంత్రిని తిరువయ్యారుకు వెళ్ళి త్యాగయ్యకు జరిగినదంతా విన్నవించి రాజుని క్షమించమని అర్థించగా అందుకు త్యాగయ్య తులసీ తీర్థాన్ని ఒక పాత్రలో పోసి రాజుకు ఇవ్వమని,

శ్రీరామచంద్రుడే వారిని రక్షిస్తాడని చెప్పాడట. రాజు తీర్థం సేవించగా, వారికి వ్యాధి నయం అయిందట. తన తప్పును తెలుసుకున్న రాజు త్యాగయ్య ఇంటికి స్వయంగా వెళ్ళి క్షమించమని కోరుకున్నాడు. పై విధంగా అన్నమయ్య జీవితంలోను త్యాగయ్య జీవితంలోను ఒకే విధమైన సంఘటనలు జరిగాయని చెప్పవచ్చు.

## రచనలు - భావ వ్యక్తీకరణ

అన్నమయ్య భక్తిభావాన్ని శృంగారంగా చెప్పినా వైరాగ్యంగా చెప్పిన అందులోని సారాంశం ఒక్కటే. మానవులు ఐహిక సంబంధములయిన విషయాలతో దుర్గుణాలతో తమ జీవితాలను, జన్మలను వృథా చేసుకోకుండా కలియుగదైవం అయిన శ్రీ వేంకటేశ్వరుని ఆరాధించమని కోరడమే ఆయన కీర్తనల్లోని ప్రధానాంశం.

అవినీతి పరులయిన మానవులు ఎన్నటికీ మోక్షాన్ని పొందలేరు. మహా విష్ణువును నమ్మి చెడిపోయిన వారు ఎక్కడ కనపడరని అంటూ, ఆధ్యాత్మిక కీర్తనల్లో -

"ఏ పురాణములనెంత వెదకినా శ్రీపతిదాసులు

చెడరెన్నడను" అని తెలియజేసాడు. భగవంతుని కోసం జపతపాలు యజ్ఞ యాగాదులు అర్చనలు వ్రతాలు అవసరం లేదని, భక్తులు తమ హృదయాలను హరినామస్మరణకు అంకితం ఇవ్వడమే చాలని అంటారు. హరినామ స్మరణ చేస్తే సర్వబాధలు సమసిపోతాయి. ముక్తి లభిస్తుంది. "అన్ని మంత్రములు యిందే ఆవహించి, వెన్నతో మాకు వచ్చే వెంకటేశుమంత్రంలోకానికి" అని తెలియజేసిన తాత్త్వికుడు అన్నమయ్య.

## త్యాగయ్య:

ఆదర్శ జీవితాన్ని గడిపే మహనీయులకు రామభక్తి కలుగుతుందని భగవద్భక్తి అంటే భగవంతునిపై అవ్యాజప్రేమ కలిగి ఉండడమని తెలియజేస్తారు. ముక్తి సాధనకు భక్తి సులభోపాయం.

భక్తుని హృదయాన్ని సులభంగా భగవంతుని సన్నిధికి చేర్చే వాహిక సంగీతం అంటారు.

"తెలియలేరు రామభక్తి మార్గమును
ఇలనంతట తిరుగుచు కలవరించెదరుగాని,
వేగ లేచి నీట మునిగి భోలిపూడి

వేళ్ళ లెంచి వెలికి శ్లాఘనీయులై
బాగుగా పైక మార్జనలోలురై
రేగాని త్యాగరాజనుత ॥

## మరో కృతిలో

ఏ నోము ఫలమో నీ నామామృత పానము అను సోపానము దొరికెనని ఆనందంతో గానం చేస్తాడు.

## రచనల వర్గీకరణ విషయం

అన్నమయ్య సంకీర్తనలను 6 రకాలుగా వర్గీకరింపవచ్చు. 1. నీతిబోధకాలు, 2. భక్తి బోధకాలు, 3. ఆత్మనివేదన, 4. సాంఘిక దృక్పథం-సామాజిక చైతన్యం, 5. జానపద కవితారీతులు, 6. వర్ణనలు (దశావతార వర్ణనలు).

అదే విధంగా త్యాగయ్య కృతులను కూడా 6 రకాలుగా వర్గీకరించవచ్చు. 1. వేదాంత బోధకాలు, 2. నీతి బోధకాలు, 3. నమస్కృతులు, 4. సంగీత ప్రశంసాత్మకాలు (స్వర రాగసుధా), 5. మానస బోధకాలు - (వినవే ఓ మనసా), 6. విన్నపాలు (నాదు పై బలికేరు)

అన్నమయ్య విశిష్టా ద్వైత సిద్ధాంతాలను చాటుతూ..

"ఊరకే కలుగునా ఉన్నతంపు మోక్షం
శ్రీ రమణు కృప చేత జేరు మోక్షం" అని అన్నాడు.

త్యాగయ్య

"రామభక్తి సామ్రాజ్యమే మానవుల కబ్బెనో
ఆ మానవుల సందర్శన మత్యంతబ్రహ్మానందమే
ఊరకయే కల్గునా రాముని భక్తి
సారెకును సంసారమున జొచ్చి
సారమని యెంచు వారి మనసున"

ఈ విధంగా భక్తితత్త్వంలో ఆధ్యాత్మిక రచనల్లో మోక్షసాధనలో వీరిరువురి గమ్యం ఒక్కటే -

భక్తి తత్త్వంలో ఎవరికి వారే సాటి.

త్యాగరాజు "ఈమెను కలిగినందుకు సీతారామనామమే పల్కవలె"నని అంటే

అన్నమయ్య శ్రీనివాసునికై తపించి ఎన్నో సంకీర్తనలు రాసి, పద కవితా పితామహుడనే బిరుదును అందుకున్నాడు.

శ్రీ రామచంద్రమూర్తిని ఆరాధించి ముక్తిపొందిన పరమభాగవతోత్తముడుగా నాద బ్రహ్మోపాసకుడుగా కీర్తింపబడిన ధాతుకల్పనాదక్షుడు త్యాగయ్య. వీరిరువురి రచనలు ఆంధ్రులకు వెలకట్టలేని ఆణిముత్యాలు.

# సారంగపాణి పదములు సంగీతాంశములు

కొమాండూరి శేషాద్రి

**భా**రతీయతత్త్వం సత్యం-శివం-సుందరం అన్నత్రిపుటితో నిర్మితమైనది - సత్యం సాహిత్యం, శివం సంగీతం, సుందరం నృత్యానికి ప్రతీక అంటారు - ఈ మూడు మన జాతిలో జీర్ణించుకొనిపోయి పరతత్త్వానికి మార్గ నిర్దేశనం చేస్తూన్నవి- 'పద' రచన ఈ మూడింటిని 'ఏకత్వంగా' శాసింప చేసే ప్రక్రియ - కన్నడ దాసరపదాలు, అన్నమయ్య సంకీర్తనలు పదాలుగానే వ్యవహరించబడినవి - తరువాత కాలంలో ప్రభవించిన క్షేత్రజ్ఞుని చేత 'పదము'నకు ప్రత్యేక అభివ్యక్తి - ఆచరణాను సంధానం సమకూరింది. 'పదము'లోన శిష్ట వ్యవహార-జానపద-భాష-శైలి భావము ప్రతి బింబించి సర్వజనామోదమందింది. క్షేత్రజ్ఞుని తర్వాత 'పద' రచయితగా నిలచినవాడు 'సారంగపాణి' - ఈ మహనీయుడు కూవన సామయ్య - గోవింద సామయ్య అనే భరతశాస్త్ర కోవిదులు-అన్నదమ్ములు- వారి సాంగత్యంతో అభినయ సంగీత కౌశలము పొంది 'రచనాకారుని'గా భాసించి 'పద' సాహిత్యము "శృంగార సంబంధియే" అనే ముద్రను తొలగించి అనేక వైరాగ్య-భక్తి పరమైన పదాలు రచించి సంఘ ఉద్ధరణ చేసి మార్గదర్శకుడైనాడు. ఈయన శహాజీ మహారాజా స్థానములో 'విద్యాధికారి'గా యుండి తదనంతరము పదవి వదలి - దీనుడుగా కష్టముల కడలిలో లయించినాడు -

తనరచనలను నాల్గు విధాలుగా విభజించి శృంగార పదములు (75) దేశీయపదములు (66) జాతీయ పదములు (16) వైరాగ్య-నీతియుక్తములు (43)గా మొత్తము రెండు వందల పదములను వెలయించి 42 రాగములలో- నిబద్ధించి 7 తాళములకు పరిమితం చేసాడు. ఈ పదములను తొలుత వారి మనుమడు గరిమెళ్ళ వేంకటసుబ్బయ్య 1867లో విద్యా విలాసముద్రాక్షరశాలలో ప్రకటించగా తరువాత 'నేదునూరి గంగాధరం' పదాలను 'పార్వతీశ్వరశాస్త్రి

పీఠికతో - 1963లో ప్రకటించారు- శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు తన 'ఆంధ్ర వాగ్గేయకారులు' గ్రంథంలో మరికొన్ని వివరాలను సేకరించారు- ఇవన్నీ లక్షణ రూపాలయితే, గానరూపంగా "కర్ణపరంపర'తోనే నిలచినవి-పోయినవి పోగా అతితక్కువ సంఖ్యలో నేడు సంగీత నృత్య లోకము నందు భాసిస్తూ వున్నాయి- పరిశోధకులు, విద్యాంసులూ లుప్తమైన- వీటికి 'సంగీతమెట్టు' కల్పించి ప్రచారము చేయవలసియున్నది- అన్నమాచార్యునికి, క్షేత్రజ్ఞుని తరువాత వాడు- త్యాగబ్రహ్మకు ఒకింత పూర్వుడూ ఈ పదకర్త- నా చిన్నతనములో మా తాత గారు కుప్పనయ్యం గారు, నా తండ్రి కొమాండూరి అనంతాచార్యులు- పిన తండ్రి తిరుమలాచార్యులు - పండుగ సందర్భాలలో కలసి నప్పుడు భావుకంగా 'సారంగపాణి' పదాలను పాడడం, ఆసక్తి చేత నేను స్వరలిపిలో బంధించడం వల్ల నా దగ్గఱ సుమారు 30 పదాలు పూర్వరూపాన్ని నిలుపుకొన్నాయి. వీటిని కళారాధకుల సాహాయ్యంతో వెలుగునకు అచ్చులోనికి తేవాలి- క్షేత్రజ్ఞపదాలే అపురూపములు. కనీసం విద్వద్గోష్ఠులలోనూ కనుమరుగైన తరుణములో అంతగా ప్రచారము నోచుకొనని సారంగపాణి పదాలు పాడేవారు కనబడటంలేదు. అవశ్యంగా వాటిని వెలుగుకు తెచ్చి వాగ్గేయకారుని భావుకత భాష-శైలి-రచనా వైశిష్ట్యం తెలియచెప్పాలి- ఈ విషయంలో శ్రీపాద పినాకపాణి గారు సారంగపాణి సుమారు రెండు పదాలను తమ 'సంగీత సౌరభము'లో ప్రకటించారు- చాల సంతసించ తగినది-

**రాగ-తాళములు**

ఇక సారంగపాణి వాడిన 42 రాగాలలో పంతువరాళిలో అధికంగా పదాలు అమరినాయి- తరువాత భైరవి, గౌళీపంతు-మోహన-ఆనంద భైరవి - సావేరి - ధన్యాసి ఆక్రమించాయి - 'అపరూప' అనేరాగములో రెండు పదాలు "వలచితినీపై, అట్లాగే కావలె" అందంగా అమరినవి. అయితే రాగ రూపము నేటికి అగోచరమే! అసావేరి - అఠాణా, ఆనందభైరవి - ఆహిరి - ఆరభి - కన్నడ - కల్యాణి - కర్నాటక సారంగ - కాపి - కాంభోజి - గేళిపంతు - గౌరి - ఘంటాతోడి, ధన్యాసి - ద్విజావన్తి - నవరోజు - నాటకురంజి - నీలాంబరి - ఫరజు - పంతువరాళి - పున్నాగవరాళి - బిలహరి - బేగడ - భైరవి - మధ్యమావతి - ముఖారి - మోహన - యదుకుల కాంభోజి - రేగుప్తి - శంకరాభారణము - సావేరి - సురటి - సౌరాష్ట్ర - హుసేని - శ్రీ - మున్నగునవి. ఆదితాళమునందు హెచ్చు రచనలు చేసారు. మొత్తము 200 పదాలు వ్రాసినాడు.

## రచనాసాదృశ్యములు

పంతువరాళిలో రచన రామదాసుని రచనను తలపిస్తున్నది. ఎన్నగాను రామభజన - కన్న మిక్కిలున్నదా!

సారంగపాణి -

హరినామస్మరణ సేయకుంటే - అవతలగతియేమి!
వెరవుదెలిసి సత్సంగతి వదలక
వేణుగోపాలుడైన శ్రీ - నర॥

ప్రబోధాత్మకపదము - రమ్యంగా రూపము - రాగావిష్కరణను కల్ల చేస్తున్నది. సారంగపాణి విస్తారంగా పంతువరాళి - గౌళీ పంతురాగాలను వాడినాడు - కల్యాణి - పంతువరాళి - సారంగలు ప్రతి మధ్యమ రాగాలు.

చక్కనిలయకు ఒదిగే అక్షరబంధం- సొంపైనయతిప్రాసల వినియోగములయకు కొట్ట వచ్చినట్లు అక్షరశయ్య - సారంగపాణి రచనలకు ఊతనిచ్చాయి.

ఉదాహరణగా శంకరాభరణములో

"శ్రీరమారమణీ మనోహరా" అనే సాహిత్యానికి శ్రీ$_3$,ర$_1$,మా$_3$ రమణీ మనోహరా గా వినియోగించిన అక్షర బంధము ఝంప తాళానికి - లయ బిగువు కలిగిన రచనకు సౌష్టవాన్నందించింది-

పోతనవలె అలంకార వినియోగము ఈ క్రింది పదములో చూడవచ్చు. కొలిచితే- వేణుగోపాలదేవుని కొలువు కొలువవలెను.

అల్లాగే తలచితే- పిలచితే - నడచితే - విడిచితే - చూచితే - కాచితే తలచితే - పిలచితే - పాడితే - ఆడితేయిలా చక్కని క్రియా పదాలతో ప్రతి చరణా రంభములోను లయ ప్రౌఢిమతో ఒదిగినాయి-.

శ్రీ రామదాసులు

"శ్రీ రామనామం మరువాం మరువాం
సిద్ధము యమునకు వెరువాం వెరువాం" అని అంటే

సారంగపాణి

వేణుగోపాలుని విడువము - మరి

వేరే ఒక్కరి పేరు - నుడువము
వీణుగా కాశికి నడువము - ఖలుల
విత్తము కొంగున ముడువము- అంటూ తీర్మానిస్తాడు

ఇక స్వరబంధాలకు- పదభావాన్ని- అర్థాన్ని తెలిసి కూర్చిన ఘనత. యిదొ యీలాగున హుసేని పదము - ఆదితాళమున అమరింది.

సనిసా రీరీ రీగస రిగమ । పా;; నీ,ద । పామగ మపామ గరిరీ గప ॥
స త్య మింతైనా లే .. దా చెలి కా .. డా .. ఈ ..
రిగమా మా పరు ఏ నిదని సా; । పనిద పమగమప । మపామ గా,రి రీగమరీగస ॥
సతి నుంచినా...సి....గ్గే పోయే........గా.....ఆ.....ణి.

అనేక జానపదులు బిచ్చగాండ్రు నా చిన్న తనంలో పాడే పాటలు కొన్ని గుర్తుంచుకొనతగినవి.

కడుపా । నీవింత ఘనమైతివా! యే
కడగురుతు లేదాయే! కలికాలమునందు

చక్కని చాపు తాళపు అమరిక - పంతువరాళిలో కూర్చబడినది.

మొత్తానికి "భక్తితో పెట్టినయన్నము
పట్టెడైనను చాలు - చెవులకు
రక్తిగా హితవైన పాట
పల్లవి విన్నాచాలు! కృష్ణా" అన్నపదములో సారంగపాణికి గల భక్తి ఔన్నత్యం - రాగరంజితాభినయ గేయముపై గల మక్కువ అత్యభియుక్తము - అనుస్మరణీయము - అజరామరము. సారంగపాణి పదాలను నెమరు వేసుకొని కర్మ రాహిత్యాన్ని పొందడము ప్రస్తుత కర్తవ్యము.

# అన్నమయ్య-సారంగపాణిః తులనాత్మక పరిశీలన

ఏ.ఎస్. మూర్తి

యుగయుగాలుగా తరతరాలుగా తెలుగువారుచేసుకున్న పుణ్యాఫలం వారి మహత్తర సంగీత సాహిత్యాలలో ప్రతిఫలించింది. ప్రపంచంలోని ఏ మహనీయ భాషకూ తీసిపోని ఉత్తమ సారస్వతాన్నీ, ఆ చంద్రతారార్కం నిలువగల సంగీతాన్నీ మన తెలుగుజాతి వారసత్వంగా పొంది, ఆ మధుర రసాస్వాదనలో ఓలలాడింది తెలుగు వాణి. గాసట బీసటగా నున్న తెలుగు సాహితికి ఒక కమనీయ రూపాన్నిచ్చి ఆదికవియై, వాగనుశాసనుడై నన్నయ్య భారత రచనతో మహోజ్వల సాహిత్య ప్రస్థానానికి బీజం వేస్తే, తొలి వాగ్గేయకారుడై, పదకవితా పితామహుడై, ద్రవిడాగమ సార్వభౌముడై, పంచాగమ చక్రవర్తి అయి ఆంధ్రవేదాన్ని సృజించిన మహనీయుడు అన్నమాచార్యుడు. చిందర వందరగా సాగుతున్న భక్తి పాటల భావావేశాన్నీ, సామవేద సారమైన సుస్వర సంగీత రహస్యాలనూ సంకీర్తనలుగాను, సంకీర్తనా లక్షణాలు లేని దరువులు, ఏలపాటలు, లాలిపాటలు, జోలపాటలు వంటి జనపదాల జానపదాలనూ సంఘటితపరిచి పల్లవి, చరణములు, యతి ప్రాసలు వంటి సంగీత లక్షణములతో వాగ్గేయ సంహితనూ, సంస్కృతినీ సృష్టిచేసి తన 32 వేల కీర్తనలతో తెలుగు జాతికి సంకీర్తనా భిక్షను ప్రసాదించిన అపర సంగీత బ్రహ్మ ఆయన. శ్రుతి, స్మృతి, శాస్త్ర పురాణాలను సంగీత, సాహిత్యాలతో రమ్యంగా రంగరించి కలబోసి, వడబోసి తెలుగు జాతికి సంకీర్తనా క్షీరసాగరాన్ని అందించిన అమృతమూర్తి అన్నమయ్య. ఆ సంకీర్తనా క్షీరసాగరంలో భక్తి, ప్రపత్తి, సంగీతం, సాహిత్యం, సమాజ శ్రేయస్సు, సాంఘిక మర్యాదలు, సామాజిక స్పృహ, వ్యక్తి వికాసమార్గంవంటి మానవజీవితానికి అమూల్యమైన, అత్యంత ప్రయోజనకరమైన సందేశాలను రత్నాలవంటి కీర్తనల రూపంలో అందించిన కారణజన్ముడు, వేంకటేశ్వర స్వామి మానస పుత్రుడు శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుడు.

మాటల కందే సాహిత్యాన్నీ, మాటలకందని సంగీతాన్నీ అలవోకగా, అవలీలగా, శృంగార, భక్తి వైరాగ్య భావాలతో జోడించి ఆయన అందించిన వేంకటేశ్వర ముద్రాంకిత కీర్తనలు మానవాళికి పరమపద సోపాన మార్గాన్నే కాక, పరమోన్నత జీవిత మార్గాన్ని కూడ ఆవిష్కరించి దివ్యప్రబోధం గావించాయి. అతని రచనలో పునీతమైన ఆధ్యాత్మికత, అభ్యుదయ భావుకత మానవాళికి ఇహపర సాధనా మార్గాలుగా స్ఫూర్తినిచ్చాయి.

అన్నమాచార్యుల వ్యక్తిత్వం అత్యంత మహత్తరమైనది. వేద, పౌరాణిక, బౌద్ధ, జైనమతాల స్పర్శలతో పలుపొంతలు తొక్కిన భారతీయ ఆధ్యాత్మిక వాహిని శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్యుల వేదాంత బోధనలతో పునీతమై సమాజానికి ఒక నిర్దిష్ట ఆధ్యాత్మిక మార్గాన్ని బోధించింది. అయినా ఆ వేదాంతం సామాన్య ప్రజావళికి అవగతంగాక ఉన్నత మేధావి వర్గాలకు మాత్రమే పరిమితం అయింది. అటువంటి తరుణంలో అనేక తాత్త్విక ధోరణులకు అతీతంగా వీరశైవం భక్తి ఉద్యమానికి ఊపు నిచ్చి వీరవిహారం చేసింది. వారి ద్విపద కావ్యాలు ప్రజలు పాడుకునే రీతిలో సరళ సాహిత్య విధానాలతో ప్రజావళిలో చొరబడి విస్తృతంగా వ్యాప్తిచెందాయి.

అయినా అవి విద్యాగంధం, సంగీతాసక్తి పెరుగుతున్న తరుణంలో అన్ని వర్గాలను ఆకర్షించి అందరినీ తృప్తి పరచలేకపోయాయి. అప్పుడు పవిత్ర భక్తి ఉద్యమానికి మరింత పుష్టినిచ్చి విశ్వజనీనమూ, సార్వకాలీనమూ అయిన ఉదాత్త రచనలతో పండిత, పామర సాహిత్యాభిలాషులను మెప్పించే సాహిత్యం, సంగీతం కావలసి వచ్చాయి. సాహిత్యాన్నీ, సంగీతాన్నీ మరింత సుసంపన్నం చేయవలసిన అవసరం ఏర్పడింది. ఛందోభూయిష్ఠమైన మహాకవుల కావ్యాలకన్న, సరళము జాతీయము అయిన సంకీర్తనలు అందుకు గొప్ప వాహికలుగా ఉపయోగపడే మహత్తర సంకీర్తనా ఉద్యమానికి అన్నమయ్య పద రచన నాంది పలికింది. ఒక దివ్యమైన లక్ష్యంతో, స్పష్టమైన భగవత్ ప్రేరణతో జన్మించిన అన్నమయ్య సకల వేదాల సారాన్ని ఆపోసన పట్టి, వాటిని సంకీర్తనా శిల్పాలుగా మలచి సర్వకాలాలలోను నిలువగల ఆ సంకీర్తనా భాండారాన్ని తెలుగుజాతికి ఎనలేని సంపదగా వాక్ సంపదగా, గేయ సంపదగా, వాగ్గేయ సంపదగా, సంగీత సంపదగా, సంకీర్తనా సంపదగా అందించి చరితార్థుడయ్యాడు.

తన వేలాది శృంగార, ఆధ్యాత్మిక కీర్తనలలో అన్నమయ్య స్పృశించని

వేదాంత ప్రబోధంగాని, భక్తి భావంగాని, జ్ఞాన యోగంగాని, సామాజిక సందేశంగాని లేదన్నది నగ్నసత్యం. ఎంత ఉదాత్తమైన భావంతో, సమగ్ర భాషాపటిమతో సంస్కృతాంధ్ర సంకీర్తనలు రచించాడో అంత సరళమైన, సరసమైన భావాలతో, భాషతో, అనేక ఇతర సంకీర్తనలను కూడా రచించాడు.

అన్నమయ్య సంకీర్తనలలో భక్తియోగం అత్యంత ప్రధానమైనది. భగవానుని విశ్వమయతను -

ఏవం శ్రుతిమతం ఇదమేవ తద్భావయితు మతః పరం నాస్తి
వినరో భాగ్యము విష్ణుకథ విమలంబైనది విష్ణుకథ
నారాయణతే నమో నమో, భవ నారద సన్నుత నమో నమో
చాలదా హరినామ సౌఖ్యామృతం తమకు
భావములోన - బాహ్యమునందును, గోవింద - గోవిందయని
కొలువవో మనసా
కొండలలో నెలకొన్న కోనేటి రాయడువీడు

వంటి కీర్తనలతో విష్ణుమహిమను, విశ్వమయతను ఘంటాపథంగా చాటి చెప్పాడు. భక్తికి, ప్రపత్తికి, శరణాగతికి ఉన్న శక్తిని ఆవిష్కరించాడు. ఆత్మతత్త్వాన్ని స్పష్టీకరించి, గొప్ప వేదాంతాన్ని ప్రబోధించాడు.

ఆత్మ తత్త్వాన్ని ఆవిష్కరిస్తూ-

ఎవరెవ్వరి వాడో ఈ జీవుడు చూడ ఎవ్వరికి ఏమౌనొ ఈ జీవుడు,
ఎందరికి కొడుకుగాడీజీవుడు వెనక నెందరికి తోబుట్ట డీజీవుడు

దేహినిత్యుడు - దేహము లనిత్యాలు
ఈహల నామనసా - యిది మరవకుమీ

అంతేకాక

పుట్టుభోగులముమేము భువి హరిదాసులము
నట్ట నడిమి దొరలు నాకియ్యవలెనా ॥

నానాటి బదుకు - నాటకము, కానక కన్నది - కైవల్యము

ఏమిగలదిందు ఎంతకాలంబైన
పామరపు భోగము ఆపదవంటిది అరయ

వంటి కీర్తనలతో జ్ఞానయోగాన్ని ప్రబోధించి ప్రజావళికి దైవిక మార్గాన్ని సుగమం చేసాడు. అన్నిటికీ మించి అన్నమాచార్యులు తన ఆత్మ సంతృప్తికోసం ఎంతటి సంకీర్తనా సౌధాన్ని నిర్మించాడో, అంతటి ఆవేశంతోనూ అంత విస్తృతంగానూ సామాజిక చైతన్యం కోసం, వైదిక ధర్మ ప్రతిష్ఠాపన కోసం తన సంకీర్తనలతో కృషిచేశాడు.

మహినుద్యోగికావలె మానవుడు సహజిగా నుండి వాడేమి సాధించలేడు.
త్రికరణ శుద్ధిగా చేసిన పనులకు దేవుడు మెచ్చు, ప్రజలును మెచ్చు
వంటి వ్యక్తి వికాస సందేశాన్ని అన్న మాచార్యులు బలంగా చాటి చెప్పాడు.

అన్నమాచార్యుల సంకీర్తనోద్యమం తెలుగు నేలలొ విస్తృతంగా పెరిగి ఎందరో మహనీయులకు స్ఫూర్తినిచ్చింది. మరెందరో మహనీయులను వాగ్గేయ కారులుగా మలచి పద కవితా మార్గానికి వూపిరి పోసింది. అన్నమయ్య తరువాత వచ్చిన క్షేత్రయ్య (1590-1675), భద్రాచల రామదాసు (1620 - 1680), సారంగపాణి (1680-1750), త్యాగరాజు (1767-1847) వంటి ప్రముఖ వాగ్గేయ కారులు తమ కమనీయ వాగ్గేయధారతో ప్రజావళికి సంగీత భక్తి రసామృతాన్ని పంచి ఇచ్చారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి అద్భుత కృషి ఫలితంగా అన్నమయ్య సంకీర్తనా భాండారం వెలుగులోనికి వచ్చి అన్నమయ్య వేలాది కీర్తనలు, దేశమంతటా విస్తృతంగా ప్రచారంలోకి వచ్చినా అంతకు ముందుకూడా ఆయన అనేక కీర్తనలు తెలుగు నాట ప్రచారంలో వున్నవనడానికి సందేహం లేదు. కవి పేరు తెలియకుండా అనేక మంది యిండ్లలో పాడుకునే

జో అచ్యుతానంద జోజో ముకుంద
లాలి పరమానంద రామ గోవింద,

చందమామరావో జాబిల్లి రావో
అల్లోనేరేళ్ళో - అల్లో నేరేళ్ళో
వంటి పాటలే దీనికి నిదర్శనం.

సామాన్య ప్రజలకే అలానాలుక మీద వుండే పాటలు ఆనాటి, తరువాతి కవులకు, గాయకులకు తెలియకుండా వుండడం అసంభవం. కనుకనే ఎందరో తరువాతి వాగ్గేయ కారులపై అన్నమయ్య కీర్తనల ప్రభావం తప్పనిసరి. అది అంతా సమగ్రంగా వివరించడం కష్టసాధ్యం. అయినా సాధారణంగా అన్నమయ్య భక్తి సంకీర్తనా సంపదకు వారసులుగా భద్రాచల రామదాసు, త్యాగయ్యలను

భావించవలసి వస్తే, ఆయన శృంగార సంకీర్తనలకు వారసులుగా మువ్వ గోపాల పదకర్త క్షేత్రయ్యను, వేణుగోపాల ముద్రాంకిత పదకర్త సారంగపాణిని పేర్కొనడం పరిపాటి. ఈ సదస్సు ఆ నలుగురు వాగ్గేయకారులపై అన్నమయ్య ప్రభావం గురించి రూపొందించడం గమనార్హం. అయినా ఈ నలుగురిలో అన్నమయ్యకు ఎవరూ పరంపరాగత అనుయాయులు కారు. నిజానికి ఈ నలుగురివీ నాలుగు మార్గాలు. ఒక వాగ్గేయకారునికీ మరొక వాగ్గేయకారునికీ సమగ్రమైన పోలిక చూపించడం కష్టం. ఎందుచేతనంటే అన్యమయ్య సంకీర్తనలు అర్థ, భావ ప్రధానములైనవి. భద్రాచల రామదాసు సంకీర్తనలు కూడ అర్థ, భావ ప్రధానములైనవి. అయితే రామదాసు కీర్తనలకు ఆర్తి, ఆర్ద్రత జీవం. సామాజిక స్పృహకు అవకాశంలేని ఆత్మనివేదనం అది. సంగీతంకన్న భక్తి భావానికి ప్రాధాన్యతనిచ్చిన భజన సంప్రదాయం రామదాసుది. అది భక్తి భావుకత. (అంతారామమయం వంటి కీర్తనలలోవలె). అటు త్యాగరాజు వైపు వస్తే సంగీత విద్వన్నుల పెన్నిధి అయిన త్యాగరాజుల వారి కృతులు నాద ప్రధానమైనవి. వాటికీ భక్తి ఆలంబనే. అయినా అర్థ, భావాలతోపాటు సప్తస్వరాలకు సమాన ప్రాధాన్యతనిచ్చిన కృతులు అవి. తమిళుల త్యాగరాజ ఆరాధన నాదప్రధానమైనదే. వారి దృష్టిలో సంగీతం ఓ దైవమనే చిలుక. సాహిత్యం దానిని బంధించే పంజరం. ఇక క్షేత్రయ్య పదాలు భక్తి సమ్మిళిత శృంగారపదాలు. నాట్యానికి అనువైన అభినయ శిల్పాలు, విలాసాభినయ మధుర భక్తి పదాలు. నవవిధ నాయికల మనోగతాలు, విరహోత్కంఠితల భావ ప్రేరణలు, శృంగారరస నాయికా భావాలు ఇందులో ప్రధానమైనవి. వీటిలో కూడ సామాజిక సృహకన్న భావం, కళాభిజ్ఞత, అభినయ శిల్పం ప్రధానం.

సారంగపాణి పదాలను కూడ క్షేత్రయ్య పదాలతో పేర్కొనడం పరిపాటి. క్షేత్రయ్యకు ఉన్నటువంటి సంగీత సాహిత్య భాషా పాటవం, భావ ప్రదర్శన, అనుభవసారం సారంగపాణిలో కూడ ఉన్నవి. నిజానికి వేణుగోపాల భక్తి, అనుభూతి, సామాజిక సందేశం క్షేత్రయ్యలోనే తక్కువ. క్షేత్రయ్య మువ్వగోపాలుడు శృంగారరస స్వరూపుడయితే, సారంగపాణి వేణుగోపాలుడు శృంగారం తోపాటు కరుణా రసాన్ని కలబోసుకున్న అమృతమూర్తి. క్షేత్రయ్యలో అధ్యాత్మికత అంతర్లీనం. సారంగపాణిలో అన్నమయ్యలో వలె భక్తి, ఆధ్యాత్మిక భావాలు సుస్పష్టం, సుమనోహరం. అయినా అన్నమయ్య పదాలకు, క్షేత్రయ్య పదాలకు ఉన్న ప్రాచుర్యం సారంగపాణి పదాలకు రాలేదు. దానికి కారణాలు మూడు 1) త్వరగా స్వరాలంకరణ కాకపోవడం 2) రాజాశ్రయం కనుమరుగు కావడం 3) శిష్య పరంపరగా అనుసృజనం లేకపోవడం. అయినా అన్నమయ్య పదాలలోని

మేడలెక్కి నిన్నుజూచి కూడేననే ఆశతోడ
వాడుదేరి ఉస్సురందురా వేంకటేశ ఏడనుంటి విందాకానురా

వంటి అనేక శృంగార పదాలవలె సారంగపాణి శృంగార పదాలు

వట్టి చూపులతోనె వలపు పుట్టించ నీవలె ఎవరీజగతిలేరె
సంధ్యవేళ నీవు మాసందు వీధిని వెడలి కుందరదనలతో గుసగుసలా?
అన్న పదాలు శృంగార భావాలను ప్రకటిస్తే

అన్నమయ్య వేంకటేశుని పరంగా వ్రాసిన

విష్ణువొక్కడే విశ్వాత్మకుండు-వైష్ణవంబే సర్వంబును
బ్రహ్మకడిగిన పాదము బ్రహ్మము తానెఅనే పాదము

వంటి అనేక భక్తి సంకీర్తనలు సారంగపాణిలొ కూడ కనిపిస్తాయి.

కనుకనే అన్నమయ్య కీర్తనలకు కొంచెం దగ్గర కాగలిగిన పదాలు సారంగపాణి పదాలలో ఉన్నాయి. అన్నమయ్య పదాలు సంకీర్తనా క్షీరసాగరమైతే సారంగపాణి పదాలు ఆ సముద్రంతో పోల్చగలిగిన సెలయేరులు, అన్నమయ్య వలెనే సారంగపాణి శృంగార, ఆధ్యాత్మిక కీర్తనలను రెండింటినీ రచించాడు. అయినా అన్నమయ్య, క్షేత్రయ్యల కంటె సారంగపాణి తన రచనలలో స్వతంత్రత కనబరిచిన కవితా శిల్పి. అన్నమయ్య వలెనే సారంగపాణి సంఘ దురాచారాలను నిక్కచ్చిగా ఖండించాడు. సమాజంలో సద్బుద్ధి పెరగాలనీ, సత్ ప్రవర్తన వెల్లి విరియాలనీ, మానవుడు సత్ సాంగత్యాన్ని కాంక్షించాలనీ ప్రబోధించాడు. సమాజ శ్రేయస్సును, మానవ చైతన్యాన్నీ ఆర్తితో ఆకాక్షించి ఆ ఆవేదనను, ఆ ఆరాటాన్ని తన వైరాగ్య పదాలలో చొప్పించాడు.

ఇక్కడ ఒక మాట చెప్పాలి. అన్నమయ్య సంకీర్తనలు సారంగపాణిని ఎలా ప్రభావితం చేసాయో చూసేముందు సారంగపాణి నాటి సామాజిక పరిస్థితులను ఒక్కింత గమనించడం అవసరం. ఆనాడు దక్షిణ భారతంలో విజయనగర సామ్రాజ్యం గతించి తంజావూరు నాయక రాజుల ఏలుబడి కొనసాగింది. నాటి కార్వేటి నగర ప్రభువైన మాకరాజు వేంకట పెరుమాళ్ళ రాజు అనే సాల్వ వంశీయుని ఏలుబడిలో ఆస్థాన విద్యాధికారిగా నియమితుడయ్యాడు సారంగపాణి. అయితే రెడ్డి రాజుల కొలువులోని శ్రీనాధునివలె ఉభయ భాషా ప్రావీణ్యం, కవిత్వ విశారదత్వం, పలు శాస్త్ర విమర్శనా చాతుర్యం, శాసన వివరణ కార్వేటి పభువుల ఆస్థానంలో సరిపోవు. అక్కడి విద్యాధికారి సంగీత, నాట్యాది కళలలో చాతుర్యం

కలిగి ఉండాలి. వాగ్గేయ, సాహిత్యాలలో ప్రమాణిక జ్ఞానం కలిగిఉండాలి. కనుకనే వాగ్గేయకారుడు వైదిక విద్వాంసుడు, నాట్యాచార్యుడు, కవి, పండితుడు అయిన సారంగపాణి కార్వేటిరాజాస్థానంలొ విద్యాధికారి అయి అందరి ప్రశంసలు అందుకున్నాడు. భరత శాస్త్ర లక్షణానికి ఉదాహృతులుగా పదాలు రచించాడు. కాని శ్రీనాధుని వలెనే చివరి రోజులలొ రాజాశ్రయం కోల్పోయి దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాడు. అయితే ఆ పరిస్థితులు శ్రీనాధుని చేత జానపదుల వీరగాధలను రచింపచేస్తే, సారంగపాణి చేత భక్తి ప్రబోధ, సామాజిక చైతన్య కీర్తనలను రచింపజేసాయి. జీవన విధాన పద్ధతులలోను జీవిత చరిత్రలలోనూ కాకపోయినా తన చివరి దశలోనైనా ఆధ్యాత్మిక, సామాజిక కీర్తనలు రచించడంలో సారంగపాణి అన్నమయ్యను అనుసరించాడు. ఇది సారంగపాణి కీర్తనలపై అన్నమయ్య కీర్తనల స్పష్టమైన ప్రభావం.

సారంగ పాణి కీర్తనలలొ కూడ అన్నమయ్య కీర్తనలవలె సామెతలు, పలుకుబడులు అత్యంత విస్తృతంగా వాడబడ్డాయి. అన్నమయ్య-

"యద్భావం తద్భవతి" - "సూత్రే మణిగణాయివ" "ఆడేబొమ్మలు వీరు ఆడించే సూత్రం నీవు", "విత్తుమీది పొల్లు వంటిది దేహం, వత్తిలోపలి నూనె వంటిది జీవితం" వంటి ఎన్నో జాతీయాలను అన్నమయ్య వాడితె సారంగపాణి "సూదిలొ దారం", "వినయం ధూర్త లక్షణం", "పెరటి చెట్టు మందుకుగైకోరు" వంటి సామెతలు వాడాడు.

అన్నమయ్య వలెనే తన సంకీర్తనకు ఒక వస్తువును స్వీకరిస్తే ఆ వస్తువు సమగ్ర విశేషాలను ఆ కీర్తనలోనే చొప్పించగల శక్తి ఈ ఇద్దరిలో కనిపించే ఒక చక్కని కవితా శక్తి. అన్నమయ్య-

ఇన్ని రాసుల ఉనికి ఇంటి చెలువపురాశి

అన్న కీర్తనలో మేషం, వృషభం, కర్కాటకం, కన్య, తుల వంటి అన్ని రాసుల పేర్లను చక్కగా ఇమిడ్చి అలిమేలు మంగను వర్ణించినట్లూ, అలాగే ముద్దుగారే యశోద కీర్తనలొ శ్రీకృష్ణునికి అన్వయించి మరకత, మాణిక్య, వజ్ర, వైఢూర్య, గోమేధిక, పుష్యరాగ, నీల, ప్రవాళ, ముత్యాలైన నవ రత్నాలను పేర్కొన్నట్లు సారంగపాణి తన అనేక కీర్తనలలొ తీసుకొన్న ప్రధాన వస్తువుకు పుష్టికలిగించే రీతిలో దానికి సంబంధించిన అన్ని అనుబంధ విశేషాలను పేర్కొన్నాడు. ఒక కీర్తనలొ ఔషధాలన్నింటినీ పేర్కొన్నాడు.

వరకన్యా తిలకమె వనిత పేరు అన్న కీర్తనలో చంద్రోదయం, ద్రాక్షరసం, మన్మథ భాణం, ఆనంద రసం, పేర్కొన్నాడు.

వరకన్యా తిలకమే వనిత పేరు
పరికించవేణుగోపాల నాసామి
పొలతినెమ్మోము సంపూర్ణ **చంద్రోదయము**
అలకాళిరుచి **వినోదాంజనంబు**
దాని మృదుమధురోక్తి ద్రాక్షాదిరస మెంచ
మానవతి చూపు **మన్మథబాణ** సమము
చెలియ దానిగుణము **చింతామణి** స్ఫూర్తి
అలరించు పాట శ్రుతి **కానందరసము**

అన్నమయ్య వేంకటేశ్వరుని నమ్మి రాజాశ్రయాన్నీ, రాజాజ్ఞనూ నిర్జించిన ప్రసిద్ధుడైన భక్తియోగి.

ఆకటి వేళల అలపైన వేళల
తేకువ హరినామమే దిక్కు మరి లేదు.
సంకెల పెట్టిన వేళ చంప బిలిచిన వేళ
అంకిలిగా అప్పులవారాగిన వేళ
వేంకటేశునామమే విడిపించ గతిగాక
ఎవ్వరు కర్తలు కాదు ఇందిరానాధుడే కర్త

వంటి కీర్తనల ద్వారా భగవంతుని విశ్వమయతను చాటిచెప్పాడు అన్యమయ్య. సారంగ పాణికూడ అదే రీతిలొ విష్ణుని విశ్వాధికారాన్ని చాటి చెప్పాడు. అయితే అన్నమయ్య అనుభూతితో చాటిచెపితే, రాజాశ్రయం కోల్పోయి బాధలను అనుభవించి నప్పుడు దేవుడు తప్ప మరెవరు లేరన్న దిక్కుతోచని అనుభవంతో చెప్పాడు సారంగపాణి. కారణాలు వేరే అయినా ఈ రెండిటి ప్రబోధంలొ సారూప్యం సుస్పష్టం. అన్నమయ్య, "చాలదా హరినామ సౌఖ్యామృతం తమకు" అని అంటే సారంగపాణి "హరి నామస్మరణ చేయకుంటె అవతల గతియేమి" అని చెప్పాడు.

హరినామస్మరణ చేయకుంటె అవతల గతియేమి
అన్నదమ్ములెడబాయకమునుపే
ఆలు నిష్ఠురోక్తులు ఆడకమునుపే
కన్న కొడుకు దండించకముందే

కాయము వ్యాధుల చిముకక మునుపే
క్రనూనుకుని తిరగక మునుపే
కంఠధ్వని తగ్గిపోక మునుపే
అ్రు ముంగటికి వంగక మునుపే
హరినామ స్మరణ చేయకుంటే అవతల గతియేమి

అన్నమయ్యా, సారంగపాణి ఇద్దరూ విశిష్టాద్వైతులే. అయినా అన్నమయ్యా సంకీర్తనా కదంబంలో అద్వైత, ద్వైత భావాలు గల కీర్తనా పుష్పాలు కూడా ఉన్నాయి. సారంగపాణిది పూర్తిగా విశిష్టాద్వైత ధోరణి.

అన్నమయ్యా సారంగపాణిలు ఇద్దరిలోను భక్తి, శృంగార, ఆధ్యాత్మ సామాజిక స్పృహ కీర్తనలు ఉన్నప్పటికీ, అన్నమయ్యా కీర్తనలలో అద్భుతమైన ఉదాత్తత గోచరిస్తుంది. ఆతనిది పునీతమైన అనుభూతి. ఒక దివ్య ఆలోచనామృతం. సమస్తవేద పురాణ విజ్ఞానం. సారంగపాణిది బొప్పి కట్టిన అనుభవం. అన్నమయ్యా కీర్తనలు సామాజిక స్పృహ కల్గి, ధర్మ ప్రతిష్ఠాపన, సన్మార్గ సూచన లక్ష్యాలుగా కల్గిఉంటే, సారంగపాణి కీర్తనలు లోకానుభవతను, సమకాలీన సమాజ పతనాన్ని అభివ్యక్తీకరిస్తాయి. అంటే అన్నమయ్యా సూచనగా చెప్పినదాన్ని సారంగపాణి స్పష్టంగావివరించి విమర్శించి చూపాడు.

అన్నమయ్యా నాటి సమాజంలో ధర్మం కొరవడిందని-బాధపడుతూ
"కాలవిశేషమో లోకముగతియో సన్మార్గంబుల కీలు వదలె,
సౌజన్యము క్రిందైపోయినది - ఇందెక్కడి సంసారము ఏ దెస
చూసిన ధర్మము కరువైనది, విజ్ఞానము కడకు తొలగినది"

అని విలువల పతనాన్ని గురించి బాధచెందాడు. తప్పుచేస్తే ఫలితం తప్పదని హెచ్చరించాడు.

కలదిదివో సుఖముగలిగినను, గర్భము నిలవక మనునా

మలసి కామ్యకర్మములకు చొచ్చిన, మగుడ బుట్టువులు మానునా అని హెచ్చరించాడు.

అయితే సారంగపాణి పతనమైన విలువల స్వరూపాన్ని స్పష్టంగా వివరించి నాటి సమాజ స్థితిని ఆవిష్కరించాడు. అప్పటికే తీగలీనుతున్న ఆంగ్లేయ నాగరికతా ప్రభావానికి లోనై, శీలం పతనమౌతున్న స్థితిని గర్హించాడు. 'అసూర్యం పశ్య'లైన కులకాంతలు సైతం విశృంఖలలు కావడం చూచి, వగచి చిత్తూరులో ఆనాటి నాగరికతా ప్రభావానికిలోనైన కొందరు ఆడువారిని గురించి -

"కులకాంతలు విడిబడి నలుదిక్కుల చెలరేగిరిదేటి పాపమో
(ఇలా) అయితే వెలయాంగ్రకు జీవనమేమిక వేణుగోపాల
కుసంకరమై, ఉగదెలియని బిడ్డలనెడబాసి
ఉన్నమూట, ముంత దాటవేసి, మగనిపేరు కారాదని రోసి
మన్నెకాపురం వ్యర్థము చేసి, అందెలు మట్టెలు రవికతో చుట్టి,
అత్తమామలకు దుద్దులు బెట్టి పగలు రేయి జాగ్రత్తగా నడిచి-
బాపనింట్ల పూటకూళ్లుగుడిచి తెగువ చేసి ఠాణాలను గడచి-
తగుదుననుచు సిగ్గుశరము విడిచి
ఇంతదూరము ఎవరు వెతకరారని తలచి"

ఎలా విశృంఖలంగా ప్రవర్తిస్తున్నారో చూచి బాధపడ్డాడు.

అలాగే నాటి వేశ్యావ్యవస్థకు ఎంతగానొ చింతిస్తూ-

"మీపాదాలకు దండం, నీతల్లికొక సలాం, నీ ఇంటికిక రాం రాం
నీవే నా శాస్త్రము, నాచేత కాసుంటె నీ అక్క ఇంకొకతే
ఇన్నూరు వరహాలు తిన్నగా దాచుకొని, ఇక కదలమంటివిగా." అని నిందారోపణ గావించాడు.

అన్నమాచార్య సంకీర్తనల్లో ఇటువంటి నిందారోపణ లేదు. ధర్మం పతనమౌతున్నదని అన్నమాచార్య నైతికంగా సమాజసందేశం అందిస్తే సారంగపాణి ఆ పతనానికి ఆవేశపడి ఆ ఆవేశం పెల్లుబికి విరక్తి కీర్తనలుగా రూపం చెందాయి.

అలాగే అన్నమాచార్య శృంగార సంకీర్తనలు నాట్యానికి అనువుగా మలుచుకో గల్గినవైనా నాట్యం కోసం వ్రాసినవిగా భావించబడలేదు.

"అలరులుకురియగా ఆడినదే, అలకల కులుకుల అలర్మేల్మంగ"

"కులుకక నడవరో కొమ్మలాల" -

వంటి అనేక అన్నమాచార్య కీర్తనలు ఈనాడు నాట్యాంశాలుగా ప్రదర్శింపబడు తున్నవి. అయితే సారంగపాణి నాట్య విద్యా పారంగతుడు. స్పష్టమైన నాట్య దృష్టితో రచించిన కీర్తనలు ఆయనవి. వాటిలో ఎక్కువ పాలు క్షేత్రయ్యవలెనే నాయికా, నాయకుల ప్రేమ, విరహ సంవాద భావాన్ని ప్రకటించినవి.

దోసకారిపోవె అతడీ త్రోవ తొక్కునా వూరకే
ఆసుబోసిన కోవివలనే ఆడకు ఈడకు తిరిగేవు మాత్రమే

అందమైన వెండి మెట్టెలు సందెకాడ పంపించితే
కందుగలసిందని ఎగిరి చిందులు దొక్కుచు చిదియగొట్టిన
కరుకు వరహాలారుబెట్టి, కరకంచు చీరదీసి-
చెరగుబాగాలేదని మెటికలువిరిచి

వంటి నాయికా భావాలూ, నాయక భావాలూ సారంగపాణిలో కోకొల్లలు. కాని అన్నమాచార్యుల కీర్తనల్లో భావుకత ఇంతకంటె చాల విస్తృతము, ఉదాత్తము. సహజమైన ఎర్రని పెదవులపై ఆరోగ్యకరమైన నల్లని కస్తూరి పలుకులను అలమేల్మంగకు అన్వయించి అన్నమయ్య చెప్పిన కీర్తన శృంగారంలో అద్వైత రసానుభూతిని అందించే ఉదాత్త భావసంచయం.

ఏమొకొ చిగురుటధరమున-యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన- పత్రిక కాదుగదా.
కలికి చకోరాక్షికి గడ కన్నులు కెంపై దోచిన
చెలువంబిప్పుడు చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై - నాటిన యా కొనవు చూపులు
నిలువున బెరుకగ నంటిన - నెత్తురు కాదుగదా -
వంటి కీర్తనలు అద్భుత సంకీర్తన రసగుళికలు.

కాలం నిరంకుశుడైన కవిని కూడ శాసిస్తుంది. అయితే లక్ష్యశుద్ధి కలిగిన కవి తన కవిత్వాన్ని ఆ లక్ష్యానికి అనువుగా సృజిస్తాడు. దైవాన్నే నమ్మి పరమ భాగవతోత్తముడైన పోతన - బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకను కూళలకిచ్చి అప్పడుపుకూడు భుజింపకూడదని, ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులు సొమ్ములు గైకొన కూడదని, భగవంతుణ్ణి నమ్మి భాగవత సామ్రాజ్యాన్ని స్థాపించాడు. అయితే శ్రీనాధుడు చీనిచీనాంబరాలకి, బంగారు పళ్ళెర భోజనానికి విలువనిచ్చాడు. పోతన వలె అన్నమయ్య భగవంతుని అనురాగాన్నే కోరాడు తప్ప ఇతర సుఖాలను ఆశించలేదు. కాని సారంగపాణి శ్రీనాధునివలె రాజాశ్రయాన్ని ఆశించి, వారికి అంకితంగా కూడ పదాలు రచించాడు. కనుకనే అన్నమయ్య విస్తృత సంకీర్తనా నందనవనం నుంచి కొన్నిరకాల లతలను మాత్రమే తన సాహితీవనంలో నాటి వాటిని ప్రోది చేసాడు సారంగపాణి. ఆ విధంగా అన్నమయ్య సంకీర్తనలు సారంగపాణి మీద శృంగార, భక్తి సంకీర్తనలు వ్రాయడంలో స్పష్టమైన ప్రభావం చూపాయి అని చెప్పడానికి నిదర్శనాలు సుస్పష్టం.

ప్రసిద్ధమైన అన్నమయ్య సంకీర్తనగా అందరకుతెలిసి
"లాలనుచు నూచేరు లలన లింపునను"
అన్న పాట కొన్ని చోట్ల
"లాలనుచు నూచేరు లలనలింపునను"
శ్రీల చెన్నలరు ఉయ్యాల పాన్పులను" అని పాడుకుంటున్న
సారంగ పాణి పాటగా ప్రచారంలొ ఉండడం బట్టీ

అన్నమయ్య మంగళ హారతుల ధోరణిలో సాగినదీ-ఇప్పటికీ ప్రతి తెలుగు ఇంట ప్రతి ఉత్సవంలోను పాడుకునేదీ అయిన సారంగపాణి కీర్తన ఈ విషయాన్ని మరింతగా బలపరుస్తుంది.

ఇందిరా రమణునకు ఇభరాజ వరదునకు
మందరోద్ధారునకు మాధవునకు
నంద నందనుడైన నవనీత చోరునకు
కందర్ప శతకోటి సుందరునకు
జయ మంగళం నిత్య శుభమంగళం.

# త్యాగరాజు భక్తి వైవిధ్యం

డా. మృణాళిని

**సా**హిత్యానికీ, సంగీతానికీ అపురూపమైన సంబంధం ఉంది. అదే విధంగా సంగీతానికీ, భక్తికీ అవినాభావ సంబంధం ఉంది. భక్తికి సాహిత్య సంగీతాలను సాధనంగా చేసుకున్న వ్యక్తే వాగ్గేయకారుడు. తెలుగు సంస్కృతిలో, చరిత్రలో అరుదైన వాగ్గేయకార సంప్రదాయం ఉంది. వారిలో అగ్రపీఠాన్ని అధిష్ఠించే వ్యక్తి త్యాగరాజ స్వామి. సంగీత త్రిమూర్తుల్లో తొలి వరసన నిలిచే త్యాగరాజస్వామి తన కీర్తనల్లో భక్తిని ఎన్ని విధాలుగా, ఎంత లోతుగా, ఎంత మధురంగా ఆలపించాడన్నది ప్రస్తుతాంశం.

త్యాగయ్య జన్మించింది 1767 మే నెల 4వ తేదీన తమిళనాడులోని తిరువయ్యూరులో. ఈనాటికీ ఆ ఊరు ప్రతి జనవరిలో, త్యాగయ్య వర్ధంతి సందర్భంగా సంగీత విద్వాంసుల పంచరత్నాలాపనతో మారు మ్రోగడం మనందరికీ తెలిసిందే.

త్యాగరాజు జీవితం గురించి చాలా వరకూ మనకందరికీ తెలుసు. చిన్న ప్రాయంలోనే దివ్య నామకీర్తనలు రాసినవాడు. అంటే భక్తి అన్నది ఉగ్గుపాలతో వచ్చింది త్యాగయ్యకు. తల్లి దగ్గర్నుంచి సంగీతం, తండ్రి దగ్గర్నుంచి సంస్కృతాంధ్ర భాషల పాండిత్యం సాధించాడు. అతని జీవితమంతా భక్తి మయమే. అయితే ఆ భక్తిలో ఉన్న వైవిధ్యం అనంతమైంది. ఇతర భక్తి దాదాపుగా లేదనే చెప్పవచ్చు. ఆ రకంగా అన్నమయ్య, జయదేవుడు, మీరాబాయి, పురందరదాసుల కంటే భిన్నమైన వాగ్గేయకార భక్తుడు త్యాగయ్య. బహుశా మరో రకంగా చెప్పాలంటే, భక్తి ప్రకటనలో రామదాసుకు సన్నిహితుడు.

స్థూలంగా చూస్తే భక్తి రెండు రకాలు. 1. మోక్ష సాధనంగా భక్తి. ఇందులో భక్తి లక్ష్యం కాదు. మార్గం మాత్రమే. 2. భక్తే లక్ష్యం. ఇందులో వేరే ప్రతిఫలాపేక్షలేదు. భక్తి ప్రకటనమే భక్తుడికి బ్రహ్మానందదాయకం. త్యాగరాజుది రెండో మార్గం. ఆ భక్తి ప్రకటనకు ఆయన ఎన్నుకున్న సాధనం సంగీతం. సంగీతానికి, భక్తికి ఉన్న అభేదాన్ని ఆయన సంపూర్ణంగా అర్థం చేసుకున్నాడు. అందుకే అతని భక్తి ప్రకటన అనేక రకాలుగా ఉంటుంది.

త్యాగరాజు కాలం నాటికి, అంటే 18వ శతాబ్ది ఉత్తరార్ధానికి, సంగీతం సాహిత్యానికి, నృత్యానికి ఉపాంగంగా స్థిరపడింది. అలాగే మధుర భక్తి సంప్రదాయం అల్పుల చేతిలో పడి, తన ఉదాత్తత కోల్పోయింది. ఆ సమయంలో సంగీతాన్ని ఇతర కళలకు ఉపాంగంగా కాక, అచ్చమైన, స్వచ్ఛమైన కళారూపంగా, అందులోనూ సమగ్ర కళా రూపంగా తీర్చిదిద్దిన ఘనుడు త్యాగరాజు, అందుకే రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ఇలా అన్నారు.

'నాకు చూడగా పాటను నేర్చినంత శ్రద్ధతో ఇతను మాటను నేర్వలేదు. అతని సాహిత్యము మూడు పాళ్లు సంగీతము నాశ్రయించి ఆకు మరుగు పిందె వలె ఉన్నది. సంగీత భావము ముందర సాహిత్య భావము గౌణముగనే నడచును'. త్యాగయ్య కృతుల్లో సంగీతంలో కనిపించేంత వైవిధ్యం సాహిత్యంలో కనిపించకపోవడం ఇందువల్లే.

త్యాగరాజు భక్తిలో కనిపించే వైవిధ్యం కొన్ని శీర్షికల కింద అర్థం చేసుకోవచ్చు. ఆయన కీర్తనల ఆధారంగా ఆ భక్తిలోని రకాలను విశ్లేషించవచ్చు.

1. సంగీతానికి, భక్తికీ ఉన్న సంబంధాన్ని చెప్పేవి.
2. తత్కాల మానసిక స్థితిని వ్యక్తీకరించేవి.
3. నవ విధ భక్తులకు అనువర్తించేవి.
4. పరమార్థ తత్వాన్ని చెప్పేవి.

త్యాగరాజు దృష్టిలో, ఇంతకుముందే చెప్పినట్టు సంగీతానికి, భక్తికీ అభేదమే. ఇందులో ఏది సాధనమో, ఏది లక్ష్యమో అనుమానం వస్తుంది మనకు.

1. **'సంగీత జ్ఞానము, భక్తి వినా సన్మార్గము కలదే మనసా' అనడంలో,**
   'రాగ సుధారస పానము చేసి - రంజిల్లవే ఓ మనసా' లో
   'నాద సుధారసంబిలను నరాకృతి ఆయెరా'

'గీతార్థమూ, సంగీతానందమూ' వీటన్నిటి ద్వారా త్యాగరాజు భక్తి సంగీతాలను దాదాపు ఒక దానికొకటి పర్యాయపదాలుగా, నానార్థాలుగా ఉపయోగించాడు.

రాగ సుధారసం కీర్తనలో యాగ యోగ త్యాగ భోగ ఫలములొసగే అనడంలో రామభక్తి, నాదయోగం ఒకటేగా త్యాగయ్య భావించినట్లు స్పష్టం.

త్యాగయ్య శ్రీరాముడిని కూడా సంగీత ప్రియుడిగా వర్ణించడం విశేషం. ఆ దేవుడిని

'నారద గాన లోల, నత జన పరిపాల' అంటాడు. తను కూడ నారదుడి లాంటి వాడే కనక, 'నీవులేక త్యాగరాజు నీ గుణములనెటు పాడును?' అని ఈ కీర్తనలో ప్రశ్నిస్తాడు. సంగీత బ్రహ్మలాంటి నారదుడితో తనకు సాపత్యాన్ని అపేక్షించిన భక్త కవి త్యాగయ్య.

**2. తత్కాల మానసిక స్థితిని వ్యక్తం చేసే పాటలు.** వాటిలో భక్తి అనేక రూపాల్లో కనిపిస్తుంది. మొదట ఆయన రూపాన్ని అర్చించిన కృతులు.

1) 'అలకలల్లలాడగగని ఆ రాణ్మని ఎటు పొంగెనో' (మధ్యమావతి) అని శ్రీరాముడికి గురువయిన విశ్వామిత్రుడు, మారీచుడి మదమణచే వేళ రాముడి మనోహర రూపం చూసి ఎలా ఆనందించి ఉంటాడో అని ఊహిస్తూ గొప్ప కీర్తన రచించాడు. శ్రీరాముడికి ఉంగరాల జుట్టు ఉండేది కాబోలు. కనీసం అది త్యాగరాజు ఊహ. మారీచుడి పై బాణం వేస్తున్నపుడు, రాముడి నుదుటి మీద ముంగురులు పడ్డాయి. చేతిలో బాణం ఉంది కదా. సరిచేసుకోలేడు. అలా అలకలు ఆడుతుంటే, మారీచుడు చావబోతున్నాడన్న ఆనందం కంటే ఆ రూపాన్ని చూసిన ఆనందంలో విశ్వామిత్రుడు పొంగిపోయాడని ఊహ. అలాగే 'మోహన రామ ముఖ జిత సోమా, ముద్దుగా పల్కుమా' అంటు అతను అంత అందగాడు కనకే 'మోహము నీ పై మొనసియున్నదిరా' అంటాడు. పురుషులు సయితం మోహ పరవశులయ్యే అందం రాముడిది. అంత అందమైన రాముడు ముద్దుగా పలికితే వినాలని ఉందని అన్నాడు. ఇందాక చూస్తే చాలనుకున్నాడు...ఇప్పుడు మాటలు వినాలని కూడ ఆశిస్తున్నాడు.

ఊహా మాత్రంగానే తను ఇంత ఆనందించేస్తున్నాడు. రాముడికి దగ్గరయిన అతని తల్లిదండ్రులు, అతన్ని చూసి, తాకి, నోరారా పిలిచి ఎంత ఆనందించారో అంటారు మరో కీర్తనలో 'శ్రీరామ జయరామ, శృంగార రామయని చింతింపవేల ఓ మనసా' (యదుకుల కాంభోజి). 'తళుకు చెక్కిలి ముద్దుబెట్ట కౌసల్యమును

తపమేమి చేసెనో తెలియా, దశరథుడు శ్రీరామా రారా అని పిలువ మును తపమేమి చెసెనో తెలియా. అలాంటిదే 'సొగసు చూడ తరమా నీ నిగనిగమనుచు కపోల యుగముచే మెరయు మోము సొగసు చూడ' (కన్నడ గౌళ)

భక్తుడికి రకరకాల మానసికావస్థలుంటాయి. అది సహజం. భగవంతుడు ఒక్కోసారి వినిపించుకోడు. పరాకు వహిస్తాడు. లేదా కావాలనే పలకడు. అందుకే త్యాగరాజులో కూడ రకరకాల మూడ్స్ కనిపిస్తాయి. ఆనందం, కోపం, అలక, విషాదం, నిరాశ, వైరాగ్యం మొదలయిన భావాలు.

ఆనందానికి 'ఇంతకన్నానందమేమీ' (బిలహరి), కనుగొంటినీ, శ్రీరాముని నేడు కనుగొంటినీ, 'నిరవధి సుఖదా నిర్మల రూప నిర్జిత మునితాప (రవి చంద్రిక). రాముడులేక అసలు ఈ భూమి మీద ఏమీ జరగదనీ, అంతా నిశ్చేష్టమయిపోతుందనీ కూడా త్యాగరాజు భావన. 'నారద గాన లోల (అఠాణ). నను పాలింప నడచి వచ్చితివో

**కోపం,** - భక్తుడికి భగవంతుడి మీద అన్ని హక్కులూ ఉంటాయి. నీకు అందరికివ్వడానికీ సమయం ఉంటుందికానీ, నాకే ఉండదు అన్న అలక. నా మొరాలకింపవేమి, రామ నన్ను బ్రోవ రావెమొకో (హరి కాంభోజి)లో అందరిలో ఉండే నీకు నన్ను చూస్తేనే చులకనా అని బాధపడతాడు. 'చీమలో - బ్రహ్మలో - శివకేశవాదులలో / ప్రేమ మీర మెలగుచుండే బిరుదు వహించిన సీతారామ నన్ను బ్రోవరావే' అలాగే మరుగేలరా ఓ రాఘవా, (జయంతశ్రీ) 'అన్ని నీవనుచు అంతరంగమున తిన్నగా వెదకి తెలిసికొంటినయ్య, నిన్నె గాని మది నెన్నజాల నొరుల - నన్ను బ్రోవవయ్య- త్యాగరాజనుత' అంటాడు.

కోపం చూపించినా రాఘవుడు దయ చూపలేదు. అప్పుడిక మిగిలేది విషాదమే. వియోగమే. అతన్ని చూడలేకపోతున్నానన్న బాధ. భక్తుడికి ఏది వచ్చినా పట్టలేనంతగా వస్తుంది....అలాంటి అన్ని దశలూ త్యాగయ్య భక్తిప్రకటనలో కనిపిస్తాయి. తన విషాదాన్ని చెప్పడానికి, గతంలో ఎంత మందిని ఎంత బాగా కరుణించాడో చెప్పడం భక్తుడి పద్ధతి. వాళ్లందరి కంటే నేను తీసిపోయానా అని.

'నగుమోము కనలేని నా జాలి తెలిసి - నను బ్రోవగరాదా'

ఖగరాజు నీ యానతి విని వేగ చనలేదో - గగనానికి ఇలకూ బహుదూరంబని నాడో జగమేలే పరమాత్మా ఎవరితో మొరలిడుదూ - వగ చూపకు తాళను

నన్నేలుకోరా (అభేరి). భూమికి, ఇలకూ బహుదూరం బనినాడో- గజేంద్ర మోక్షంలో అలా అన్లేదుకదా. గజేంద్రుడు 'లావొక్కింతయు లేదు' అనగానే వెంటనే పరిగెత్తావు కదా, గరుత్మంతుడు నీ యానతి విని వెంటనే వచ్చాడు కదా, నా విషయంలో ఎందుకు ఈ తామసం? అన్న భావన భాగవత గాథతో కలిసి అద్భుతంగా పలికిన కీర్తన ఇది.

ఆ తర్వాత క్షీర సాగర శయనా, నన్ను చింతల బెట్ట వలెనా రామ ఇందులో అంటారు 'నారీ మణికి చీరలిచ్చినది నాడే విన్నానురా నీరజాక్షి కై నీరధి దాటిన - నీ కీర్తిని విన్నానురా...దయతో నన్నేలుకోరా' ఇందులో కూడా భారతంలో ద్రౌపది, రామాయణంలో సీత, కలియుగంలో రామదాసుల ప్రస్తావన, వారితో తనను పోల్చుకుని, నేనంటేనే అలుసా అని ప్రశ్నించే వేదన.

ఇది ఒక పద్ధతి అయితే, స్వీయ నింద కూడా 'ఎటుల బ్రోతువో తెలియా ఏకాంత రామయ్య' (చక్రవాకం). ఇందులో తను చేసిన పనులను, తిరిగిన తిరుగుళ్లను క్షమించి దయచేయమని వేడుకోవడం. తనకు ఎందుకు పెద్దల వలె బుద్ధీయవు అని కూడా అడుగుతాడు. 'ఉండేది రాముడొకడే ఊరకే చెడిపోకె మనసా' అంటాడు. ఇలాగే తన మనసుకు తానే బుద్ధి చెప్పుకునే మరో కీర్తన, తంజావూరు ప్రభువు కొలువుకు ఆహ్వానించినపుడు పాడిన 'నిధి చాలా సుఖమా, రాముని సన్నిధి సేవ సుఖమా' అన్నది ఎంతో ప్రసిద్ధి చెందిన కీర్తన.

భక్తుడి మానసికావస్థల్లో మరోటి- భగవంతుడిని వెక్కిరించడం / వేళాకోళ మాడడం. ఇది కూడా అద్భుతంగా చేసాడు త్యాగరాజు. కల్యాణి రాగంలో కీర్తన 'ఏ తావునరా నిలకడ నీకు? ఎంచి చూచిన నగపడవు సీతాగౌరీ వాగీశ్వరీయను స్త్రీ రూపములందా భూకమలార్కానిల నభమందా లోకకోటులందా? శివమాధవ బ్రహ్మాదుల యందా' అని విసుక్కుంటున్నట్టే అంటాడు. ఇందులో ఉన్న నిందాస్తుతి స్పష్టమే. నువ్వు లేని చోటు లేదు అని చెప్పక, నీకెక్కడా నిలకడ లేదు; ఒకేసారి ఎన్ని చోట్ల ఉంటావు, నిన్నెలా పట్టుకునేది అని విసుక్కున్నట్టు అంటాడు.

మరో విలక్షణమైనది కాంభోజి రాగం కృతి 'మా జానకీని చెట్టబట్టగా మహారాజు వైతివి' లేకపోతే నువ్వెప్పుడు గొప్పవాడివి కావాలి అని వేళాకోళమాడతాడు. చరణంలో, 'కానకేగి ఆజ్ఞా మీరక మాయాకారమునిచ్చి, శిఖి చెంతనేయుండి, దానవుని వెంటనే చని అశోక తరు మూలమున యుండి/ వాని మాటలకు కోపగించి కంట వధియింపకనే ఉండి, శ్రీ నాయకా యశము నీకే గల్గ చేయలేదా

త్యాగరాజ పరిపాల'. నిజంగా సీతమ్మ తలచుకుంటే ఒక్క చూపుతో దానవుణ్ణి భస్మం చేయగలిగివుండేది. కానీ, నీకు యశము కలగాలని పోనీ పాపమని విడిచి పెట్టింది. అంతేగానీ, రామావతారంలో నీ గొప్ప తనమేమీ లేదు, సీతమ్మ ఔదార్యమే తప్ప. అనే ఈ కీర్తన సాహిత్య పరంగానూ, సంగీత పరంగానూ త్యాగరాజు కృతుల్లో విశిష్టమైంది. 'ఓ రంగశాయి' కూడ వేళాకోళం చేసే సాహిత్యం ఉన్న కీర్తనే.

### 3. నవవిధభక్తులు:

భాగవతం చెప్పినట్టు తొమ్మిది భక్తి మార్గాలూ త్యాగరాజు కీర్తనల్లో కనిపిస్తాయి. శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం.

శ్రవణం - రామకథను వినడం కంటే ఇంకేం కావాలని అంటాడు - రామ కథా సుధారసపాన మొక రాజ్యము చేసునే - (మధ్యమావతిలో)

కీర్తనం దాదాపు అన్నిట్లోనూ ఉన్నది - సుగుణములే చెప్పుకొంటి సుందర రఘురామా.

స్మరణం ఉదాహరణ 'రామ నామ స్మరణానికి 'నీ పద చింతనే జీవనము'.

పాద సేవనానికి రఘు నాయకా నీ పాద యుగ రాజీవములనే విడజాల

'అర్చనకు' తులసీ బిల్వ మల్లికాది జలజముల పూజల గైకొనవే', అన్న కీర్తనలో పూజా విధానం మొత్తం చెప్తాడు. 'ఉరమున, ముఖమున, శిరమున, భుజమున, కరమున, నేత్రమున, చరణయుగమ్మున, కరుణతో, నెనరుతో పరమానందముతో' అన్న వర్ణనలో భక్తుడు దేవిని పూజించే అర్చన క్రమాన్ని పారవశ్యంతో ప్రకటిస్తాడు.

వందనము 'వందనం, రఘునందనా, సేతు బంధనా'లో అద్భుతంగా కనిపిస్తుంది.

దాస్యం 'నీ వాడనే గాన, నిఖిల లోక నిదాన' అన్న కీర్తనలో 'అత్యంత రూపము, అమిత బలము, నిత్యోత్సవంబుగల నీకు నిజదాసుడని - తథ్యంబు పల్కు శ్రీ త్యాగరాజార్చిత' అంటారు.

సఖ్య భక్తి -అంటే భగవంతుణ్ణి చెలికాడిగా భావించుకోవడం - ఇది కొంచెం తక్కువే త్యాగరాజులో. 'నా జీవాధార, నానోము ఫలమా, నా చూపు

ప్రకాశమా, నా జపవర్ణ రూపమా' అంటూ (బిలహరి) ఒక ప్రాణ స్నేహితుడిలా ఆరాధిస్తాడు త్యాగయ్య. అలాగే 'నీకే తెలియక పోతే నేనేమి చేయుదురా' అనే కీర్తనలోనూ, 'నన్ను బ్రోవ నీకింత తామసమా' లోనూ తనను తాను రాముడికి స్నేహితుడిగా సంబోధించుకుంటాడు త్యాగరాజు.

ఆత్మ నివేదనము - త్యాగరాజ కృతులన్నీ ఆత్మనివేదనలే. ఆయన జీవితమంతా శ్రీరాముడి అన్వేషణలో గడిపాడు. ఆ దారి పొడుగునా ఆత్మను భగవంతుడికి నివేదించుకుంటూ ప్రయాణం చేసాడు. ఈ అన్వేషణ కాలహరణమేలరా హరే అనే శుద్ధ సావేరి కీర్తనలో గొప్పగా పలికింది. 'చుట్టి చుట్టి పక్షులెల్ల చెట్టు వెదకు రీతి భువిని/పుట్టలేక నీ పదముల బట్టుకున్న నన్ను బ్రోవ - కాలహరణ మేలరా హరే దినదినమును తిరిగి తిరిగి - దిక్కులేక శరణు జొచ్చి, తనువు, మనము ధనము నీవే అనుచు త్యాగరాజ కొలువ - కాలహరణ మేలరా.

త్యాగరాజుది అత్మార్పణ తత్వం కనుక, ప్రాధాన్య విపక్షనుబట్టి వేర్వేరు వర్గాల కింద మనం విభజించినా అన్నిట్లోనూ ఉన్నది ఒకటే.

మధుర భక్తి త్యాగయ్యలో తక్కువే అయినా, కొన్ని కీర్తనల్లో ఆ భావన కూడా ఉంది. సాకేత నికేతన సాకేననగ లేదా అన్న కృతిలో 'నీకే మరులైతిని, నీకేల ఈ గుణము' అంటాడు. అలాగే 'నిను వినా నా మదెందు నిలువదే శ్రీహరి, కనులకు నీ సొగసెంతో క్రమ్మియున్నది', 'మరుగేలరా ఓ రాఘవా...తలచినంతనే నా తనువైతే ఝల్లనేరా' అని అక్కడక్కడ మధుర భక్తి ఛాయలు కనిపిస్తాయి త్యాగరాజులో.

## 4. పరమార్థ తత్వాన్ని తెలిపేవి

త్యాగరాజు తన భక్తిని భగవంతుడికి నివేదించుకోవడం మాత్రమే చేయలేదు. పరమార్థ తత్వం తోటివారికి కూడా తెలియాలని భావించాడు. పురాణాలు, ఆధ్యాత్మిక గ్రంథాల సారాన్ని తన కీర్తనల్లో పలికించాడు.

మోక్షము గలదా, భువిలో, తత్వమెరుగ తరమా, తెరతీయగ రాదా, చక్కని రాజమార్గముండగ సందులు దూరనేల, మనసు నిల్ప శక్తి లేకపోతే, జ్ఞానమొసగ రాదా మొదలయినవి ఈ తరహా కీర్తనలు.

భక్తి మార్గమే జ్ఞానాన్ని ప్రసాదిస్తుందని త్యాగరాజు విశ్వసించాడు. అందుకే 'గరుడ వాహనుడవు కనక వెంటనే వచ్చి, పరమాత్మ జీవాత్మలూ, ఈరేడు లోకాలు, దేవమానవులూ, బ్రహ్మర్షి దేవర్షులూ అన్నీ ఎల్లప్పుడూ నేనే అనే జ్ఞానం నాకు ప్రసాదించకూడదూ' అని జ్ఞానమొసగరాదా అన్న కీర్తనలో విన్నవించుకున్నాడు.

త్యాగరాజు జీవితంలో అనేక విధాలైన విమర్శలను ఎదుర్కొన్నాడు. తొబుట్టువులే అతను తన జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడని అన్నారు. అలాంటి సందర్భంలో పాడిన కృతుల్లా అని పిస్తాయి 'నాదు పై పలికేరు నరులూ, బంటు రీతికొలువియవయ్యా రామా వంటివి. ఒక్కోసారి ఆత్మ నింద చేసుకుంటూ' నీ వల్ల గుణ దోషమేమి నా వల్లనే గానీ' అని కూడ అంటాడు.

**భాగవత స్మరణః**

త్యాగరాజు భక్తిలో చాలా ముఖ్యమైన అంశం భగవంతుడితో పాటు భగవద్భక్తులను ఆరాధించడం; వారిని కీర్తించడం.

మనసు స్వాధీనమైన ఆ ఘనునికి - మరి మంత్ర తంత్రములేలా తనువు తాను కాదని ఎంచువానికి తపసు చేయనేలా' అని భక్తుడిని వర్ణించాడు.

కీర్తన రచనా శిల్పం : సాహిత్య పరంగా చూసినపుడు, త్యాగరాజు కీర్తనల్లో వర్ణనాత్మక పద్ధతిని, నాటకీయ పద్ధతిని సమపాళ్ళలో నిర్వహించాడు. శ్రీరాముడిని వర్ణించే సందర్భాల్లో అంటే, ముఖ్యంగా ఆనందాన్ని, తన్మయత్వాన్ని వ్యక్తం చేస్తున్నపుడు వర్ణనాత్మక పద్ధతి కనిపిస్తుంది. ఆవేదన, ఆత్మార్పణ సందర్భాల్లో, విభిన్న రకాలైన మానసిక అవస్థలు వ్యక్తం చేస్తున్నపుడు నాటకీయ పద్ధతి కనిపిస్తుంది. ముఖ్యంగా రాముడితో సంభాషిస్తున్నట్లు రచించిన కృతులు చాలా హృదయంగమంగా ఉంటాయి.

త్యాగయ్య రచనల్లోకెల్ల ఉత్కృష్టంగా పరిగణింపబడే పంచరత్నాల్లో భక్తి ప్రకటన వైవిధ్య భరితంగా ఉంటుంది.

నాట రాగంలోని జగదానంద కారక, జయ జానకీ ప్రాణ నాయకా కీర్తనలో శ్రీరాముడి సౌందర్యం, అతని సమక్షంలోని దివ్యభావన ఆనందం వర్ణింపబడ్డాయి.

గౌళ రాగంలోని దుడుకూ గల నన్నే దొర ఆత్మ నిందకు సంబంధించింది. ఎవరూ కరుణించలేనంత దుష్ట మనస్తత్వం కలిగిన తనను ఒక్క రాముడే బ్రోవగలడని ఆయన భావన.

ఆరభి రాగంలోని సమయానికి తగు మాటలాడెనే - భగవంతుడికి ఆత్మ నివేదనం చేసుకోవడం.

వరాళి రాగంలోని కనకన రుచిరా, నవవిధ భక్తుల్లో వందనం కోవకు చెందింది. భగవంతుడిని అన్ని రకాల రూపాల్లో వర్ణించడం.

శ్రీ రాగంలోని ఎందరో మహాను భావులు - భక్తి తత్వాన్ని తన వంటి భక్తులతో పంచుకునే కొత్త ప్రక్రియ. భాగవతుల్ని కొలవడం భగవంతుడి పూజతో సమానమనే భావన కలిగించే అద్భుతమైన కీర్తన ఇది.

త్యాగరాజు భక్తి మార్గానికి సంబంధించి ఇంతవరకూ చెప్పింది స్థూల వివేచన మాత్రమే. ఒక్కొక్క అంశాన్ని అధ్యయనం చేస్తే ఆయన రచించిన దాదాపు 700 కీర్తనల్లోనూ అనల్పవైవిధ్యం మనకు కనిపిస్తుంది.